| ఆదాయం | 05 | రాజపూజ్యం | 03 |
|---|---|---|---|
| వ్యయం | 05 | అవమానం | 01 |



# మేష రాశి

అశ్విని 1,2,3,4,భరణి 1,2,3,4, కృత్తిక 1

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు రాజయోగప్రధముగా ఉన్నది. నూతన కార్యములను ప్రారంభంచేసి విజయాన్ని పొందుతారు. కుటుంబ,ఆర్థిక వ్యవహారాలు సాను కూలముగా ముందుకు సాగుతాయి. సోదర, బంధువర్గమునుండి కొంత వ్యతిరేకత వ్యక్తమగును. గృహమున గృహసంబంధ వ్యవహారాలు సంవత్సరాంతమున పూర్తిఅగును. మంచి ఆలోచనలతో ముందుకు సాగుతారు. శత్రు,కోర్టు వ్యవహారాలలో లాభముతో పూర్తిఅగుతాయి. జీవిత భాగస్వామి వలన ధనాలాభము కలుగుతుంది. ఆకస్మిక దూరప్రాంత ప్రయాణాలు,ధనాలాభము విశేషంగా కలుగుతుంది. పిత్రార్జితము చేతికందుట కష్టము. చేయువృత్తి, వ్యాపారములయందు గుర్తింపు పొందుతారు.

వ్యవసాయదారులకు రెండు పంటలు కలసివచ్చును. విద్యార్థులకు ఉన్నత చదువుల కొరకు విదేశాలకు వెళ్ళుదురు. పురోహిత, జ్యోతిష,వాస్తు పండితులకు నూతన ఆదాయ మార్గాలు ఏర్పడి ఆనందాన్ని కలిగిఉంటారు. డాక్టర్లు,ఇంజనీర్లు,లాయర్లకు ధనలాభమే మెండుగా ఉండును. కంప్యూటర్ రంగము వారికి అశుభప్రదముగా యున్నది. రాజకీయ నాయకులకు పదవీచ్యుతి ఉన్నను సంవత్సరాంతమున తిరిగి పొందుతారు. ఈ రాశి స్త్రీలకు నూతన కార్యాలను ప్రారంభంచేసి
ఉత్సాహముతో ముందుకు సాగుతారు.

**పరిష్కారములు :** లక్ష్మీగణపతి హెూమం మరియు గణపతి ఆరాధన ఉత్తమం.

## నక్షత్ర ఫలితాలు

అశ్విని– అనవసరమైన విషయాలతో తలమునకలవుతారు. ఆర్థికపరిస్థితిలో మార్పులు చోటుచేసుకుంటాయి. శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. వృత్తి,ఉద్యోగరంగాల్లో అభివృద్ధి ఉం టుంది. శుభవార్తలు వినడంవలన సంతోషం కలుగుతుంది.

భరణి– దైవదర్శనాలు ఎక్కువగాచేస్తారు. కుటుంబవిషయాలు సంతృప్తినివ్వవు. ఆరోగ్య ఇబ్బందులతో సతమతమవుతారు. వ్యవసాయ రంగంలోనివారికి లాభదాయకంగా ఉంటుంది. ఆత్మీయులు సహకరిస్తారు. కృత్తిక –విద్యార్థులు యుక్తి చాతుర్యాన్ని ప్రదర్శించి విజయాన్ని సాధిస్తారు. నూతన కార్యక్రమాలకై చక్కని రూపకల్పన చేస్తారు. వ్యాపార రంగంలోని వారు జాగ్రత్తగా ఉండవలసివస్తుంది. పిల్లల గూర్చి ఎక్కువఖర్చుచేస్తారు.

**చైత్రము :**శుభాశుభ మిశ్రమంగా వుంటుంది. దూరదృష్టితో న్యాయంగా నడచుకొనుట మేలు. అత్యాశకువెళితే నష్టాలుతప్పవు. చేయు ప్రతిపనియందూ లాభాలు కల్లుతున్నప్పటికి జేబులోమాత్రం డబ్బునిలువదు. కుటుంబములో చేయు పనులకు భార్యాబిడ్డల సహకారము లుండును. వృత్తి, ఉద్యోగ, వ్యాపార రంగములందు అభివృద్ధి ధనధాన్య లాభములు కలుగును.

**వైశాఖము :**వృత్తి,ఉద్యోగ,వ్యాపారవ్యవహారాదులు ఒకింతఅనుకూలిస్తాయి. కోపము, ఉద్రేకము తగ్గించుకుంటే మరింతగా కలిసివస్తుంది. వివాదాల్లో చిక్కుకోకుండా జాగ్రత్తపడగలరు. అవగాహనలోపంఅధికఖర్చులకు, మాటపట్టింపులకుదారితీయగలదు. తోబుట్టు వులతో ఏర్పడ్డస్పర్థలు తొలగిపోతాయి. డబ్బుమాత్రంవిపరీతంగా ఖర్చుకాగలదు. బంగారుషాపువారికి, బంగారు వస్తువులు చేయువారికి సామాన్య ఫలితాలే వుంటాయి.

**జ్యేష్ఠము:**వ్యాపారములందు ధనదాన్యలాభములుకలుగును. మీ శ్రమకు తగిన ఫలితములుపొందుదురు. కుటుంబంలో ఆనందము,సుఖసంతోషములు,నూతన అవకాశ ములు, ఆశలు రేకెత్తిస్తాయి. అన్నిరంగాలవారు శ్రమకుతగిన ఆదాయంపొందుతారు. స్వల్ప అనారో గ్యానికి గురయ్యేసూచనలున్నాయి. తొందరపాటు, దుడుకుతనం తగ్గించుకుంటే మరింత మెరుగైన ఫలితాలు మిమ్మల్నివరిస్తాయి. వాహనకొనుగోలు ప్రయత్నం కలిసిరాగలదు.

**ఆషాఢము :** వివాహాది శుభకార్యప్రయత్నములు చేయుదురు. గ్రామీణా కోర్టు వ్యవ హారములు అనుకూలముగా యుండును. మిలటరీ, పోలీసు,విద్యుత్తు, రెవిన్యూశాఖలందు పని చేయు ఉద్యోగులకుప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు అనుకూలబదిలీలు,అదనపుఆదాయము కలుగును. విద్యలందుమేలు,వినోదములుతిలకించుట,కళలయందు నిపుణ త్వముండును. వ్యాపారమునందు వాణిజ్యమునందు, సేద్యమునందు అనుకూలతలు ప్రాప్తించును.

**శ్రావణము :** కుటుంబములోనివారు మంచిఆరోగ్యము ఆనందము కలిగి యుం దురు. చేయుపనులందు ధనలాభము, గౌరవము, కీర్తిప్రతిష్ఠలు కలుగును. వ్యవసాయముతప్ప అన్నిరంగములవారికి అదృష్టదాయకముగా యుండును. ప్రతిపనినిఉల్లాసము,మనోధైర్యముతో చేయు దురు. క్రయవిక్రయములు ఎగుమతులు దిగుమతులు, చేయువారలకులాభదాయకముగా యుండును.

**భాద్రపదము :**నూతన వస్త్రాభరణములు, బహుమతులు ఇచ్చుట పుచ్చుకొనుటలో సంతోషపడుదురు. గృహమందుండు వారి అభిప్రాయ ములనుకూడా పరిగణలోనికి తీసుకొనుట మేలు. కడుపు, మోకాళ్లు వ్యాధులు రాకుండా మితాహారము, వేళక్రమము తప్పకుండా భోజనములు చేయుట మేలు. పుత్రసంతతి, ప్రవర్తన, చదువులందు, కుటుంబపను లందు సంచరించువిధానము నేర్పుగానేర్పుకోవాలి. ప్రవర్తన హద్దుమీరితే అవస్థలకు గురియగు సూచనలు.

**అ.ఆశ్వీయుజము :**ఎన్ని వ్యతిరేకతలున్నను వాటిని తెలివితో అధిగ మింతురు. గృహమందు స్త్రీసౌఖ్యము, చేయువృత్తి, ఉద్యోగ, వ్యాపారములందు పోటీతత్వములు ఎక్కువగా యుండును. విద్య, వైద్య, సాంకేతిక, కంప్యూటర్ రంగములవారికి అత్యంత లాభదాయకముగా యుండును. సంచారవృత్తులవారు ఆరోగ్యరీత్యా తగుజాగ్రత్తలుపాటించాలి. వ్యాపారులకు పెట్టుబడి కొరతలుండవు. రైస్‌మిల్లర్స్, ఇండస్ట్రీల్, పరిశ్రమలునడుపువారికి విద్యుత్తుకొరత తప్ప ఇబ్బందులుండవు.

**ని.ఆశ్వీయుజము :**పిల్లల భవిష్యత్తుకు సంబంధించి శుభవార్తలు వింటారు,చదువుసంధ్య లందు అదృష్టవంతులవుదురు. గృహమందుదైవపుణ్య కార్యములుచేయుదురు. వాహనములు నడుపుటందు తగిన జాగ్రత్తలుపాటించాలి. చేయుపనులందుఆదాయంసంతృప్తికరము. తండ్రిదాయాదులరీత్యా సహాయసహకారములు కలుగును. వృత్తి, వ్యాపార,రాజకీయరంగములందుఇబ్బందులుతొలగిక్రమముగా అభివృద్ధి.

**కార్తీకము :**ప్రతిపనియందు పట్టింది బంగారమన్నట్లు ఉండును. గృహమందు వివాహాది శుభకార్యములు అనుకూలించును బంధుమిత్రుల సహాయ సహకారములను పూర్తిగాపొందుదురు. సామాన్యఅనుకూల ఫలితములుకలుగును. వస్త్రలాభము, ధనధాన్య లాభములు,మనోధైర్యము,క్రయవిక్రయములందు అనుకూలతలుండును. కళలయందు నైపుణ్య ముండును. విద్య, వైద్య, వ్యాపార, కంప్యూటర్ రంగములవారికి లాభదాయకముగా యుండును. స్పెక్యులేషన్స్ అనుకూలించును.

**మార్గశిరము :**తల్లితండ్రులు,బంధుమిత్రులరీత్యా సహాయసహకారముండును. వ్యవసాయ రీత్యా మరియు వృత్తి,ఉద్యోగ,వ్యాపారములరీత్యా ధనలాభము కలుగును. స్థిరాస్తులు,భూములు, అపార్టుమెంటులు కొనుగోలు ప్రయత్నములు అనుకూలించును. వృత్తి,ఉద్యోగ,వ్యాపారరంగములందు శ్రమకు మించిన ఆదాయము కలుగును. మీ హెూదాకు తగినరీతిగా మీ పనులు చేయుదురు. ధనాదాయమునకు లోటు ఉండదు. ఏదో అంతు తెలియని అసంతృప్తి ఆవేదనలు చోటు చేసుకొనును.

**పుష్యము :**కొబ్బరిబొండాలు, కూల్‌డ్రింక్స్, శీతలపానీయములు అమ్మువారలకు అత్యంత లాభదాయకముగా యుండును. పర్యవేక్షణ లోపములు ఉండరాదు. స్థానభ్రంశము ధనవ్యయము ఇంటికి దూరముగా ఉండవలసి వచ్చుట జరుగును. హెూదాకు తగ్గట్టు ధార్మికజీవితం గడుపుతారు. వైద్య, కంప్యూటర్, టెక్నికల్ వృత్తులవారికి మంచి రాణింపుకలుగుతుంది. నూతనవ్యాపార ప్రయత్నాలు అనుకూ లిస్తాయి. శ్రమకుతగిన ఆదాయంలభిస్తుంది. ఇంట్లోకుటుంబ సభ్యులమధ్యఅవగాహన లోపించ గలదు.

**మాఘము :**ప్రతిపనిని శ్రద్ధతో పట్టుదలతో పెద్దలు అనుభవజ్ఞుల సలహాలు పాటించుట మేలుగాయుండును. బంధుమిత్రులలో ఉన్నభిన్నాభిప్రాయములున్నందున మీకు నిలకడలోపిస్తుంది. డాక్టర్లు,ఇంజనీర్లు,లాయర్లు,టెక్నికల్ ఉద్యోగులకుఆదాయము క్షీణిస్తుంది. తల్లితండ్రులు, మేనమామలరీత్యా అనుకూలతలు,ఆదాయము, లాభములుకలుగును. విశేషశ్రమతో వ్యవసాయపనులు పూర్తి చేయుదురు. పూర్వార్జితఆస్థులపై ఆదాయమునుపొందుదురు. వాహనములు,భూములు,అపార్టుమెంటులు కొనుగోలు చేయుదురు.

**ఫాల్గుణము :** గుమస్తాలు, జాయింటు దారులను గుడ్డిగానమ్మితే మోసపోవుదురు. ఉద్యోగులకు స్థానచలనము అనుకూలములేని బదిలీలు కలుగును. గురువులను, దైవములను పూజించి మానసిక ప్రశాంతత కలిగియుందురు.

| ఆదాయం | 14 |
|---|---|
| వ్యయం | 11 |



# వృషభ రాశి

| రాజపూజ్యం | 06 |
|---|---|
| అవమానం | 01 |

కృత్తిక 2,3,4, రోహిణి 1,2,3,4, మృగశిర 1,2

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు ఏపని ప్రారంభంచేసినను దిగ్విజయముగా ముందుకు సాగుతారు. ఆర్థికపరమైన చికాకులు అధికంగాఉండవచ్చును. అన్నదమ్ముల సహకారం అందుతుంది. గృహమున శుభకార్యాలకోసం ధనాన్ని వెచ్చిస్తారు. పుత్రసంతానము లేనివారికి సంవత్సరాంతమున కలుగును. కోర్టు,శత్రుకార్యాలు కొలిక్కివచ్చి విజయవంతంగా పూర్తిచేస్తారు. భాగస్వామ్యవ్యవహారాలు లాభసాటిగా ఉంటాయి. ఆకస్మిక ధనలాభము కలుగుతుంది. గతంలోనిలచిపోయిన ఆస్థివ్యవహారాలు ఈ సంవత్సరంలో పూర్తిఅవుతాయి. చేయువృత్తి, ఉద్యోగమునందు శారీరకశ్రమ అధికంగా ఉంటుంది. లాభాలవిషయంలో జాగ్రత్త వహించుట మేలుగాఉన్నది. సుఖముగా నిద్రపట్టును.

వ్యవసాయదారులకు మొదటిపంటకన్నా రెండవ పంట మేలుగా ఉన్నది. విద్యార్థులకు పోటీపరీక్షలయందు సాధనచేసి ఫలితాన్ని పొందుతారు. డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లకు నూతన ఆదాయము ద్వారా సుఖాన్ని అనుభవిస్తారు. కంప్యూటర్ రంగము వారికి శుభప్రదముగా యున్నది. రాజకీయ నాయకులకు తామున్నపదవులయందు నిర్లిప్తత ఏర్పడుచుండును. ఈ రాశి స్త్రీలకు కుటుంబమున సంఘమున గౌరవము తగ్గేసూచనలు కలవు.

**పరిష్కారములు :** దుర్గాఆరాధన, నవరాత్రులదీక్ష(లేదా)భవానీదీక్ష చండీహెూమం శ్రేయోదాయకం

## నక్షత్ర ఫలితాలు

కృత్తిక – శుభకార్యములకై ఎక్కువ వ్యయప్రయాన లుంటాయి. కుటుంబ పరిస్థితులు సంతృప్తికరంగానుండవు. అనవసర ప్రయాణాలు ఎక్కువ చేస్తారు. ఆర్థిక ఇబ్బందులెదురవుతాయి. ఋణయత్నాలు ఆలస్యంగా ఫలిస్తాయి. ఆరోగ్యం గూర్చి శ్రద్ధ అవసరం.

రోహిణి – మానసికాందోళనతో కాలం గడుపుతారు. దైవ కార్యక్రమాల్లో పాల్గొనుటకు ప్రయత్నిస్తారు. ప్రయాణాలు వాయిదావేసుకోవాల్సి వస్తుంది. నూతన కార్యక్రమాలలో పాలుపంచు కొనుట మంచిది.

మృగశిర – ధనలాభాన్ని పొందుతారు. వృత్తి,వ్యాపార రంగాల్లో అభివృద్ధి ఉంటుంది. నూతన కార్యాలు ప్రారంభిస్తారు. ఆర్థిక ఇబ్బందులు తొలగిపోతాయి. విద్యార్థుల విశేష కృషి ఫలిస్తుంది. నూతన వస్తు, ఆభరణాలను కొనుగోలు చేస్తారు.

**చైత్రము :** వ్యవసాయరీత్యా గతముకంటె కొంత అనుకూలతలుండును. మహిళామండలి, డ్వాక్రాగ్రూపులు, డైయిరీ ఫారము లు,పాలు,పెరుగు విక్రయదారులకు ప్రోత్సాహము, లాభదాయ కముగా యుండును. తల్లితండ్రులు, మేనమామలు, దూరపుబంధుమిత్రుల వలన మేలుకలుగును. తలపెట్టిన ప్రతిపనిని సునాయాసముగా పూర్తిచేయుదురు. సరికొత్తపథకములు, వ్యాపారములు,గుమస్తాలు మరియుజాయింటుదారుల వలన లాభముచేకూరును.

**వైశాఖము :** చిన్ననాటి మిత్రులను కలుసు కుంటారు. వ్యవసాయదారులకు పనులు సజావుగాసాగును. ఫర్టిలేజరు, రసాయనిక ఎరువులు అమ్మువారికి లాభదాయకముగాను, వ్యవసాయకూలీలకు, తాపీపని కూలీలకు డిమాండ్‌గా యుండి ఆదాయమును పొందుదురు. కుటుంబసభ్యుల ద్వారాకొంత పూరటపొందుతారు. స్త్రీ మూలంగా ధనాదాయం చేతికందుతుంది. గతంలోవున్న అధికఖర్చులు అదుపులోకివస్తాయి.

**జ్యేష్ఠము:** గృహమందుచక్కటిఆహ్లాదకరవాతావరణముకలుగును. గృహములు, భూములు,అపార్టుమెంట్లు కొనుగోలు చేయువారలకుఅనుకూలతలుగాయుండును. బంధుమిత్రుల రీత్యా ఆర్థిక సహాయములుకలుగును. ధనాదాయముబాగుండును. మానసికవత్తిడిలున్ననుసౌఖ్యవంతముగా జీవనము సాగింతురు. అందరికి అనుకూలమైన నిర్ణయములుతీసికొని మంచిఅనిపించుకొందురు.

**ఆషాఢము :** అనేకవృత్తులుచేయుదురు. మీకుఅనుకూలమైన చేయగలిగినంతలోఒకేవృత్తి,వ్యాపారములను ఎన్నుకొనుటమంచిది. అన్నదమ్ములు,దాయాదులరీత్యావ్యతిరేకతఏర్పడగలదు. అధికశ్రమ, స్వల్ప ఆదాయాలు స్వల్ప ఆదాయాలుమాటలోకాఠిన్యము, తొందరపాటు, లెక్కలేనితనము తగ్గించుకొనుటద్వారా అనేక ఇబ్బందులు ఎదురుకాకుండా అడ్డుకోగలరు.

**శ్రావణము :** వస్త్రవ్యాపారములు,బంగారు నగరు,ఫ్యాన్సీ, ఫర్నీచరులుఅమ్మువారికి యోగదాయకముగా యుండును. ఎసిడిటీ, ఇతర జీర్ణకోశ వ్యాధులు కొలదిగా ఇబ్బందిని కలిగిం చును. సంతానమురీత్యా చిక్కునమస్యలుకలుగును. వాటిని తగు జాగ్రత్తగా సవరించుకొందురు. హెూదాకు తగ్గట్టు హుందాగావ్యవహరిస్తారు. మాటల్లో, చేతల్లో తొందరపాటు తగ్గించగలరు. కుటుంబంలో స్వల్ప అనారోగ్యం చోటుచేసు కుంటుంది. టెక్నికల్ చేతివృత్తుల వారికి తగిన ప్రోత్సాహము ధనధాన్యలాభములు కలుగును.

**భాద్రపదము :** సొమ్మువృథాకాకుండా జాగ్రత్తలుపాటించుటమేలు. శుభకార్యములు, సంబంధిత వ్యవహారములందుసందిగ్ధతలు తొలగించుకొనుటమేలు. ఆదాయముశ్రమకు తగినట్లుండును. వ్యాపారులకు ఉత్సాహముండును. ఎవరితోను అతిగామాట్లాడకుండుట మేలు. ఆధ్యాత్మిక కార్యక్రమ ములో పాల్గొనుట వలనఆత్మశాంతికలుగును. పనిలేని పనులు,వృథాఆలోచనలు, ప్రభుత్వరీత్యా పనులతో విలువైనకాలము.

**అ.ఆశ్వీయుజము :** పాతబాకీలు తీర్చుదురు. కుటీరపరిశ్రమలు, మధ్యతరహావ్యాపారులు, చేతివృత్తులవారికి చేయూతగా యుండును. వ్యసనముల విషయములలో జాగ్రత్తలు పాటించుటమేలు. ప్రభుత్వఉద్యోగులు, రాజకీయనాయకులకు దిగువవారు సహక రించరు. అధికారులవత్తిడి అధికముగా యుండును. అన్నతమ్ములు తండ్రిదాయాదులతో అనుచితముగా ప్రవర్తించుట మేలు.

**ని.ఆశ్వీయుజము :** గృహ మందు శుభకార్యములు దైవ, పుణ్యకార్యములు చేయుదురు. బంధుమిత్రులతో సంతోషింతురు. ఉద్యోగులు, పై అధికారుల మన్ననలనుపొంది ఉన్నస్థానములను చేరుకొందురు. ధనము పలుకబడి కూడాపొందుదురు. పాలకేంద్రములు,మహిళాఉద్యోగులు,మహిళారాజకీయనాయకులకు మహార్దశా కాలముగా గుర్తించగలరు.

**కార్తీకము :** వృత్తి మూలకంగా ధనలాభము,బంధుమిత్రదర్శనం, ప్రతిభ, ప్రావీణ్యంతో వచ్చే అవకాశములను సద్వినియోగముచేసుకుంటారు. కళలు,అంతగా అనుకూలతలుండవు. శ్రమకు తగిన ఫలితములుకలుగును. కుటుంబసభ్యులు సంతోషకరవాతావరణముఏర్పడుతుంది. ఋణదాతల వత్తిడివున్నా బంధుమిత్రులసహాయ సహకారాలతో మాటల మంచితనముతోవారిని సంతృప్తిపరుస్తారు.

**మార్గశిరము :** ఇటుకబట్టీలు,పప్పులబట్టీలు,కుమ్మర్లు,కమ్మర్లు, హెూటల్స్ తదితర అగ్ని సంబంధ వృత్తులవారికివ్యతిరేకతలుచేదుఅనుభవములు, కలుగకుండా జాగ్రత్తలుపాటించాలి. దూరపుప్రయాణములు వాయిదాలుకోరుటమేలు. బంధుమిత్రులతో ఇష్టాగోష్టి చర్చలుచేయుదురు. గృహమందు వాహనము లకుమరామత్తులుఅధికమగును. మిలటరీ, పోలీసు,విద్యుత్తు రంగములందుండు ఉద్యోగులు ప్రతివిషయములోను అప్రమత్తముగా ఉండాలి.

**పుష్యము :** సాహిత్య,సంగీత,నృత్య,నాట్య, శబ్దశాస్త్రములందు పనిచేయువారలకు ప్రోత్సా హం, అభివృద్ధి,ఆదాయము కలుగును. నూతనవ్యక్తుల పరిచయమువలన మేలుకలుగును. దూర ప్రయాణములు అనుకూలించును. రాజకీయ,కోర్టువ్యవహారములు అనుకూలముగా యుండును. వృత్తి,ఉద్యోగ,వ్యాపార వ్యవహారములందు ధనధాన్యలాభములు, కుటుంబ మున సుఖశాంతులుండును. భాగస్వామ్య సంబరాలు సంతోషాన్నిస్తాయి. దీర్ఘకాలిక ప్రణాళికలు తయారుచేసుకొనిముందుకుసాగిపోవుదురు.

**మాఘము :** పాలు, పెరుగు, వెండి, బంగారము వ్యాపారులకు లాభదాయకముగా యుండును. స్త్రీలు నిర్వహించు సంస్థలు మంచి లాభదాయకముగాయుండును. వస్త్రము, ఫ్యాన్సీ వస్తువులు అమ్మువారికి అత్యంతలాభములు కలుగును. విందులు,వినోదములతో కాలము గడుపు కొందురు. చేయుప్రతిపనియందు అన్న తమ్ములు దాయాదుల సహాయసహకారములుకలుగును. శ్రమకుతగిన ర్యాంకులువచ్చి చదువులకు సీట్లు పొందుదురు.

**ఫాల్గుణము :** గతంలోనిలచిపోయిన ఆస్థివ్యవహారాలు ఈ సంవత్సరంలో పూర్తిఅవుతాయి. చేయువృత్తి, ఉద్యోగమునందు శారీరకశ్రమ అధికంగా ఉంటుంది. లాభాలవిషయంలో జాగ్రత్త వహించుట మేలుగా ఉన్నది. సుఖముగా నిద్రపట్టును.

| ఆదాయం | 02 | | రాజపూజ్యం | 02 |
|---|---|---|---|---|
| వ్యయం | 11 | | అవమానం | 04 |



# మిథున రాశి

మృగశిర 3,4, ఆరుద్ర 1,2,3,4, పునర్వసు 1,2,3

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు అనేక సమస్యలతో సతమతమవుతూ ముందుకు సాగవలసి వచ్చును. నమ్మినవారితో విభేదాలు వస్తాయి. భాగస్వామ్య వ్యాపారాలు లాభించవు. తమంతటతాము సొంతనిర్ణయాలు తీసుకొని మసలుటమేలు. కుటుంబమున మాత్రము సంతోషాన్ని పొందుతారు. సోదర,బంధువర్గమునుండి సహకారము అందుట కష్టము. ఆదాయము తక్కువగా ఉన్నను గృహప్రయత్నంచేస్తారు. మంచి ఆలోచనలున్నను ముందుకు సాగుటకష్టము. శత్రు,కోర్టు వ్యవహారాలు సంవత్స రాంతమున పూర్తిఅవుతాయి. జీవిత భాగస్వామివలన కొంతచికాకుల ఏర్పడతాయి. చేయువృత్తి,ఉద్యోగములయందు తీవ్రవ్యతిరేకత వ్యక్తమవుచుండును. ఎన్ని సమస్యలున్నను సుఖనిద్రద్వారా ఆనందాన్ని పొందుతారు.

వ్యవసాయదారులకు పంటలు పండినను ఆదాయము తగ్గును. విద్యార్థులకు విద్యాసంబంధ విషయాలో ఆటంకాలు కలుగుతూ ఉంటాయి. పురోహిత,జ్యోతిష,వాస్తు పండితులకు నూతన ఆదాయమార్గాలు ఏర్పడతాయి. డాక్టర్లు, ఇంజనీర్లు,లాయర్లకు తమవృత్తులకు న్యాయముచేయుట వలన కీర్తిపెరుగుతుంది. రాజకీయ నాయకులకు విదేశీయానము కలుగు సూచనలుకలవు. ఈ రాశి స్త్రీలకు కుటుంబమున శారీరకముగా అనారోగ్యము సంభవించును.

**పరిష్కారములు :** రుద్రాభిషేకం,సోమవారం శివారాధన, దర్శనం, రుద్రహోమం.

## నక్షత్ర ఫలితాలు

మృగశిర :- సంఘంలో అప్రతిష్ఠ రాకుండా జాగ్రత్తపడుట మంచిది. ప్రయత్న కార్యాలకు ఆటంకాలె దురవుతాయి. సోదర వైరం కలిగే అవకాశముంటుంది. అల్పభోజనం వల్ల అనారోగ్యాన్ని పొందుతారు. వీలైనంతవరకు సత్యమును మాట్లాడుటమంచిది. నూతన కార్యాలు ప్రారంభించరాదు.

ఆరుద్ర – ప్రయత్నం మేరకు స్వల్ప లాభముంటుంది. పుణ్య క్షేత్రములకు ప్రయాణాలెక్కువ చేస్తారు. అనారోగ్య బాధలు దూరమవుతాయి. నూతన కార్యాలకు శ్రీకారం చుడతారు. క్రీడాకారులకు, రాజకీయరంగాల్లోన్నివారికి ఊహించని లాభాలుంటాయి.

పునర్వసు– నూతన వస్తు ఆభరణాలను పొందుతారు. ఆకస్మిక ధనలాభముంటుంది. కీర్తి,ప్రతిష్టలు అధికమవుతాయి. శత్రు బాధలుండవు. ఉద్యోగంలో ప్రమోషన్లు వస్తాయి. కవులకు, కళాకారులకు బహుమతులు అందుతాయి.

**చైత్రము :**మహిళారాజకీయ నాయకులకు,మహిళలు నిర్వహించు విద్యాసంస్థలు, పాలు,పెరుగు, పాడిపరిశ్రమ, కోళ్ల పరిశ్రమ, చేపలు,కూరగాయలు,క్రయవిక్రయములు చేయువారికి ఆదాయములుండును. మెకానికులు, వెల్డింగ్ షాపుల వారు, పప్పులమిల్లులు,అగ్నిసంబంధ వృత్తుల వారికి మంచి అనుకూలముగాయుండును. రాజకీయములందు, ప్రభుత్వ వ్యవహారములందు,బంధు మిత్రులందు అనుకూలతలు. ఆర్థిక ఇబ్బందులుకలుగును. భూవివాదములకుఎంతదూరముగా ఉంటేఅంతమంచిదిగా గుర్తించగలరు. మాటలు ఆచి తూచి జాగ్రతగా మాట్లాడుటమేలు.

**వైశాఖము :**అన్నిరంగములవారికి చిక్కులు,చికాకులు అధికముగాయుండును. ప్రతిపనియందు ప్రయత్నకార్యభంగము,ఆటంకముతో వాయిదాపడును. గుమస్తాలు, జాయింటుదారులను పూర్తిగా నమ్మక పర్యవేక్షణలో వుండాలి. కుటుంబములో పెద్దలఆరోగ్యరీత్యా వ్యయప్రయాసలుకలుగును. నూతనవ్యక్తులు మాటలునమ్మి అత్యాశకుపోయి మోస పోకుండుట మేలు. స్థిరాస్తులు మార్పులుచేర్పులు, గ్రామీణ కోర్టు వ్యవహా రములు వాయిదాలు వేసుకొనుట మేలు.

**జ్యేష్ఠము:** కుటుంబములోని పెద్దలఆరోగ్యము కుదటబడును. సంతానరీత్యా సమస్యలకు బంధుమిత్రులద్వారాపరిష్కారములు చేయుదురు. వ్యాపారులు పెట్టుబడుల విషయములో తగుజాగ్రత్తలుపాటించాలి. ముందు మీశక్తికి తగిన పనులు ఎన్నుకోవాలి. కుటుంబములో అనుకూలత, ఆనందము, అభివృద్ధి, ధనాదాయము ఆశించినంతలో పెరుగుతుంది. గతమునుండి వ్యయప్రయాసలతో నడుపుతున్న విద్యాసంస్థలు, వ్యాపారసంస్థలు, భారీపరిశ్రమలు, మంచిలాభములు బాటలో సాగును.

**ఆషాఢము :** కుటుంబములో అనుకూలత,ఆనందము,అభివృద్ధి,ధనాదాయము ఆశిం చినంతలో పెరుగుతుంది. గతమునుండి వ్యయప్రయాసలతో నడుపుతున్నవిద్యాసంస్థలు, వ్యాపార సంస్థలు, భారీపరిశ్రమలు, మంచిలాభములు బాటలోసాగును. నిరుద్యోగులకు ఉద్యోగఅవకాశములు. ఆర్థికఇబ్బందులు వెంటాడును. వృధాశ్రమయగు ప్రయాణములు, పనికిమాలిన పనులు కల్పించు కొందురు.

**శ్రావణము :** బంధుమిత్రులతో అవగాహనా లోపములవలన విభేదములు కలుగును. వృత్తిఉద్యోగములందు అనుకూలతలుగాయుండును. స్థంభించిన న్యాయసంబంధ విషయములు కొలిక్కివస్తాయి. వాహనములు నడుపుట లో తగుజాగ్రత్తలు పాటించాలి. స్థిరాస్తులుఅమ్మవలసి వచ్చుట లేదా తాకట్టుపెట్ట వలసిన అవసర ములు కలుగును.

**భాద్రపదము :**సాంకేతిక అభివృద్ధి కలుగును. స్పెక్యులేషన్స్అనుకూలించును. సంతతిమూలకము సంతోషకరమైనవార్తలువిందురు. వ్యవహారములందు జయము, అభ్యున్నతి కలుగును. ప్రతిపనియందు ఏకాగ్రత్తతో వ్యవహరిస్తారు. కుటుంబములో ఆరోగ్యము,ఆనందము,మానసిక స్థితిగతులు సంతృప్తి కరముగా యుండును.

**అ.ఆశ్వీయుజము :**గతములోయున్న ఇబ్బందులు క్రమముగా తగ్గుముఖముపట్టును. భార్య ఆస్థులరీత్యా ఆదాయముచేతికిఅందును. మీపనులందు భార్యాబిడ్డల సహాయ సహకారములు కలుగును. ప్రయత్నించిన కార్యములుపట్టుదలతో చేసిన పూర్తియగును. విలువైన వస్తువులుకొనుట,గృహనిర్మాణము లందు తగుజాగ్రత్తలు తీసుకొనుటవలన అనుకూలించును. సంఘమునందు గౌరవము,నూతన కార్యలాభము

**ని.ఆశ్వీయుజము :**విద్య, వైద్య కంప్యూటర్, సాంకేతిక రంగము, విద్యాబుద్ధులతో జీవించువారలకు శ్రమకుతగిన ఆదాయమునుపొందుదురు. వ్యాపారులకు ఆశించిన ఫలితములు కలుగును. కూలీలు, రైతులు, శరీరశ్రమ చేయువారలకు శ్రమవృధాయగును. చేయువృత్తి,ఉద్యోగ,వ్యాపార,వ్యవహారాదులందు మంచిలాభములను పొందు దురు. గతముకంటె ఖర్చులుతగ్గించుకొందురు. పురోహితులు, పూజాద్రవ్యములు అమ్మే వారికి అనుకూలముగా యుండును.

**కార్తీకము :**శ్రమకు తగిన ఆదాయములుండును. మోసపూరిత సంఘటనలు చేసుకొనుటను మీరు గుర్తించి మసలుకోవాలి. ఆర్థికలాభములు వెసులుపాటు అనుకూలముగా యుండును. రాజకీయ నాయకులకు ప్రజలలోను ప్రభుత్వములోను అనుకూలతలు కలుగును. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాదులందు విశేషశ్రమ చేస్తేనే సామాన్య ఫలితములు పొందుదురు. వ్యవసాయరీత్యా వ్యయప్రయాసలుండును. కమ్మర్లు, కుమర్లు, హోటల్ వ్యాపారులు, గ్రామీణ కోర్టు వ్యవహారములు వాయిదాకోరుట మేలు.

**మార్గశిరము :**వృత్తి,ఉద్యోగ,వ్యాపార,వ్యవహారములందు ఊహించినంత లాభములు పొందుదురు. వచ్చినధనమును సద్వినియోగము చేయలేక దుర్వ్యయములు చేయుదురు. వ్యవసాయ మూలకముగా లాభముపొందుదురు. నమ్మక ద్రోహములకు గురికాకుండా జాగ్రత్తలు పాటించాలి. అన్నతమ్ములు, దాయాదులతో ఆస్థిపంపకము వ్యవహారములు వాయిదాలుకోరుటమేలు.

**పుష్యము :**సామాన్య అనుకూల ఫలితములు కలుగును. వస్త్రలాభము, ధనధాన్య లాభములు,మనోధైర్యము,విద్యలచే వినోదపడుచుందురు. క్రయవిక్రయములందు అనుకూలత లుండును. కళలయందు నైపుణ్యముండును. విద్య, వైద్య, వ్యాపార, కంప్యూటర్ రంగములవారికి లాభదాయకముగా యుండును. గతములో యున్న ఇబ్బందులు క్రమముగా తగ్గుముఖము పట్టును. ఆస్థులరీత్యాఆదాయము చేతికిఅందును. బంధుమిత్ర దర్శనములు, కులాచారములను పాటించుదురు.

**మాఘము :**వ్యవసాయదారులకు, వ్యవసాయకూలీలకు వరికోతమిషనులు, ట్రాక్టర్లకుపని ఆదాయములుండును. పెట్టుబడులు కొరతలు తగ్గును. వాహనములు నడుపువారు, గవర్నమెంటు మరియు ప్రవేటురవాణా సంస్థలకుఆదాయముఉంటుంది. అన్ని రంగములవారికి శ్రమాధికము ఆదాయము పరిమితముగా యుండును. భారీపరిశ్రమములు,యంత్రకర్మాగారములు నడుపువారికి కూలీలతో వ్యయ ప్రయాసలు వ్యతిరేకతలుండును.

**ఫాల్గుణము :**గ్రామీణా వ్యవహారముతో వివాదములు పరిష్కరించుకొనుట మేలు. అనారోగ్య బాధలు దూరమవుతాయి. నూతన కార్యాలకు శ్రీకారం చుడతారు. క్రీడాకారులకు, రాజకీయరంగాల్లోన్నివారికి ఊహించని లాభాలుంటాయి.

# కర్కాటక రాశి

| ఆదాయం | 11 | రాజపూజ్యం | 05 |
|---|---|---|---|
| వ్యయం | 08 | అవమానం | 04 |

పునర్వసు 4, పుష్యమి 1,2,3,4, ఆశ్రేష 1,2,3,4

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు సామాన్యముగావున్నను సంవత్సర మధ్యనుండి నిరాటంకముగా పనులు సాగుచుండును. కుటుంబ,ఆర్థిక వ్యవహారాలు చక్కబడతాయి. సోదరవర్గమునుండి సహకారములు అందుతాయి. గృహమున సంతోషకరమైన శుభకార్యాలు జరుగుతాయి. పుత్రసంతానము ద్వారా అభివృద్ధిని సాధిస్తారు. శత్రు,కోర్టు వ్యవహారాలు సానుకూలపడతాయి. జీవితభాగస్వామి ద్వారా కొంతచికాకులు ఏర్పడవచ్చు. ఆకస్మిక ప్రమాదాలు సంభవించుట వలన నరములకు సంబంధించిన చికిత్సలు జరుగును. ఆస్థివ్యవహారాలు వాయిదా వేసుకొనుట మేలు. చేయువృత్తి, ఉద్యోగమునందు అందరిమన్ననలు పొందుతారు. చెడుకలలు వచ్చుటచే మనస్థాపానికి గురిఅవుతారు.

వ్యవసాయదారులకు రెండవపంట మేలుగా ఉన్నది. విద్యార్థులకు ఆటంకములన్నను తాముఆశించిన ర్యాంకులను పొందుతారు. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితులకు విశేష గౌరవ పురస్కార ములు లభించును. డాక్టర్లు,ఇంజనీర్లు,లాయర్లకు ధనమేపరమావధిగా జీవనముసాగిస్తారు. రాజకీయ నాయకులకుఉన్నత పదవులను అలంకరించుటకు యోగ్యమైన కాలము. ఈ రాశి స్త్రీలకు కుటుంబమున అనేరకముల సమస్యలతో సతమతమవుతూ సంవత్సరమంతా సాగును.

**పరిష్కారములు :** పురుషసూక్త పారాయణ, హెూమం.

**నక్షత్ర ఫలితాలు**

పునర్వసు–కుటుంబకలహాలేర్పడే అవకాశముంటుంది. వ్యాపారంలో ధననష్టముంటుంది. విదేశయాన ప్రయత్నం సులభమవుతుంది. సంతానంతో విరోధమేర్పడకుండా జాగ్రత్త వహించుట మంచిది. స్త్రీలు సౌభాగ్యాన్ని పొందుతారు. బంధు, మిత్రులు కలుస్తారు.

పుష్యమి–వృత్తియందు ధనలాభముంటుంది. స్త్రీల మూలకంగా లాభాలుంటాయి. విజయం పొందుతారు. శుభవార్తలు వింటారు. అత్యంత సన్నిహితులను కలుస్తారు. కుటుంబంలో సంతృప్తికరంగా ఉంటారు. పేరు,ప్రతిష్ఠలు లభిస్తాయి. సంఘంలో గౌరవమర్యాదలుంటాయి.

ఆశ్రేష – ఇతరుల విమర్శలకు లోనవుతారు. స్థిరమైన నిర్ణయాలుతీసుకోలేరు. అనుకూల స్థానచలనం కలిగే అవకాశాలు న్నాయి. గృహంలో వాస్తు పరంగా మార్పులు జరిగే అవకాశాలు ఉన్నాయి.

**చైత్రము:** బంధుమిత్రులతో అవగాహనాలోపములవలన విభేదములుకలుగును. వృత్తిఉద్యోగములందు అనుకూలతలుగాయుండును. ఆదాయముబాగుంటుంది. ప్రయత్నకార్య ములు నెరవేర్చుకొందురు. ప్రతిపనియందు ఏకాగ్రత్తతోవ్యవహరిస్తారు. భూములు, ఇండ్లు,అపార్టుమెంటులు కొనదలచినవారికి లాభసాటిగావచ్చును.

**వైశాఖము :** తోబుట్టువులు, అత్తమామలసహాయమును కోరవలసిఉంటుంది. అన్ని రంగములందు భార్యాబిడ్డల సహాయసహకారములుకలుగును. అవుసరములకు ఆదాయముసమముగాఉంటాయి. శుభవార్తలువింటారు. చేయువృత్తి, ఉద్యోగ,వ్యాపారరంగములందు శ్రమకుమించిన ఆదా యము కలుగును. హెూదాకు తగినరీతిగా పనులు చేయుదురు. అంతు తెలియనిఅసంతృప్తి ఆవేదనలుచోటు చేసుకొనును.

**జ్యేష్ఠము:** కుటుంబములో ఆర్థికమానసిక పరిస్థితులు చక్కబడును. భార్యావర్గీయుల వలన మేలుకలుగును. విలువైనవస్త్రములు,నగలు,ఆభరణములు కొనుగోలు చేయుదురు. శుభకార్యములలో పాల్గొందురు. సంఘములో పలుకుబడికి డోకాలేదు. రాజకీయ రంగమువారు తరుతమబేధము లేకుండాఇతరులకు మేలుచేస్తే భావిజీవితములో బాగు పడుదురు. సంతానము చదువుల రీత్యా ఒక నిర్ణయమునకు రాలేక సతమతమగుదురు.

**ఆషాఢము :** రాజకీయనాయకులకు మాటచలామణి,ఆదాయము కూడాకనబడును. బంధుమిత్రుల సహాయసహకారములుకలుగును. కుటుంబములో అనారోగ్యములు, తగవులు, అవగాహనా లోపములవలన యిబ్బందిపడుదురు. వ్యవసాయదారులు, విద్యుత్తు, కుమ్మరి, ఇటుక తీయువారు తదితర సంబంధవృత్తుల వారికి మిక్కిలిలాభదాయకముగాయుండును. వాటితో స్థిరాస్థులు కొను గోలు, అభివృద్ధులు చేయుదురు. పిల్లల టెక్నికల్‌విద్యయందు శ్రద్ధవహిస్తారు.

**శ్రావణము :** రైతులకుప్రభుత్వసహాయములు, ప్రకృతిసహాయములు, కూలీలు, పెట్టుబడుల కొరుతతో ఎదురుచూపులుగాయుందురు. ఇతరులవిషయములలోజోక్యము చేసుకొన రాదు. గతములో ఉన్న ఇబ్బందులు క్రమముగా తగ్గు ముఖముగా యుండును. స్థానభ్రంశముధనవ్యయము ఇంటికిదూరముగా ఉండవలసివచ్చుట జరుగును. వ్యాపారరంగములవారికి ఆశించిన ఫలితములుండవు. విద్యార్థులపరీక్షలలో ఆశాజనక ఫలితములుండవు. కుటుంబములోఆందోళన,అశాంతి,అరకొరసౌకర్యములతో ఇబ్బంది లుండును.

**భాద్రపదము :** కమ్మర్లు, హెూటల్ వ్యాపారులు, తదితర సంబంధ వృత్తులవారికి శ్రమకుమించిన ఫలితములు కలుగును. కోర్టువ్యవహారములువాయిదాలుకోరుటమేలు. దూరపు ప్రయాణములువాయిదాలు వేసుకొనుటమేలు. గతముకంటెకొలదిఖర్చులుతగ్గించుకొనే ప్రయత్న ములు చేయుదురు. చేయపనులందు గతమునుండి ఉన్నవ్యతిరేకతలు సర్దుబాటుఅగును. వ్యవసాయరీత్యా,కర్మాగారములు,మిషనరీలరీత్యా ఆదాయములు అనుకూలతలుపెరుగును. అన్నతమ్ములుదాయాదులరీత్యా ఆస్థులపంపకములకు అనుకూలమైనకాలము.

**అ.ఆశ్వీయుజము :** ప్రతివిషయములనూ మంచికిపోతే చెడుఎదురగును. శత్రుబాధలు అధికమగును. మీనుండి మేలుపొందినవారు కూడామీకు సహాయపడనిస్థితిగాయుందురు. బంధు మిత్రులు,భార్యాబిడ్డలతోవిరోధములు, వాదోపవాదములకువెనుతగ్గుట మంచిది. శారీరకబలహీనత,మనస్సునందు అశాంతి,ప్రయాణములందుమేలు స్పెక్యూ లేషన్ అనుకూలించపోగా ఇబ్బందులుపాలగును. దైవదర్శనములు వలన మేలుచేయును. విశేష శ్రమ చేస్తేనే సామాన్య ఫలితములు పొందుదురు. వ్యవసాయ రీత్యా వ్యయప్రయాస లుండును.

**ని.ఆశ్వీయుజము :** ప్రభుత్వ మరియు రాజకీయదాయాదులరీత్యా సహాయసానుభూతులు కలుగును. అన్నిరంగముల వారికి ఆదాయము బాగుండును. మిలటరీ,విద్యుత్తు, పోలీసు,తదితర గవర్నమెంటు ఉద్యోగులకు ఇంక్రిమెంట్లు,ప్రమోషన్లు,అనుకూల బదలీలుకలుగును. వ్యాపారము,వ్యవసాయము,కూలీ, టెక్నికల్ చేతివృత్తులవారి కూడా శ్రమకు తగిన ఆదాయముప్రోత్సాహముకలుగును. మిలటరీ, విద్యుత్తు, పోలీసు శాఖలవారికి మంచిప్రోత్సాహం ఆదాయములుకలుగును. అగ్నిసంబంధవృత్తులు, ఆయుధదారులకు లాభదాయకము.

**కార్తీకము :** పనులందు సామాన్య అనుకూలతలుండును. ధనాదాయము బాగుం టుంది. కుటుంబములోఆరోగ్యము,ఆనందముకలుగును. బంధుమిత్రుల సమాగమము కలుగును. గృహమందు అలంకారవస్తుసేకరణలు,సుగంధ పుష్పపరిమళప్రాప్తికలుగును. వృత్తి, ఉద్యోగ వ్యాపారములందు అత్యాశకు పోకుండా శ్రద్ధగా చేసుకుంటే శ్రమకు తగిన ఆదాయమును పొందుదురు. కొబ్బరిబొండాలు, కూల్‌డ్రింక్స్, శీతలపానీయములు అమ్మువారలకు అత్యంత లాభదాయకముగా యుండును. పర్యవేక్షణ లోపము లుండరాదు.

**మార్గశిరము :** అన్నిరంగములవారికి వ్యతిరేకతలు, సమయస్ఫూర్తి లేని మాటలు, సులువులేని చేతలవలన ఇబ్బందులుకలుగును. భార్యాబంధుమిత్రులు మరియు గతములో మీనుండి మేలు పొందినవారుకూడా మీకు వ్యతిరేకము. బంధుమిత్రు, పుత్ర సహృదయులతో వాదోపవాదములు చేయకుండుట మంచిది. పనిలేనిపనులు, తీరిక లేనిఆదాయము ఆలోచనలుపనులు విరమించుకొనుటమేలు. ప్రయాణములందు అలసట వ్యయ ప్రయాసలగు గురియగుదురు.

**పుష్యము :** కూలీలు,రైతులు,శరీరశ్రమ చేయువారలకు శ్రమవృధాయగును. భార్యాబిడ్డల ఆరోగ్యరీత్యా ఔషధసేవలు అవసరమగును. సంతతకి ప్రవర్తనలు ముందు జాగ్రత్తలు నేర్పుకోవాలి. ఋణదాతల వత్తిడి మాములే. ఆర్థిక స్థితిగతులు బాగుండును. పెద్దలను,ఆస్థివ్యవహారాలు వాయిదా వేసుకొనుట మేలు. చేయువృత్తి, ఉద్యోగమునందు అందరిమన్ననలు పొందుతారు.

**మాఘము :** తలపెట్టిన ప్రతిపనిసునాయాసముగా, సులువుగా పూర్తి చేయుదురు. స్థిరాస్తులు, భూములు, అపార్టుమెంటులు కొనుగోలు ప్రయత్నములుఅనుకూలిం చును. విలువైన వాహనములు,నగలు, ఆభరణములు,వస్త్రములు కొనుగోలు చేయుదురు. వ్యాపారులకు ఆశించిన ఫలితములుకల్గును. కార్మికులు,కూలీలు,భారీపరిశ్రమల వారికి అగ్నిసంబంధ వృత్తులవారికి ఆశించిన ఫలితములు దక్కక నిరాశ పాలగుదురు.

**ఫాల్గుణము :** జీర్ణకోశ, గర్భాశయ వ్యాధులు కొలదిగా ఇబ్బందులు పెట్టును. ఆస్థివ్యవహారాలు వాయిదా వేసుకొనుట మేలు. చేయువృత్తి, ఉద్యోగమునందు అందరిమన్ననలు పొందుతారు.

| ఆదాయం | 14 | రాజపూజ్యం | 01 |
|---|---|---|---|
| వ్యయం | 02 | అవమానం | 07 |



# సింహ రాశి

మఖ 1,2,3,4, పుబ్బ 1,2,3,4, ఉత్తర 1

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు సామాన్యముగాఉన్నదని చెప్పవచ్చు. ఏపనిచేసినను ఆలోచనచేసి మంచినిర్ణయాన్ని తీసుకొనుటమేలు. సోదర, బంధువర్గము నుండి విశేషసహకారము అందుతుంది. గృహమున ఉత్తేజమైన పనులను చేస్తూ ఆనందాన్ని సౌఖ్యాన్ని పొందుతారు. సంతానము ద్వారా చికాకులు కలుగుచుండును. శత్రు,కోర్టు వ్యవహారాలు ఆలస్యముగా పరిష్కారమౌతాయి. నూతన వ్యాపార ఆలోచనలు చేస్తారు. మధ్యమధ్య ఆరోగ్య భంగము ఏర్పడుతుంది. నూతన ఆస్థులను కొనుగోలుచేయుదురు. చేయువృత్తి,ఉద్యోగమునందు జాగరూకతతో మెలుగుతారు. విదేశి వ్యవహారాలు బలపడతాయి.

వ్యవసాయదారులకు రెండుపంటలు కలసివచ్చును. విద్యార్థులకు పోటీపరీక్షలయందు విజయాన్ని సాధించుట కష్టము. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితులకు శ్రమున్నను పనులను సాధించి విజయాన్ని పొందుతారు. డాక్టర్లు, ఇంజనీర్లు,లాయర్లకు కృషియేజీవనముగా ముందుకు సాగుతారు. రాజకీయ నాయకులకు నూతన పదవులను అలంకరించుటకు అవకాశములు మెండుగా ఉన్నవి. కంప్యూటర్ రంగము వారికి శుభప్రదముగా యున్నది. ఈ రాశి స్త్రీలకు ఆర్థిక ప్రయోజనాలు చేకూరి చేయుకృషియందు విజయాన్ని సాధించి సంఘంలో కీర్తిప్రతిష్ఠలు పెంపొందించుకుంటారు.

**పరిష్కారములు :** గురుచరిత్ర పారాయణ, దత్తహోమం, దత్తక్షేత్ర దర్శనం.

## నక్షత్ర ఫలితాలు

మఖ – శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెరవేరతాయి. బంధు,మిత్రులతో సరదాగా కాలక్షేపం చేస్తారు. ప్రయాణాలవల్ల లాభం చేకూరుతుంది. శ్రమకు తగిన ఫలం లభిస్తుంది. సమాజంలో గౌరవమర్యాదలు లభిస్తాయి. అన్ని విధాలా సుఖాన్ని అనుభవిస్తారు.

పుబ్బ– బంధు,మిత్రులతో విరోధమేర్పడకుండా జాగ్రత్తపడుట మంచిది. కుటుంబ పరిస్థితులు సంతృప్తికరంగా ఉంటాయి. సహనం వహించుట అన్ని విధాలా మేలు. ధనవ్యయంతో ఋణప్రయత్నాలు చేస్తారు. ఉదర సంబంధ వ్యాధులు ప్రబలుతాయి.

ఉత్తర – నూతన వస్తు,ఆభరణాలు ఖరీదు చేస్తారు. ధనలాభముంటుంది. ముఖ్యమైన వ్యక్తులను కలుస్తారు. అన్నిరంగాల్లో అద్భుత విజయాలను సాధిస్తారు. నూతన కార్యలను ప్రారంభిస్తారు. ఋణవిముక్తులవుతారు.

**చైత్రము :** గృహమునందు అనుకూలమైన వసతులు ఏర్పాటు చేసుకొందురు. ప్రతిపనికి పట్టుదల కృషి అవుసరమగును. గురువులను,దైవములనుపూజించిమానసికప్రశాంతత కలిగియుందు రు. ధనధాన్యలాభములు, గౌరవము,కీర్తిప్రతిష్ఠలు కలుగును. పిల్లలను తగినట్టి చదువులలోజేర్చుదురు. స్త్రీమూలక సహాయములు కలుగును. ఉన్నతవ్యక్తులు,చిన్ననాటి స్నేహితులు అనుకూలముగా యుందురు.

**వైశాఖము :** చేయుపనులందుఆదాయమువచ్చినవృధాఖర్చులు,ఆర్థికఇబ్బందులు అధికము గాయుండును. భార్య,భార్య తరపుబంధువుల సహాయసహకారములుండును. మాతృసౌఖ్యము,సంతోషము,ప్రయత్నకార్యములందుజయము కలుగును. వ్యాపారము, వ్యవసాయం, క్రయవిక్రయములందు అనుకూలత,బంధుమిత్రుల సహాయములుండును. గుమస్తాలు, జాయింటుదారులపై పూర్తి నమ్మకముతో విడచిపెట్టరాదు.

**జ్యేష్ఠము :** ఇంజనీర్లు,ప్లానర్స్ పూజారులు,పురోహితులకు అనుకూలించును. మెడికల్ రిప్రజెంటులకు అనుకూలముగా యుండును. ప్రత్యర్థుల పోటీలుయున్నను అందుకు తగిన విధముగా మీరు సంచరించి విజయములు, లాభములుపొందుదురు. కుటుంబములో అనారోగ్యరీత్యా ఇబ్బందులుండును. అన్ని రంగములవారికికూడా కొన్నిక్లిష్టసమస్యలు అధిగమించవలసి ఉంటుంది. సోమరితనము మనఃస్తాపములు, బంధుమిత్రులవలన కష్టనష్టములు,అపవాదులు కలు గును. ప్రయాణములందు అంతగాఅనుకూలతలుండవు.

**ఆషాఢము :** అన్నిరంగములవారికిధనధాన్యలాభము, నూతనదుస్తులు, ఆభరణాలు ప్రాప్తిస్తాయి. ప్రతిపనినిమనోధైర్యముతో ప్రారంభించి, చురుకుగా పూర్తిచేయుదురు. నూతన వ్యాపార ప్రయత్నములు, సరికొత్త ప్రాజెక్టులు పూర్తిగా అనుకూలించును. నమ్మక ద్రోహములకు గురికాకుండా జాగ్రత్తలు పాటించాలి. కోర్టు వ్యవహా రముతో వివాదములుపరిష్కరించుకొనుట మేలు. న్యాయపోరాటములకు అనుకూలమైన కాలము కాదు. ఎంత ఆదాయము వచ్చినను నిలువ ఉంచకుండా మంచినీళ్లప్రాయముగా ఖర్చు చేయుదురు.

**శ్రావణము :** కుటుంబసభ్యుల ఆరోగ్యవిషయంలో శ్రద్ధవహించగలరు. ప్రతిపనిలోను చిన్నచిన్న ఆటంకములు, అవరోధములు, వ్యతిరేకత ఎదురగును. డాక్టర్లకు, మెడికల్‌షాపువారికి, ఆయుర్వేదమందులు అమ్మేవారికి అనుకూలంగావుంటుంది. కులాచార ధర్మములుపాటించుదురు. నూతన వ్యక్తులతో పరిచయభాగ్యములు కలుగును. ధనలాభములు,భూములు, స్థిరాస్తులు అభివృద్ధిచెందును.

**భాద్రపదము :** ప్రతిపనియందు శత్రుపక్ష బాధలున్ననువాటినిఅధిగమించివిజయము పొందుదురు. యంత్రకర్మాగారములు,వ్యవసాయరీత్యా అన్నతమ్ములరీత్యా లాభించును. భార్యఆరోగ్యరీత్యా జాగ్రత్తలు పాటించుటమేలు. శత్రువులనుపసిగట్టి వారికుయుక్తులనరికట్టెదురు. అన్నదమ్ములు, దాయాదులరీత్యా అనుకూలంగావుంటుంది. గుమాస్తాలు,నౌకర్లు,బంధుమిత్రులసహాయ సహకారాలు కొరవడుతాయి. కార్మికులు, కర్షకులు, కూలీలకు అనుకూలంగా వుంటుంది.

**అ.ఆశ్వీయుజము :** ధననష్టము,వ్యాపారనష్టములు కలుగకుండా తగుజాగ్రత్తలు పాటించాలి. కోర్టువ్యవహారములు, ప్రభుత్వవ్యవహారములు,కాంట్రాక్టుపనులందు వత్తిడిగా యుండును. రాజకీయ ములందును, భూవివాదములకు ఎంతదూరముగా ఉంటే అంత మంచిదిగా యుండును. ప్రభుత్వఋణములు తీర్చుటజరుగును. దైవదర్శనములుచేసి పెద్దల ఆశీస్సులతో ఆనందము నిర్మలత్వమును పొందుదురు. సరికొత్త పథకములువ్యాపారములు చేయు దురు. ఇంటాబయట అన్నిరంగములందుఅనుకూలతలుండును. ఆర్థికరాజకీయ సామాజికఅభివృద్ధి కలుగును.

**ని.ఆశ్వీయుజము :** బంధుమిత్రులతో ఇష్టాగోష్టిచర్చలు చేయుదురు. నూతన బంధుమిత్రుల పరిచయమగుట, తన్మూలకముగాలాభించుట జరుగును. అవుసరమునకు తగిన ఆదాయము ఏదోరకముగా చేతికిఅందును. కుటుంబములో ఆరోగ్యవిషయములలో ప్రత్యేకశ్రద్ధ అవుసరమ గును. భోజనఖర్చులకంటే ఔషధములకే ఎక్కువఖర్చులగును. వాహనములు నడుపుటలో తగుజాగ్రత్తలుపాటించాలి. ప్రతి పనియందుఆటంకములు కలుగును. అన్య గ్రామనివాసములు,అకాలభోజనము,అకాల నిద్రవలన అనారోగ్యము కలుగును.

**కార్తీకము :** సంతానము విషయములో చదువుసంధ్యలు ఇబ్బందులు లేకుండా చూచుకొందురు. భార్యఆరోగ్య విషయములో శ్రద్ధవహించాలి. వస్తు,వస్త్ర,ఆభరణములు కొనుగోలు చేస్తారు. కుటుంబసభ్యులు, బంధుమిత్రులతో, సలహాలతోముఖ్యపనులుచేయాల్సిఉంటుంది. ప్రతిపనిని పట్టుదల ధైర్యము నిర్వహించితే మేలు కలుగుతుంది. వృత్తి, ఉద్యోగ,వ్యాపారాదులందు విశేషశ్రమచేస్తేనేసామాన్య ఫలితములు పొందుదురు. వ్యవసాయ రీత్యా వ్యయ ప్రయాసలుండును. కమ్మర్లు,కుమర్లు, హోటల్ వ్యాపారులు, తదితర వృత్తులవారికి మంచిది.

**మార్గశిరము :** కోర్టువ్యవహారములు అనుకూలముగాయుండును. అన్నతమ్ములరీత్యా సహాయ సహకారములుకలుగును. కుటుంబముతో ఆనందము,ఆరోగ్యము,ఉత్సాహము వెల్లివిరు స్తుంది. ప్రభుత్వకార్యాలయములలో మొండిపడినపనులు,పూర్వీకుల ఆస్తిపంపకములు పూర్తి. ఆర్థిక ఇబ్బందులున్ననుఅవుసరమునకు తగినసొమ్ముచేతికిఅందును. కావలసిన సొమ్మునుగోప్యముగా అప్పులు చేయుదురు. నూతనవాహనములు, గృహములు కొను గోలు ప్రయత్న ములువాయిదాలువేసుకోవాలి. ప్రయాణములందు తగు జాగ్రత్తలు పాటించాలి.

**పుష్యము :** కుటుంబములోభార్యాబిడ్డలతో సున్నితముగామెలగుట మంచిది. ఏపని చేసినను అవలీలగాపూర్తియగును. ఇతరులు ఆలోచిస్తున్న కాలములో మీరు పనులు పూర్తిచేయుదురు. భూములు అపార్టుమెంట్లు కొనుగోలు చేయుదురు. గతములోవచ్చిన ఖర్చులు కొంతతగ్గుముఖము పట్టును. అవుసరమునకు తగినట్లు కొంతసొమ్ముచేతికి అందును. మీ అంతస్థుకు తగినట్లు ప్రవర్తించక మీస్థాయికి తగినవారితో మెలగవలసి వుంటుంది.

**మాఘము :** వ్యాపారులు,విద్య,వైద్యరంగములవారికి ఆదాయమును మించినఖర్చులు కలుగును. మీపనులు కుంటుబడకుండా భార్యాబిడ్డలు సవరణ చేయుదురు. భార్యాబిడ్డలతో దైవపుణ్యక్షేత్రదర్శనములుచేయుదురు. వృత్తి,ఉద్యోగ,వ్యాపారము లందు అభివృద్ధిలాభదాయకముగాయుండును. ఋణదాతలవత్తిడివున్నాబంధుమిత్రుల సహాయ సహకారాలతో మీమాటల మంచితనముతో వారిని సంతృప్తిపరుస్తారు.

**ఫాల్గుణము :** ఎంతఆదాయము వచ్చిననునిలువ యుండక మంచినీళ్ల ప్రాయముగా ఖర్చులు చేయుదురు. భార్యమూలకముగా కొంత ఓదార్పుకలుగును. దూరపు ప్రయాణములు వాయిదాలువేసుకొనుటమేలు.

| ఆదాయం | 02 | రాజపూజ్యం | 04 |
|---|---|---|---|
| వ్యయం | 11 | అవమానం | 07 |



# కన్యా రాశి

ఉత్తర 2,3,4,హస్త 1,2,3,4, చిత్త 1, 2

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు వత్తిడితో జీవనాన్ని సాగిస్తారు. ఇంటాబయటా సమస్య లెదురవుతాయి. భాగస్వామ్యవ్యాపారాలు కలసిరాక తీవ్ర ఇక్కట్లను పొందుతారు. కుటుంబమున సంతోషాన్ని పొందుతారు. బంధు,సోదరవర్గమునుండి ఇష్టములేకున్నను సహాయాన్ని పొందుతారు. పుత్రికా సంతానముద్వారా చికాకులు ఏర్పడతాయి. కోర్టువ్యవహారాలు వాయిదావేసుకోవలసిన అవసరమ ఎంతైనా ఉన్నది. జీవిత భాగస్వామివలన తగాదాలుంటాయి. ఆకస్మిక ప్రయాణాలవలన లాభముచేకూరవచ్చు. చేయువృత్తి,ఉద్యోగమునందు,విదేశీ ప్రయాణాల యందు విజయాన్ని సాధిస్తారు. నిద్రలేమితనముచేత చెడుకలలు వచ్చుటకు అవకాశమున్నది.

వ్యవసాయదారులకు అన్నిపంటలు కలసివచ్చును. విద్యార్థులకు ధనమును ఖర్చుచేయుట ద్వారా ఉత్తీర్ణత సాధిస్తారు. కంప్యూటర్ రంగము వారికి శుభప్రదముగా యున్నది. సినీరంగమునందు వారికి,కళాకారులకు ప్రోత్సాహకబహుమతులు అందును. పురోహిత,జ్యోతిష, వాస్తు పండితులకు నూతన ఆదాయమార్గాలు పుష్కలంగాఉంటాయి. డాక్టర్లు, ఇంజనీర్లు,లాయర్లకు తామూఆశించిన పదవులనుపొందుతారు. రాజకీయ నాయకులకు పదవీగండములు ఎక్కువగాఉండును. ఈ రాశి స్త్రీలకు సంఘమున గౌరవము తగ్గును. శారీరక అనారోగ్యముపెరుగును.

**పరిష్కారములు :** ఆంజనేయుని వాల(తోకకు) పూజ, సుందరకాండ పారాయణ, హోమం.

## నక్షత్ర ఫలితాలు

ఉత్తర – మనోధైర్యాన్ని కోల్పోతారు. అనవసర భయాం దోళనలకు గురవుతారు. నూతన కార్యాలకు ఆటంకాలేర్పడతాయి. కోపాన్ని తగ్గించుకుంటే మంచిది. కఠిన సంభాషణంవల్ల శత్రుత్వం ఏర్పడుతుంది.

హస్త – పిల్లలవల్ల ఇబ్బందుల నెదుర్కొంటారు. భోజన సౌఖ్యముండదు. అధికారులతో గౌరవింప బడుతారు. పట్టుదలతో కార్యాలు పూర్తి చేసుకుంటారు. అనారోగ్య బాధలుంటాయి. ప్రయాణాలు జాగ్రత్తగా చేయుట మంచిది.

చిత్త – వృత్తి,ఉద్యోగ రంగాల్లో అటంకాలెదురవుతాయి. లాభాలు కలిగే సూచనలున్నాయి. అనుకోని సంఘటనల ద్వారా భయాందోళనలున్ననూ ఇతరుల మాటవలన శాంతిస్తారు. విదేశయాన ప్రయాణాలు నెరవేరతాయి. నూతన వ్యక్తుల పరిచయమేర్పడుతుంది.

**చైత్రము :**వ్యాపారులకు ఆశించినఫలితములు కలుగును. కూలీలు, రైతులు,శరీరశ్రమ చేయువారలకు శ్రమవృధాయగును. భార్యాబిడ్డల ఆరోగ్యరీత్యా ఔషధసేవలు అవసరమగును. వ్యాపారులకు ఆశించినఫలితములు కలుగును.

**వైశాఖము :**భార్యతరపు ఆస్థిమీద ఆదాయము చేతికిఅందును. స్త్రీసౌఖ్యము, శయ్యా భోగములు, కుటుంబసౌఖ్యము కలుగును. పురోహితవృత్తులవారికిప్రోత్సాహముకలుగును. గతమునుండిచేస్తున్న పనులుగాక ఇతరవృత్తుల నుండి కూడా అనేక విధములుగా లాభములుపొందుదురు. శ్రమకుమించిన ఆదాయములు ఊహించనిరీతిగా అభివృద్ధి చెందుదురు. ప్రతివిషయములోనుపట్టింది. బంగారమన్నట్లుండును.

**జ్యేష్ఠము:** పనులందు భార్యాబిడ్డల సహాయసహకారములుకలుగును. బంధుమిత్ర దర్శనములు,మృష్టాన్నభోజనములుచేయుదురు. కులాచారములనుపాటించుదురు. మీహోదాకు తగ్గట్లు వ్యవహరించుదురు. కుటుంబ సమేతముగా విందులువిలాసయాత్రలు చేయుదురు. క్రయవిక్రయములందు అనుకూలతలుండును. గతములో యున్న ఇబ్బందు లు క్రమముగా తగ్గుముఖముపట్టును. భార్య ఆస్థులరీత్యా ఆదాయము చేతికి అందును.

**ఆషాఢము :** సామాన్యఅనుకూల ఫలితములుకలుగును. వస్త్రలాభము, ధనధాన్య లాభ ములు,మనోధైర్యము, క్రయవిక్రయములందుఅనుకూలతలుండును. కళలయందునైపుణ్య ముందు ను. విద్య, వైద్య,వ్యాపార,కంప్యూటర్ రంగములవారికి లాభదాయకముగాయుండును. కోర్టువ్యవహారములు వాయిదాలు వేసుకొనుటమేలు. బాధలలోభార్యాబిడ్డల సహకార ముకూడా కరువగును. బంధుమిత్ర దైవదర్శనములవలన కొంత మనఃశ్శాంతి కలుగును.

**శ్రావణము :**ప్రతివిషయములోనూ మంచికిపోతే చెడుఎదురగును. శత్రుబాధలు అధిక మగును. మీనుండి మేలుపొందినవారుకూడా మీకుసహాయపడని స్థితిగాయుందురు. బంధు మిత్రు లు,భార్యాబిడ్డలతోవిరోధములు, వాదోపవాదములకు వెనుకకుతగ్గుట మంచిది. సంతానముచదువుసంధ్యాలరీత్యా సంతృప్తికరముగా యుండవు. మాటలలో తొందరపాటు,కఠినత్వమునుతగ్గించుకోవాలి. బంధు మిత్రులతొ పుణ్యక్షేత్ర దర్శనములు చేయుదురు.

**భాద్రపదము :**కుటుంబసభ్యుల మధ్యఅవగాహనా లోపమువలనఅవస్థలకు గురియగు దురు. చేయు పనులందు ఎంతఆదాయము వచ్చిననునిలువయుండక మంచినీళ్లప్రాయముగా ఖర్చులు చేయుదురు. నూతన ప్రయత్నములు మిత్రులప్రోత్సాహముతో విజయవంతముగా పూర్తియగును. శారీరకబలహీనత, మనస్సునందుఅశాంతి, ప్రయాణములందు మేలు. స్పెక్యులేషన్ అనుకూలించపోగా ఇబ్బందులుపాలగును. దైవదర్శనములు మేలు. వ్యవసాయ భూములరీత్యా అభివృద్ధినిమిత్తముగా అధికఖర్చులు చేయుదురు.

**ఆ.ఆశ్వీయుజము :**ప్రభుత్వపరమైన ఇబ్బందులున్ననుసర్దుబాటుచేసుకొందురు. ప్రయాణ ములందు వాహనములు నడుపుటయందు తగు జాగ్రత్తలుపాటించాలి. స్థిరాస్తులు,పశువులు, వగయరా అమ్ముటలువాయిదాలు వేసుకొనుటమేలు. ఉద్యోగ,వ్యాపారరంగములందు శ్రమకుమించినఆదాయము కలుగును. మీ హోదాకు తగినరీతిగా పనులు చేయుదురు. ధనాదాయమునకులోటు ఉండదు. ఏదో అంతు తెలియని అసంతృప్తి ఆవేదనలు చోటు చేసుకొనును. తోబుట్టువులు, అత్తమామల సహాయమును కోరవలసి ఉంటుంది.

**ని.ఆశ్వీయుజము :**సంతానమూలకముగా గతములో యున్నఇబ్బందులు తొలగును. మృష్టాన్న, క్షీరాన్నభోజనవసతులుకలుగును. కుటుంబములో చికాకులు,అనారోగ్యములు, ఔషధసేవలు అవుసరమగును. సాహసవృత్తులు, సాహస వ్యాపారములు చేయువారలకుకూడా మేలు కలుగును. అనవసరఖర్చులు పెరుగును. చేయుపనులందు మంచిచేసినను చెడుగా భావింపబడుదురు. సంతానముయొక్కఅభివృద్ధికి ప్రణాళిక వేయుదురు. అందుకు మీశక్తిని మించి ఖర్చులు చేయుదురు.

**కార్తీకము :**పనులందు సామాన్యఅనుకూలతలుండును. ధనాదాయము బాగుం టుంది. కుటుంబములో ఆరోగ్యము,ఆనందముకలుగును. బంధుమిత్రుల సమాగమము కలుగును. వ్యాపారము,వ్యవసాయము,కూలీలకు టెక్నికల్ చేతివృత్తులవారికూడా శ్రమ కుతగినఆదాయము ప్రోత్సాహము కలుగును. మిలటరీ, విద్యుత్తు,పోలీసుశాఖలవారికి మంచి ప్రోత్సాహం ఆదాయములు కల్గును. అగ్ని సంబంధవృత్తులు,ఆయుధదారులకు లాభదాయకముగా యుండును.

**మార్గశిరము :**శుభవార్తలువింటారు. శుభకార్యములలోపాల్గొందురు. రాజకీయ రంగము వారు భేదములేకుండా ఇతరులక మేలు చేస్తేభావిజీవితములో బాగుపడుదురు. సంతానము చదువులరీత్యా ఒకనిర్ణయమునకురాలేక సతమతమగుదురు. వ్యవహారములు కొంత అనుకూలతలుండును. మొండిపడిన ప్రభుత్వ కార్యాలయములలోని పనులుసులువుగాపూర్తి చేయుదురు. తల్లి, మేనమామలరీత్యాసహాయ సహ కారములుపొందుదురు. ప్రభుత్వఉద్యోగులకు ప్రమోషన్లు లభించును.

**పుష్యము :**నూతన గృహనిర్మాణములు, భూములు, అపార్టుమెంటులు కొనుగోలు ప్రయత్నములు అనుకూలించును. బంధుమిత్రుల సహాయ సహకారములు కలుగును. పశులాభము, భూలాభము, స్త్రీలాభము, వాహనలాభములు కలుగును. పాతబాకీలు వసూలగును. ప్రభుత్వ ఋణములు తీర్చగలుగుదురు. ప్రభుత్వ సహాయములు అందును. అన్నిరంగములందు భార్యాబిడ్డలసహాయసహకారములుకలుగును. స్త్రీమూలక లాభములు, ఆదాయములుకల్గును. అవుసరములుఆదాయము సమముగాఉంటాయి.

**మాఘము :**అకాలనిద్ర,అకాలభోజనము,ఆర్థికఇబ్బందులుకలుగును. భూవివా దములకు ఎంతదూరముగా ఉంటే అంతమంచిదిగా గుర్తించగలరు. ఇష్టస్త్రీలతో సరససల్లాపము, మృధుమధురభాషణములు చేయుదురు. డాక్టర్లు,యింజనీర్లు,లాయరు,మెడికల్‌షాపుల వారి, ఆయుర్వేదమందు లు అమ్మేవారికి యోగదాయకంగా వుంటుంది. పుణ్యకార్యములు చురుకుగానిర్వహించుదురు. పెద్దల ఆశీస్సులవలన సుఖశాంతులు,మానసిక ఆనందమునుపొందుదురు.

**ఫాల్గుణము :**కోర్టు వ్యవహారములు వాయిదాలు వేసుకొనుట మేలు. ఉద్యోగులపై అధికారుల వత్తిడిఅధికముగాయుండును. పిల్లల టెక్నికల్‌విద్యయందు శ్రద్ధ వహిస్తారు.

| ఆదాయం | 14 | రాజపూజ్యం | 07 |
|---|---|---|---|
| వ్యయం | 11 | అవమానం | 07 |

# తులా రాశి

చిత్త 3,4,స్వాతి 1,2,3,4, విశాఖ 1,2,3

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు విశేష యోగప్రదముగాఉన్నది.నూతన కార్యములను ప్రారంభంచేసి విజయాన్ని సాధిస్తారు. బంధుసోదర వర్గమునుండి సహకారాలన్ని పొందుతారు. గృహమున శాంతి కార్యాలను చేస్తారు.నూతన గృహయోగము కలదు. మితిమీరిన ఆలోచన వలన కొంత వ్యతిరేకత ఉంటుంది. కోర్టుకార్యాలలో ఓటమిని ఎదుర్కొంటారు. భాగస్వామ్య వ్యాపారాలు ఇతరుల సహకారముతో సాధిస్తారు. లాటరీలు తగులుటకు అవకాశమున్నది. పిత్రార్జితము చేతికివచ్చుట కష్టము చేయువృత్తి ఉద్యోగమునందు తోటివారి సహాయములేకున్నను అధికారుల మన్ననలుంటాయి.

వ్యవసాయదారులకు అన్నిపంటలు కలసివచ్చును. విద్యార్థులకు క్రొత్త కోర్సులను చదువుటకు మంచి ఆసక్తిచూపిస్తారు. కంప్యూటర్ రంగము వారికి శుభప్రదముగా యున్నది. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితులకు సంఘమున గౌరవం పెరుగుతుంది. డాక్టర్లు, ఇంజనీర్లు,లాయర్లకుతమవృత్తులకు న్యాయమును చేస్తారు. రాజకీయ నాయకులకు నీచమార్గముద్వారా పదవులను పొందుతారు.ఈ రాశి స్త్రీలకు ప్రభుత్వ పథకముల ద్వారా నూతనమైన వ్యాపారాలు ప్రారంభంచేసి మంచి విజయాన్ని సాధిస్తారు.

**పరిష్కారములు :** లలితా పారాయణ, మహలక్ష్మీ హోమం.

## నక్షత్ర ఫలితాలు

చిత్త – మానసికాంనందాన్ని అనుభవిస్తారు. పేరు ప్రతిష్ఠలు లభిస్తాయి. శుభవార్తలు వింటారు. శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెరవేర్చు కుంటారు. దైవదర్శనం చేసుకుంటారు. కుటుంబ సౌఖ్యముంటుంది.

స్వాతి – కుటుంబ పరిస్థితులు సంతృప్తికరంగాఉంటాయి. ధనలాభంతో ఋణబాధలు తొలగిపోతాయి. సమాజంలో మంచిపేరు సంపాదిస్తారు.బంధు,మిత్రులను కలుస్తారు.చేతి వృత్తుల వార్కి శుభము.

విశాఖ –మిక్కిలి ధైర్య సాహసాలు కలిగిఉంటారు. సూక్ష్మబుద్ధితో విజయాన్ని సాధిస్తారు. పరాక్రమాన్ని ఇతరులు గుర్తిస్తారు. శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెరవేర్చుకుటారు. ముఖ్యమైన వ్యక్తుల్ని కలుస్తారు.అనారోగ్యబాధలుఅధికమవుతాయి.

**చైత్రము :**జీవితభాగస్వామితో సామరస్యధోరణితోవ్యవహరించండి.విద్యా,వైద్య,కంప్యూటర్‌రంగములవారికి అనుకూల తలుగా యుండును. కోర్టువ్యవహారములు కొంతఅనుకూలతలుండును. స్థిరాస్తులుఅమ్ముట చేర్పుమార్పులు చేయకుండుట మేలు. అపరిచితుల నమ్మిఅప్పులుయిచ్చుట, హామీపత్రముపై సంతకములు చేయకుండుటమంచిది. వృత్తి,ఉద్యోగవ్యాపారములందు పట్టుదల శ్రద్ధవహించిన లాభదాయకముగా యుండును.ఆర్థికముగా అనుకూల వాతావరణము కలుగుతుంది.

**వైశాఖము :**వ్యవసాయదారులు,యంత్రకర్మాగారములు,వాహనములునడుపువారు, కార్మికులు, కర్షకులకు రాణింపువుంటుంది. ప్రభుత్వ ఉద్యోగులకు,వ్యాపారులకుకూడా ప్రభుత్వ సహాయ సహకారములుకలిగే సూచనలున్నవి.కొన్నిపాతసమస్యలు పరిష్కారానికివచ్చే అవకాశము. ప్రతిపనినీపట్టుదలతో,ధైర్యముతో పోరాడినెరవేర్చుదురు. నూతన కార్యలాభముతోపాటు అనుకున్నవిసాధిస్తారు. గృహలాభము,స్త్రీమూలకముగా ఆదాయముంటుంది.

**జ్యేష్ఠము :** ప్రభుత్వ ఉద్యోగులకు, వ్యాపారులకుకూడా ప్రభుత్వ సహాయసహకార ములు కలిగే సూచనలున్నవి. కొన్ని పాతసమస్యలు పరిష్కారానికి వచ్చే అవకాశమున్నది. కుటుంబ ములో కొంతప్రశాంత వాతావారణము కలుగును.రాజకీయములందుఅనుకూలత, అభివృద్ధి,ధనాదాయము రాణింపు కలుగును. ప్రతిపనినీ పట్టుదలతో,ధైర్యముతో పోరాడినెరవేర్చుదురు. నూతనకార్యలాభముతోపాటు అనుకున్నవి సాధిస్తారు. భారీపరిశ్రమలందు ప్రోత్సాహము కలుగును.

**ఆషాఢము :** కులాచార వర్తనములు, ఆచారవ్యవహారములు, దైవభక్తిని చూచి మిమ్ముల ను ఇతరులుగౌరవించుదురు. ఇష్టస్త్రీతో మృదువచనములు, సంతోషముగా, ఉల్లాసముగా వుంటారు. వ్యవసాయాభివృద్ధికార్యక్రమములు,వ్యవసాయ భూములకొనుగోలు అను కూలించును.విద్య, వైద్య, కంప్యూటర్, సాంకేతిక రంగములవారికి అభివృద్ధిఆదా యములుకలుగును. మాటలమంచితనముతో మంచిపనులు పూర్తిచేసుకొందురు. అధికారుల మన్ననలను పొందుదురు. గతములోవున్న కష్టనష్టములు, అధికధనవ్యయము అదుపులోకి వచ్చును.

**శ్రావణము :**సంచారవర్తకులు,మెడికల్,రిప్రజెంటులు,జర్నలిస్టులు,సినీటీవీ రంగములవారికి లాభదాయకముగాయుండును. రియల్ఎస్టేట్,బిల్డర్స్,తాపీపని,సెంట్రింగ్ పనులవారికి మంద గొండిగా సాగును.ముఖ్యమైన పనులు వాయిదాకోరుటమంచిది. నూతనపరిచయాల విషయములో మెలకువఅవుసరమగును. వివాహాది శుభకార్యములు, నూతనగృహారంభ, గృహ ప్రవేశాది శుభకార్యములు అనుకూలించును.

**భాద్రపదము :**ప్రభుత్వఅధికారులకు సర్దుబాటు చేసుకొనవలసిఉంటుంది. ధనలాభము, మనస్సులోనిర్మలత, కుటుంబసౌఖ్యము,గౌరవము,కీర్తిప్రతిష్టలుకలుగును.పరిశ్రమలందు, వాహనములందు,గృహము,భూములు మరామత్తులకు ధనవ్యయముచేయుదురు.ఆరోగ్య విషయములలో జాగ్రత్తలు పాటించుట మేలు. ప్రభుత్వ ఉద్యోగులకు అభివృద్ధి, ఆదాయం, మంచి గుర్తింపుకలుగును. గృహములు, భూములు, అపార్టుమెంట్లు అమ్మువారికి అనుకూలతలుండవు.

**అ.ఆశ్వీయుజము :**వ్యవసాయదారులకు, వ్యవసాయకూలీలకు వరికోత మిషన్లు,ట్రాక్టర్లకు పని ఆదాయములుండును. పెట్టుబడులు కొరతలుతగ్గును.మాటల మంచితనముతో ఎంతటి క్లిష్టమైన పనులైనను సులువుగా పూర్తిచేసుకొందురు.కుటుంబజీవితములో ఆనందభరితముగాయుండును. గొప్పవారితో అనుబంధము ఏర్పడుతుంది. దూరప్రయాణములరీత్యా లాభించును. గుమస్తాలు, జాయింటు దారుల సంతతి మూలకము సంతోషకరముగాయుండును.

**ని.ఆశ్వీయుజము :**సంతతికిసర్ది చెప్పాలిగాని కఠినముగావ్యవహరించరాదు. వ్యాపార వ్యవహారములందు అనుకూలతలుండును. అన్నింట విజయములుకలుగును. చేయువృత్తి,ఉద్యోగ, వ్యాపార, వ్యవహారములందు అనుకూలతలుండును. వ్యవసాయదారులకుఆదాయము అంతంతమాత్రమే. కుటుంబములలోభార్యాబిడ్డల సహాయ సహకార ములుండును. మహిళారాజకీయనాయకులకు మహిళలు నిర్వహించు వ్యాపారసంస్థలకు మహర్దశ పట్టును.

**కార్తీకము :**మిలటరీ,పోలీసు,విద్యుత్తు,రెవిన్యూఉద్యోగులకు అభివృద్ధి,ఆదాయము కలుగును. చేయువృత్తి, ఉద్యోగ,రాజకీయములందు శ్రమకు తగిన ఆదాయము కలుగును. గవర్నమెంటు మరియు ప్రవేటు రవాణా సంస్థలకు మంచి ఆదాయముంటుంది.స్థిరాస్తులు,ఇండ్లు,భూములు, అపార్టుమెంట్లు కొనుగోలుచేయువారికి అనుకూలమైన కాలము. తీర్థయాత్రలు, ప్రయాణ ములు వృత్తిలాభములు కలుగును.కుటుంబములో చికాకులు కలిగినను వాటిని తెలివిగా సర్దుబాటు చేసుకొందురు.

**మార్గశిరము :**కుటుంబములోభార్యబిడ్డలు, తల్లివలనఅనుకూలతలు, సుఖశాంతు లుండును. ఆరోగ్యముగాయుందురు. ఇష్టస్త్రీలతో సరససల్లాపములు, మృధుమధుర భాషణములు చేయుదురు. సంతమూలకముగా సంతోషకరమైనవార్తలువింటారు.కుటుంబములోను బయటవ్యక్తులతోను సున్నితముగా మాట్లాడుట మంచిది. స్థిరాస్తులు,అమ్మకములు చేర్పులుమార్పులు వాయిదాలు వేసుకొనుట మేలు.

**పుష్యము :**ఎన్నిఆటంకములు కలిగిఓర్పుగాపరిష్కరించిలాభములను పొందు దురు. ఇనుము, సిమ్మెంటు, విక్రయదారులకు అనుకూలతలుండు ను. యువకులు పరస్త్రీలతో ఎంతదూరముగా ఉంటే అంతమంచిది. ఆదాయము బాగున్నప్పటికి ఆర్థికచింతన ఉన్నంటుంది.వడ్డీలకుఆశపడకుండా రావలసినబాకీలువసూలు చేయుటమేలు. కార్యలా భము, స్థిరాస్తులుబలపరచుకొనే విధముగాముందడుగువేయండి. విద్యార్థులు,ఉద్యోగులు ఏకాగ్ర తతో వ్యవహరించాలి. శారీకఅనారోగ్యము అందోళనలుకలిగించును.

**మాఘము :**భారీపరిశ్రమలు నడుపువారు, మెకానికులు, వెల్డింగ్ షాపులవారు, ఇటుకబట్టీ, హోటల్స్, తదితరఅగ్నిసంబంధవృత్తులవారికి శ్రమాధికము, ఆదాయము పరిమితముగా యుండు ను. దిగువనౌకర్ల సహాయములుకొరతగా యుండును. యువకుల ప్రేమ వ్యవహారములకు దూరముగాయుండుటమేలు. ఉద్యోగులకు ప్రమోషన్లు, స్థానచలనములు, ఇంక్రిమెంట్లు అనుకూల బదిలీలు కలుగును. మంచి ధనాదాయముండును. న్యాయవాదులకుపనివత్తిడికి తగ్గట్లు ఆదాయంఉంటుంది.

**ఫాల్గుణము :**వైశ్యులసలహాలు, వైశ్యుల జాయింటులు అనుకూలించును. కళాకారులకు ప్రోత్సాహపూరిత వాతా వరణము కలుగును. అభివృద్ధి కార్యములుచేయుదురు.

| ఆదాయం | 05 | వృశ్చిక రాశి | రాజపూజ్యం | 03 |
|---|---|---|---|---|
| వ్యయం | 05 | | అవమానం | 03 |

విశాఖ 4, అనూరాధ 1,2,3,4, జ్యేష్ఠ 1,2,3,4

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు సానుకూలముగా ఉన్నది. నూతన వ్యాపారాలు ప్రారంభంచేసి ఆదాయాన్ని పొందుతారు. కుటుంబము నందు కొంత చికాకు కలుగుతుంది. సోదర వర్గమువారితోను,శత్రువర్గమువారితోను జాగ్రత్తగా ఉండవలయును. నూతనమైన ఆలోచనలున్నను కార్యరూపము దాల్చుట కష్టముగాఉన్నది. గతంలోకట్టిన ఇళ్ళు ఈ సంవత్సరమున అమ్ముతారు. భాగస్వామ్య వ్యాపారాలలో తమసొంత నిర్ణయంచే లావాదేవీలు జరుపుకొనుట మంచిది. తెలియని అనారోగ్యము ద్వారా మనోవేధనకు గురిఅవుతారు.చేయువృత్తి, ఉదోగమునందు అందరిమన్ననలను పొందుతారు.

వ్యవసాయదారులకు మొదటిపంట మేలుగా ఉన్నది. విద్యార్థులకు తాముఅశించిన పోటీపరీక్షలయందు విజయాన్ని సాధిస్తారు.కంప్యూటర్ రంగము వారికి అశుభప్రదముగా యున్నది. పురోహిత జ్యోతిష వాస్తు పండితులకు సంఘశ్రేయస్సుకన్నా తమశ్రేయస్సే ముఖ్యమని భావిస్తారు.డాక్టర్లు, ఇంజనీర్లు,లాయర్లకు ఆదాయమార్గాలు పుష్కలంగా ఉంటాయి. రాజకీయ నాయకులకు నూతన పదవీయోగమున్నది.ఈ రాశి స్త్రీలకు తమ ఆలోచనలను పదునుపెట్టి ఉన్నత శిఖరాలను సాధిస్తారు.

**పరిష్కారములు :** వెంకటేశ్వర కళ్యాణం, సుదర్శన హోమం.

**నక్షత్ర ఫలితాలు**

విశాఖ – కుటుంబ కలహాలేర్పడే అవకాశముంటుంది.ధనం ఖర్చుచే విదేశాయాన ప్రయత్నం సులభంగా అవుతుంది. వృత్తి,ఉద్యోగ రంగంలో ఆటంకాలెదురవుతాయి. విద్యార్థులకు యోగవంత కాలము.శ్రమకు తగినగుర్తింపు లభిస్తుంది.

అనూరాధ – బంధు,మిత్ర విరోధ మేర్పడకుండా జాగ్రత్త వహించుట మంచిది. మానసికాందోళన అధికమగును.అనారోగ్య బాధలనుభవిస్తారు.సంఘంలో కీర్తి వస్తుంది. స్థిరమైన నిర్ణయాలు తీసుకుంటారు.

జ్యేష్ఠ – వృత్తి,ఉద్యోగ రంగాల్లో ఊహించని పరిణామాలుకు అవకాశముంటుంది.అనవసర వ్యయ ప్రయాసలతోవృధా ప్రయాణా లెక్కువగా ఉంటాయి.శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెరవేరుతాయి. మిత్రులతో సరదాగా కాలక్షేపం చేస్తారు.సమాజంలో గౌరవ మర్యాదలు లభిస్తాయి.

**చైత్రము :**రవాణాశాఖ,టూరిజం,వాహనములు నడుపువారికియోగదాయకముగా యుండును. కుటీర పరిశ్రమలు చేతివృత్తులవారికి చేయూతగాయుండును. రైతులకు కూలీల కొరతగా యుండును.బంధుమిత్రుల ఆహ్వానము మేరకుచిన్ననాటి మిత్రులకలయికతో శుభకార్యములలోపాల్గొందురు. నూతనగృహములు, వాహనములు, భూములు,ఇండ్లు, అపార్టుమెంట్లు కొనుగోలుచేయువారికి అనుకూలముగాయుండును.

**వైశాఖము :**ప్రతిపనిని చుఱుకుగామనోధైర్యముతోచేయుదురు. ప్లీడర్లు, డాక్టర్లు, న్యాయవాదులు తదితర బుద్ధిజీవులకు శ్రమకుమించినఆదాయములుండును.చేయువృత్తి వ్యాపారము లందు ధనధాన్యలాభములు పొందుదురు. సంతతిమూలకము శుభవార్తలు అంటే సంతోష కరమైన వార్తలు వినుట, చదువుసంధ్యలందు అదృష్టవంతులకుదురు.విందులు,వినోదములకుహాజరగుదురు. తలపెట్టినపనులందు పట్టుదల తగుశ్రద్ధతోపూర్తి చేసుకోగలరు. కుటుంబములో ఆనందము,ఆరోగ్యము కలిగియుందురు.

**జ్యేష్ఠము:** రాజకీయరంగములవారికి అనుకూలముగాయుండును. చట్టన్యాయ సంబంధితములను సామరస్యముపరిష్కరించుకొనగలరు.కంప్యూటర్రంగమువారికి అనుకూలత లుగా యుండును.కోర్టు, వ్యవహారములు కొంతఅనుకూలత, మొండిపడిన పనులు సులువుగా పూర్తి చేయుదురు.పెద్దలను గురువులను గౌరవించి వారి ఆశీస్సులను పొందుదురు. గృహమందు దైవపుణ్య కార్యములు చేయుదురు. వాహనములునడుపుటందు దూరపు ప్రయాణములందు తగిన జాగ్రత్తలు పాటించాలి. చేయుపనులందు ఆదాయం సంతృప్తి కరముగా ఉంటుంది. పాతబాకీలు తీరును.

**ఆషాఢము :** తర్కశాస్త్ర విద్యలందు కృషి చేయువారికి మేలు ప్రాప్తించును. బిల్డింగ్ కాంట్రాక్టర్లు, టీవీ ఆర్టిస్టులకు, సినీ పరిశ్రమవారికి మేలు కలుగును.విద్యార్థులు మంచిర్యాంకులు పొందుట, కౌన్సింగ్లో అదృష్టవంతమైన సీట్లు పొందుదురు.తల్లి, మేనమామలరీత్యా సహాయసహకారములు పొందుదురు. ప్రభుత్వ ఉద్యోగులకు ప్రమోషన్లు లభించును.ఎంతటి కార్యమైననుధైర్యసాహసములతో చేయు దురు. ప్రభుత్వరీత్యా ఋణములుపొందుదురు. ప్రభుత్వఉద్యోగులకు అదనపు ఆదా యము, పై అధికారులమెప్పును పొందుదురు.

**శ్రావణము :**జాయింటుదారులను, అపరిచితులను నమ్మి మోసపోయే సూచనలు కలవు.బంధుమిత్రులరీత్యా భంగపాటులు కలుగును. ఏపనియందు ఏకాగ్రత లుండక అనేక పనులు చేయుట,అనేక వృత్తులుచేయుట వలనఅవస్థలుకలుగును.నూతన వాహనములు, గృహములు అపార్టుమెంట్లు కొనుగోలు ప్రయత్నములుఅనుకూలించును.తల్లిమేనమామలవర్గీయుల సహాయసహకారములు అందును. దూరపుప్రయాణములు అనుకూలించును.

**భాద్రపదము :**ఎగుమతులు దిగుమతులు క్రయవిక్రయములందు ధనధాన్య లాభములు కలుగును. బిల్డింగ్ కాంట్రాక్టర్లను, బిల్డింగ్ మేటీరియల్స్ అమ్మేవారికి యోగదాయకముగా వుంటుంది. కులపరస్త్రీలకు ఎంతదూరముగా ఉంటే అంతమంచిది.కుటుంబసభ్యుల ఆనందము కొరకుశక్తికొలది కృషిచేయుదురు. యత్నకార్యములు సిద్ధించుట, బంధుమిత్రులతో అనుకూలత, కుటుంబములో స్త్రీసుఖము, అవసరములకు వలయు సొమ్ముచేతికిఅందును.

**అ.ఆశ్వీయుజము :**కుటుంబములోభార్యాబిడ్డల తల్లి ఆరోగ్యరీత్యా శ్రద్ధ తీసుకొనుట అవుస రమగును. యువకులు పరస్త్రీలవైపు చూడకుండుట మేలు. కోర్టు వ్యవహారములు వాయిదాలు వేసుకొనుటమేలు. ఉద్యోగులు బదలీలు కోరకుండుట మేలు.వృత్తి,ఉద్యోగ,వ్యాపార వ్యవహారములందు ఊహించినంత లాభములు పొందుదురు. వచ్చినధనమును సద్వినియోగముచేయలేక దుర్వయములు చేయుదురు. మూలకముగా లాభములు పొందుదురు. ప్రభుత్వ ఉద్యోగులకు ఆదాయము తక్కువ.

**ని.ఆశ్వీయుజము :**విద్య, వైద్య, కంప్యూటర్, గణిశాస్త్రమువారికి శ్రమకు తగిన ఫలితములుండును. తల్లి ఆరోగ్యరీత్యా తగు జాగ్రత్తలు పాటించాలి. ఎన్ని ఆటంకము వచ్చినా అవిఓర్పుగా పరిష్కరించి లాభములను పొందుదురు.బంధుమిత్రుల కలయికతోవిందులు,వినోదములతో హాయిగా కాలము గడుపుదురు. వాహనసౌఖ్యము,నూతనవస్త్రాభరణ లాభము,గృహసౌఖ్యము, నూతన స్త్రీ పరిచయములు కలుగును.

**కార్తీకము :** పాతబాకీలువసూలు చేయుటసవాళ్లుగా యుండును. మధ్యవర్తుల ద్వారా పరిష్కారములు తప్పనిసరి.సంఘములో కులాచారవర్తనులుగా గౌరవింపబడుదురు. దైవ,పుణ్య, సాంఘికకార్యములలో చురుకుగాపాల్గొందురు. చేయు వృత్తి,వ్యాపారములందు ఎంత ఆదాయమువచ్చినను నిలువయుండదు. ఎంత శ్రమతోనూ ఓర్పుతోను చేయుపనులకు సామాన్యఫలితాలుండును. విద్యుత్, పోలీస్,మిలటరీ శాఖలలోపనిచేయువారలకు శ్రమకుమించిన ఆదాయము కలు గును.

**మార్గశిరము :**అన్నిరంగములవారికిఅన్నివిధములుగాలభించును.మిత్రలాభము, స్త్రీసౌఖ్యం,కుటుంబములో శాంతి,ధనలాభము,అవసరములకుధనముసమకూరుటయు, వ్యాపారము నందు వ్యవసాయమునందు, పరిశ్రమలందు అభివృద్ధి ఆదాయములుండును.ప్రతిపనియందుఆటంకములు,అవరోధములుకలుగును. అన్యగ్రామ నివా సము, అకాలభోజనము, అకాలనిద్రవలన అనారోగ్యముకలుగును. గృహమందు దైవ,పుణ్య,శుభకార్యములు జరుగును. సంతతి లేనివారికి శుభపరిణామము పుత్రపౌత్రాభివృద్ధి కలుగును.

**పుష్యము :**వ్యవసాయదారులు,మిలటరీ,విద్యుత్తు, కుమ్మరి,ఇటుక తీయువారు తదితర సంబంధవృత్తులవారికి మిక్కిలిలాభదాయకముగాయుండును. పాత బాకీలువసూలు చేయుదురు. వాటితో స్థిరాస్థులు కొనుగోలు,అభివృద్ధులు చేయుదురు.భార్యా బిడ్డలతో విలాసయాత్రలు చేసి కొంతధనవ్యయము చేయుదురు. ఔషధములకే ఎక్కువ ఖర్చులగును. వాహనములునడుపుటలో తగుజాగ్రత్తలుపాటించాలి. స్థిరాస్తులు అమ్మవలసి వచ్చుట లేదా తాకట్టుపెట్టవలసిన అవుసరములుకలుగును.

**మాఘము :** యువకులు పరస్త్రీలతోఎంతదూరముగాఉంటే అంతమంచిది. దైవ,పుణ్యక్షేత్ర దర్శనములు మేలు.ఆర్థికమానసిక పరిస్థితులుచక్కబడును. భార్యవర్గీయుల వలన మేలుకలుగును. విలువైన వస్త్రములు, నగలు, ఆభరణములు కొనుగోలుచేయుదురు. ట్రావెల్స్, టూరిజంవారికి మంచి యోగదాయకముగా యుండును.బంధుమిత్రులు బద్ధశత్రువులుగా వ్యవహరింతురు. కుటుంబపరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. అన్నిరంగములవారికి అన్నివిధములుగా లభించును. చేయువృత్తి వ్యాపారములందుఅనుకూలత లుండును.

**ఫాల్గుణము :** గృహోపకరణములు, రాజకీయము లందు గతముకంటె అనుకూలతగా యుండును. సాంకేతిక రంగములవారికి దస్తావేజులు తదితర వ్రాతపనులు చేయువారలకు అత్యంత లాభదాయకముగా యుండును.

| ఆదాయం | 08 | రాజపూజ్యం | 06 |
|---|---|---|---|
| వ్యయం | 11 | అవమానం | 03 |

# ధనుస్సు రాశి

**మూల 1,2,3,4, పూర్వాషాఢ 1,2,3,4, ఉత్తరాషాఢ 1**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు ఆటంకములు ఉన్నను పనులు నెరవేరును. కుటుంబ ఆర్థిక వ్యవహారాలు కలసివస్తాయి. సోదర,బంధువర్గమునుండి వ్యతిరేకత వ్యక్తమౌవుచుండును. నూతనమైన ఆలోచనలు కలిగి పనులను సాధిస్తారు. శత్రు,కోర్టు వ్యవహారాలు ఆలస్యంగాపరిష్కారమౌతాయి. విదేశీప్రయాణాలు లాభిస్తాయి. జీవిత భాగస్వామితో విభేదాలు ఏర్పడతాయి. ఇతరులతో నూతన వ్యాపారాలు ప్రారంభం చేయకపోవుట మంచిది. ఆకస్మిక ప్రయాణాల వలన శారీరక శ్రమ ఏర్పడుతుంది. తండ్రిలేక తల్లినుండి ఆస్థులు వస్తాయి. చేయువృత్తి యందు కొంతనిర్లిప్తత ఏర్పడుతుంది. సుఖనిద్రచేత సంతోషాన్ని కలిగిఉంటారు. ఎగుమతి,దిగుమతి వ్యాపారాలు కలసివస్తాయి.

వ్యవసాయదారులకు పంటలు పండినను ఆదాయము చేతికి వచ్చుట కష్టము. విద్యార్థులకు తాముఆశించిన చదువుల కొరకు పాటుపడతారు. కంప్యూటర్ రంగము వారికి అశుభప్రదముగా యున్నది. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితులకు మంచిఆలోచనతో ముందుకు సాగుతారు. డాక్టర్లు, ఇంజనీర్లు,లాయర్లకు నూతన ప్రయత్నాలు ఫలిస్తాయి. రాజకీయ నాయకులకు పదవీచ్యుతి ఉన్నది. ఈ రాశి స్త్రీలకు విపరీత అనారోగ్యముచేత ఆసుపత్రులకు తిరగవలసి వచ్చును.

**పరిష్కారములు :** శ్రీసూక్త పారాయణ, హెూమం.

## నక్షత్ర ఫలితాలు

మూల – బంధు,మిత్రులతో కలుస్తారు. నూతన గృహనిర్మాణ ప్రయత్నం చేస్తారు. ఆకస్మిక ధనలాభంతో ఋణబాధలు తొలగిపోతాయి. కుటుంబ సౌఖ్యం ఉంటుంది. శుభ వర్తమానము అందుటవలన ఆనందాన్ని కలిగి ఉంటారు.

పూర్వాషాఢ – మనోల్లాసాన్ని పొంది,ఆనందంగా కాలక్షేపం చేస్తారు. ఆకస్మిక ధనలాభం కలదు. కుటుంబ సౌఖ్యం సంపూర్ణంగా ఉంటుంది. శుభవార్తలు వింటారు. నూతన కార్యాలకు చక్కని రూపకల్పన చేస్తారు.

ఉత్తరాషాఢ – మంచి ఆలోచనలను కలిగి వుంటారు. బంధు,మిత్రులు గౌరవిస్తారు. కుటుంబ సౌఖ్యం సంపూర్ణంగా పొందుతారు. స్త్రీల మూలకంగా లాభం ఉంటుంది. గొప్ప వారు పరిచయమవుతారు. సత్కార్యాల్లో పాల్గొంటారు.

**చైత్రము :** కుటుంబమునందుఆరోగ్యము,సంతోషముకలుగును. భార్యాబిడ్డలు మూలకముసుఖసౌఖ్యములు పొందుదురు. దూరప్రయాణము అనుకూలించును. డాక్టర్ల,యింజనీర్ల, లాయర్లు, మెడికల్‌షాపులవారి, ఆయుర్వేదమందులు అమ్మేవారికి యోగదాయకంగా వుంటుంది. గతముకంటె మీమాటలలో నేర్పు మంచితనము వలన పనులు సులువుగాపూర్తియగును.

**వైశాఖము :** భోగభాగ్యములు,పూర్వార్జితఆస్థులపై ఆదాయంపెరుగును. భూములు, గృహములు అపార్టుమెంటులు కొనుగోలు చేయుదురు. ప్రయత్నించిన కార్యములు నెరవేరును. అన్నిరంగములవారికి అన్నివిధములా లాభించును. చేయువృత్తి వ్యాపారము లందు అనుకూలతలుండును. ధైర్యముగాముందుకుపోవుట,ధనధాన్యలాభం, ఆరోగ్య లాభము కలుగును. వాహనసౌఖ్యము, గృహసౌఖ్యము, నూతన స్త్రీ పరిచయము, స్త్రీ మూలక ఆదాయము.

**జ్యేష్ఠము:** ప్రభుత్వఉద్యోగులకు ఆదాయముతక్కువ పనిభారముఅధికమగును. దైవ, పుణ్యక్షేత్ర దర్శనములు చేయుటవలన మేలుకలుగును. విలువైన వస్తువులుకొనుట,వివాహాది శుభకార్యములు,భార్యాపుత్రులతో తీర్థ యాత్రలు చేయుట,సర్వజనులతో కలసికొత్తపనులుచేయుదురు. వ్యవహారములందు ఊహించి నంత లాభములు పొందుదురు. వచ్చిన ధనమును సద్వినియోగము చేయలేక దుర్వ్యయముచేయు దురు. వ్యవసాయమూలకముగా లాభముపొందుదురు.

**ఆషాఢము :** శరీర ఆరోగ్యమును సరిచూచుకొనుట మేలు. వృత్తి,ఉద్యోగ,వ్యాపార వ్యవ హారములందు శ్రమకుతగిన ఆదాయమునుపొందుదురు. విద్య, వైద్య, కంప్యూటర్, సాంకేతిక, గణితశాస్త్రములందు దస్తావేజులు తదితర వ్రాతపనులుచేయువారలకు అత్యంతలాభదాయకముయుండును. ప్రభుత్వకార్యాలయ ములలోను, కోర్టు వ్యవహారములందు అనుకూలముగా యుండును.

**శ్రావణము :** చేయుపనులు అనుభవజ్ఞులు, పెద్దలసలహాలతో చేయుటమేలు. ఋణ దాతల వత్తిడివున్నా బంధుమిత్రుల సహాయసహకారాలతో మాటల మంచితనముతో వారిని సంతృప్తిపరుస్తారు. బంధుమిత్రుల రాకతో సుఖసంతోషములతో ఉందురు. ధనధాన్యవృద్ధి, విద్యలచే ఆర్థికలాభము, సంసారసుఖము, కీర్తి, గౌరవము,మిత్ర సమాగమము, సర్వతోముఖాభివృద్ధి, నాట్య సంగీత కళలందు అభివృద్ధి యుండును. నూతన వస్త్రములు,విలువైన ఆభరణము సమకూర్చుదురు. సాటివారిలో మేటిగా రాణింతురు.

**భాద్రపదము :** వ్యవసాయరీత్యా మరియు వృత్తి,ఉద్యోగ, వ్యాపారముల రీత్యా ధనలాభము కలుగును. తలపెట్టిన ప్రతిపనినునాయాసముగా,సులువుగా పూర్తిచేయుదురు. స్థిరాస్తులు, భూములు,అపార్టుమెంట్ కొనుగోలుప్రయత్నములుఅనుకూలించును. విలువైన వాహ నములు, నగలు, ఆభరణ ములు, వస్త్రములు కొనుగోలు చేయుదురు. బుద్ధిజీవులకు జీవనోపాధిబాగుండును. స్త్రీమూలక ఆస్థులమీద ఆదాయము, స్త్రీమూలక సహాయ సహకారములుండును. పాతబాకీలు వసూలగును. ఏపనిని ప్రారంభించినను ముందు చికాకులతో ఉండి తుదకు అనుకూలించును. తల్లితండ్రులు, బంధు మిత్రులరీత్యా సహాయ సహకారములుండును.

**అ.ఆశ్వీయుజము :** ఋణదాతలవత్తిడి అధికముగాయుండును. వైద్యచికిత్సలకు ధన వ్యయమగును. కుటుంబసభ్యుల ఇష్టమునకుఅనుకూలముగా మెలగవలసిఉంటుంది. మౌనమే శరణ్యమని గుర్తించండి. ప్రతిపనినిదూరదృష్టిలో ఆలోచించి చేయుటమంచిది. వ్యవసాయ,మిషనరీ సంబంధకార్యక్రమములు, సాహసవృత్తులవారికి,ఇంజనీరింగు,హెూటల్స్, తదితరసంబంధ వృత్తుల వారికి అత్యంత లాభదాయకముగా యుండును.

**ని.ఆశ్వీయుజము :** కోర్టువ్యవహారములు వాయిదా కోరుటమంచిది. నవగ్రహారాధన చేయు టవలన ఆనందంతోపాటు అనుకూలమైన ఫలితాలు పొందుతారు. వ్యాపారములందు శ్రద్ధ వహించు టమేలు. గుమస్తాలు, జాయింటుదారులను గుడ్డిగా నమ్మరాదు. విశేషశ్రమతో వ్యవసాయపనులుపూర్తిచేయుదురు. తలపెట్టినప్రతిపనిని తెలివిగాపూర్తిచేయుదురు. బంధుమిత్రులతోవిందులు,వినోదములతో కాలముగడుపుదురు. పనుల వత్తిడివలనటెన్షన్‌గాయుందురు.

**కార్తీకము :** సేవకులమన్ననలనుపొందుదురు. బిల్డింగ్ కాంట్రాక్టర్లను,బిల్డింగ్ మేటీరి యల్స్ అమ్మేవారికి యోగదాయకముగా వుంటుంది. అన్ని రంగములవారు ప్రయత్నించిన పనులు పూర్తియగుట, వస్త్రలాభము, ధనలాభములు కల్గును. సంతానమూలకముగాసంతోషకరమైనవార్తలువిందురు, కుటుంబములో కొలదిగా ఔషధసేవలుఅవుసరమగును. డాక్టర్లనుయింజనీర్లను,లాయర్లును, మెడికల్‌షాపుల వారి, ఆయుర్వేదమందులు అమ్మేవారికి యోగదాయకంగా వుంటుంది.

**మార్గశిరము :** కుటుంబములోచికాకులు కలిగిననువాటిని తెలివిగాసర్దుబాటు చేసుకొందురు. జీర్ణకోశ,గర్భకోశవ్యాధులకు ఔషధ సేవలుఅవుసరమగును. సంతతికి సర్ది చెప్పాలిగాని కఠినముగా వ్యవహరించరాదు. వ్యాపారవ్యవహారములందు అనుకూలతలుండును. ఇంటియందు సంతోషకరమైనవార్తలు విందులు,వ్యాపార వ్యవహార కుటుంబ పరిస్థితులలో శుభపరిణామమైన అనేకమార్పులుచేయుదురు. అగ్నిసంబంధవృత్తులవారికి శ్రమాధి కము, ఆదాయము తక్కువ.

**పుష్యము :** దూరపుప్రయాణములు వాయిదాకోరుటమేలు. సంతాన సంబంధసమస్యలు వీధి నెక్క కుండాసర్దుబాటు చేసుకొనుట మేలు. కీర్తి,మనోల్లాసముకలుగును. శత్రువులతో కొలదిలగా జాగ్రత్తలు పాటించాలి. వ్యవసాయమందు, యంత్ర కర్మాగారాములందు, కార్మికులకు శ్రమాధికముగను ఫలితములు తక్కువగను యుండును.

**మాఘము :** ఎరువులు, క్రిమిసంహారిక మందులు విక్రయదారులకు అనుకూలతలుండవు. రైతులకు కూలీల కొరతగా యుండును. గృహమందుమరామత్తులు, వాహనములకు సర్వీస్‌అధికమగును. మిలటరీ, పోలీసు,విద్యుత్తు రంగములందుండు ఉద్యోగులు ప్రతి విషయములోను అప్రమత్తముగా ఉండాలి. ఇటుకబట్టీలు,పప్పులబట్టీలు,సంబంధ వృత్తులవారికి వ్యతిరేకతలు చేదుఅనుభవములు, కలుగకుండా జాగ్రత్తలు పాటించాలి.

**ఫాల్గుణము :** తీరికలేని పనులతో బిజీబిజీగా యుందురు. వారి ముందుభవిష్యత్‌కు, పైచదువులకు ప్రయత్నాలు చేస్తారు. ఇష్టదేవతారాధన కొంత మనశ్శాంతిని కలుగజేస్తుంది. చేయువృత్తి యందు కొంతనిర్లిప్తత ఏర్పడుతుంది.

| ఆదాయం | 11 | రాజపూజ్యం | ౦2 |
|---|---|---|---|
| వ్యయం | ౦5 | అవమానం | ౦6 |



# మకర రాశి

**ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం 1,2,3,4,ధనిష్ఠ 1,2**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు మందము పనులు నెరవేరుచుండును. కుటుంబమున సంఘమున గౌరవం తగ్గుతుంది. సోదర వర్గమునుండి విభేదాలు ఏర్పడతాయి. శ్రమున్నను గృహమున శుభకార్యాలు చేపడతారు. ఆలోచనున్నను బద్ధకముచే నిలచిపోతాయి. మాటపట్టింపులు ఎక్కువగా ఉంటాయి. శత్రు,కోర్టు వ్యవహారాలలో ఓటమితప్పకపోవచ్చు. భాగస్వామ్య వ్యాపారాలు లాభసాటిగాముగుస్తాయి. ఆకస్మిక ప్రయాణాలవలన కొంత ధననష్టముకలుగును. పుణ్యక్షేత్ర సందర్శనము,యజ్ఞయాగాది క్రతువులయందు పాల్గొనుట విరివిగా జరుగును. చేయువృత్తి, ఉద్యోగమునందు లాభములు కలుగుచుండును. ఎంతశ్రమున్నను నిద్రపట్టకపోవుటచే సర్పసంబంధ కలలు ఎక్కువగా వచ్చును.

వ్యవసాయదారులకు రెండు పంటలు అనుకూలముగా ఉన్నవి.విద్యార్థులకు క్రొత్త ఆశయాలతో ముందుకు సాగుతారు. కంప్యూటర్ రంగము వారికి అశుభప్రదముగా యున్నది. పురోహిత జ్యోతిష వాస్తు పండితులకు సంఘమున గౌరవం తగ్గుతుంది.డాక్టర్లు, ఇంజనీర్లు,లాయర్లకు తాముఆశించిన విజయాలను పొందుతారు. రాజకీయ నాయకులకు సంవత్సరప్రారంభమున ప్రజలనుండి తీవ్రవ్యతిరేకత వ్యక్తమగును.ఈ రాశి స్త్రీలకు నూతన పెట్టుబడులు కలిసివచ్చి తాముఆశించిన వ్యాపారాలను ప్రారంభంచేస్తారు.

**పరిష్కారములు :** శని, గురు, రాహువులకు అభిషేకం, జపం, ధానం, హోమం తప్పనిసరి.

## నక్షత్ర ఫలితాలు

ఉత్తరాషాఢ – ఆర్థిక ఇబ్బందులనెదుర్కొంటారు.వృత్తి,ఉద్యోగ రంగాల్లో నష్టపోయే అవకాశం కలదు. కుటుంబంలో మార్పులు కోరుకుంటారు. మంచి అవకాశాన్ని జారవిడుచుకుంటారు. చెడు సాహసానికి దూరంగా ఉండేందుకు ప్రయత్నించాలి.

శ్రవణం– బంధు,మిత్రులతో విరోధమేర్పడకుండా జాగ్రత్త పడుట మంచిది.మానసిక ఉల్లాసం ఉంటుంది.శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెరవేరతాయి. అద్భుతమైన అవకాశాలను పొందుతారు. ధనలాభముంటుంది.

ధనిష్ఠ – ముఖ్యమైన శుభవార్తలు వింటారు. నూతన వస్తు,ఆభరణాలు సేకరిస్తారు. పట్టుదలతో కొన్ని కార్యాలు పూర్తి చేసుకొగలుగుతారు.వృత్తిరీత్యా గౌరవ మర్యాదలు పొందుతారు. మానసికాందోళన చెందుతారు.

**చైత్రము :**ప్రేమవ్యవహారములకు దూరముగాయుండుటమేలు. ఉద్యోగులకు ప్రమో షన్లు, స్థానచలనములు,ఇంక్రిమెంట్లు అనుకూలబదలీలుకలుగును. మంచిధనాదాయ ముండును. న్యాయవాదులకు పనివత్తిడికి తగ్గట్లు ఆదాయంఉంటుంది.భారీపరిశ్రమలు నడుపువారు, మెకానికులు, వెల్డింగ్ షాపులవారు, ఇటుకబట్టీ,అగ్ని సంబంధవృత్తులవారికి శ్రమాధికము, ఆదాయము పరిమితముగాయుండును. దిగువ నౌకర్ల సహాయములు కొరతగా యుండును.

**వైశాఖము :**వృత్తి, ఉద్యోగ,రాజకీయములందు శ్రమకు తగినఆదాయముకలుగును. ఆర్థికముగాఅవసరమునకు తగినట్లు ఏదోరీతిగా చేతికి అందును. ఆటంకములు కలిగినాఓర్పుగా పరిష్కరించి లాభములనుపొందుదురు. కుటుంబములో చికాకులుకలిగినను వాటినితెలివిగాసర్దుబాటు చేసుకొందురు. సంతతికి సర్దిచెప్పాలిగాని కఠినముగా వ్యవహరించరాదు. వ్యాపారవ్యవహారములందు అనుకూలతలుండును. విజయములుకలుగు ఆర్థికలావాదేవీలు పూర్తి, ప్రభుత్వసంబంధ వ్యవహారాలు, జీవితానంద సౌఖ్యం,సంతానస్థిరత్వమును పొందుదురు.

**జ్యేష్ఠము :**చేయువృత్తి, ఉద్యోగ, వ్యాపార, వ్యవహారములందు అనుకూలతలుండును. వ్యవసాయదారులు, అగ్నిసంబంధ వృత్తులవారికి ఆదాయము అంతంత మాత్రమే.మహిళా రాజ కీయనాయకులకు మహిళలునిర్వహించు వ్యాపారసంస్థలకు మహర్దశపట్టును. కార్యలాభము,స్థిరాస్తులు బలపరచుకొనే విధముగా ముందడుగు వేయండి. విద్యార్థులు, ఉద్యోగులు ఏకాగ్రతతో వ్యవహరించాలి.

**ఆషాఢము :**ఆరోగ్యముగాయుందురు.వివాహాదిశుభకార్యప్రయత్నములు సమాలోచనలుచేయుదురు. కుటుంబములో జీవితములో ఆనందభరితముగాయుండును. గొప్ప వారితో పరిచయాలు ఏర్పడతాయి. గుమస్తాలు, జాయింటుదారుల సంతతిమూలకము సంతోషకరముగా యుండును. కళాకారులకు ప్రోత్సాహపూరిత వాతా వరణము కలుగును.

**శ్రావణము :**ఆర్థికప్రయోజనములు కలిగించే విధంగానూతనఉత్సాహము, నూతన కార్యములు, జాయింటువ్యాపారములు,పెద్దలు, అధికారులు,రాజకీయ నాయకులతో చర్చించి వారిసహాయమును కోరుదురు.వృత్తి, ఉద్యోగ,వ్యాపారములందు ధనధాన్యలాభములు కలుగును. జీవిత భాగస్వామి సహకారము, ఆత్మవిశ్వాసము పెంచుతుంది.వ్యవసాయదారులకు, వ్యవసాయకూలీలకు,ట్రాక్టర్లకు పని ఆదాయము లుండును.మంచితనముతో ఎంతటిక్లిష్టమైన పనులైననుసులువుగా పూర్తిచేసుకొందురు. గవర్న మెంటు మరియు ప్రవేటురవాణాసంస్థలకు మంచి ఆదాయముంటుంది.

**భాద్రపదము :**భారీపరిశ్రమలునడుపువారు,మెకానికులు, వెల్డింగ్ షాపులవారు, ఇటుకబట్టీ, అగ్ని సంబంధవృత్తులవారికి శ్రమాధికము,ఆదాయము పరిమితముగాయుండును. కార్మికులు యజమానులతో అనుకూలతలుగా యుందరు.స్థిరాస్తులుఅమ్ముట చేర్పుమార్పులు చేయకుండుట మేలు. అపరిచితులకు హామీపత్రముపై సంతకములు చేయకుండుటమంచిది. వృత్తి, ఉద్యోగవ్యాపారములందు పట్టు దల శ్రద్ధవహించిన లాభదాయకముగాయుండును.

**అ.ఆశ్వీయుజము :**కుటుంబములో చికాకులుకలిగినను వాటినితెలివిగాసర్దుబాటు చేసుకొందు రు.సంతతికి సర్దిచెప్పాలిగాని కఠినముగావ్యవహరించరాదు.వ్యాపారవ్యవహారములందు అనుకూలత లుండును. విజయములుపొందుదురు.శరీరములోజ్వరము,ఉష్ణసంబంధ వ్యాధులరీత్యా కొలది ఇబ్బందులు కలుగును. నూతన వస్త్రములుఅలంకారవస్తువులు కొనుగోలుచేయుదురు. పండ్లతోటలు, కూరగాయలు, పూలతోటలు, పాడిపరిశ్రమలు, ఆదాయమును పొందగలరు.

**ని.ఆశ్వీయుజము :**కుటుంబములో గతముకంటె దుర్వ్యయములు, ఖర్చులు అదుపులోనికి వచ్చును. నూతన వస్త్రములుఅలంకారవస్తువులు కొనుగోలుచేయుదురు. పండ్లతోటలు, కూరగాయలు, పూలతోటలు, పాడిపరిశ్రమలు, ఆదాయమును పొందగలరు.కుటుంబములోను బయట వ్యక్తులతోను సున్నితముగా మాట్లాడుట మంచిది. ఆదాయముతో నిమిత్తములేకుండా సరిక్రొత్తవ్యాపారములు ప్రారంభించుటకుమంచిది. వృత్తిచేర్పులు మార్పులకుఅనుకూలమైన కాలము.

**కార్తీకము :**కుటుంబములో భార్యబిడ్డలు,తల్లివలనఅనుకూలతలు, సుఖశాంతులుండును. ఆరోగ్యముగా యుందురు. ఇష్టస్త్రీలతో సరససల్లాపములు, మృధుమధుర భాషణములు చేయుదురు. వివాహాది శుభకార్యప్రయత్నములు సమాలోచనలుచేయుదురు. మంచితనముతో ఎంతటిక్లిష్టమైన పనులైనను సులువుగా పూర్తిచేసుకొందురు. ప్రభుత్వ ఉద్యోగులకు ప్రమోషన్లు లభించును.

**మార్గశిరము :**చేయువృత్తి, ఉద్యోగ, వ్యాపార, వ్యవహారములందు అనుకూలతలుండును. వ్యవసాయదారులు, అగ్నిసంబంధ వృత్తులవారికి ఆదాయము అంతంతమాత్రమే.మహిళా రాజకీయనాయకులకు మహిళలు నిర్వహించు వ్యాపారసంస్థలకు మహర్దశ పట్టును.కుటుంబములోజీవితములో ఆనందభరితముగాయుండును. గొప్ప వారితో అనుబంధముఏర్పడుతుంది. దూరప్రయాణములరీత్యా లాభించును.

**పుష్యము :**వృత్తి, ఉద్యోగ,రాజకీయములందు శ్రమకు తగినఆదాయముకలుగును. ఆర్థికముగాఅవసరమునకు తగినట్లు ఏదోరీతిగా చేతికి అందును.ఆటంకములు కలిగినా ఓర్పుగాపరిష్కరించి లాభములను పొందుదురు. ఆదాయముబాగున్నప్పటికి ఆర్థికచింతనఉన్నట్టుంది.కార్యలాభము,స్థిరాస్తులు బలపరచుకొనే విధముగా ముందడుగు వేయండి. విద్యార్థులు, ఉద్యోగులు ఏకాగ్రతతోవ్యవహరించాలి.

**మాఘము :** గవర్న మెంటు మరియు ప్రవేటు రవాణాసంస్థలకు మంచి ఆదాయ ముంటుంది.ప్రభుత్వఅధికారుల పన్నుల భారము అధికముగా ఉంటుంది.మత్స్యపానీయములు, మాంసము, చేపలు, అమ్మువారికి అనుకూల ముగా ప్రయత్నకార్యలాభములు కలుగును.వ్యవసాయదారులకు నూతన ప్రయోగములరీత్యా ఖర్చులు అయినను లాభముల పంటలు పండును. వ్యవసాయకముగా స్థిరవనరులు కలుగును.విద్యార్థు లుశ్రమశ్రద్ధ వహించుటవలననే ఉత్తమఫలితములు పొందుదురు.

**ఫాల్గుణము :** విద్యా,వైద్య,కంప్యూటర్ రంగములవారికిఅను కూలతలుగా యుండును. కోర్టు,వ్యవహారములు కొంత అనుకూలతలుండును. ప్రభుత్వకార్యాలయములలోని పనులు సులువు గాపూర్తి చేయుదురు. మేనమామలరీత్యా సహాయసహకారములుపొందుదురు.

# కుంభ రాశి

| ఆదాయం | 11 | రాజపూజ్యం | 05 |
|---|---|---|---|
| వ్యయం | 05 | అవమానం | 06 |

*ధనిష్ఠ 3,4, శతభిషం 1,2,3,4,పూర్వాభాద్ర 1,2,3*

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు చాలా గడ్డుకాలముగాఉన్నది.ఏపనిచేసినను ఓటమితో ముగుస్తూఉంటుంది. వ్యాపార ఆలోచనలు ఎక్కువగా ఉంటాయి. విపరీతమైన బద్ధకముగా ఉంటుంది.కుటుంబ,ఆర్థిక విషయాలు చికాకులు కలిగిస్తాయి. గృహమున శుభకార్యాలు నిర్వర్తిస్తారు.మంచి ఆలోచనలు కలుగుట కష్టముగా ఉన్నది.శత్రు,కోర్టు కార్యాలు వాయిదా వేసుకొనుట ఉత్తమం.భాగస్వామ్య వ్యాపారాలు తమసొంత నిర్ణయముచే సాధించు కొనుట మంచిది.ఆకస్మిక ప్రయాణాలు ప్రమాదానికి గురిచేస్తాయి. పిత్రార్జితము చేతికి అందుతుంది.చేయువృత్తి,ఉద్యోగము నందు అందరి సహకారం ఉంటుంది. లాభ,వ్యయములు సమానంగావుండును.

వ్యవసాయదారులకు పంటలు పండినను ఆదాయము వచ్చుట కష్టముగా ఉన్నది.విద్యార్థులకు విశేషమైన శ్రమచేసి ఫలితాలను సాధించుకోవాలి.పురోహిత,జ్యోతిష,వాస్తు పండితులకు సామాన్య యోగప్రదముగా ఉన్నది.డాక్టర్లు,ఇంజనీర్లు, లాయర్లకు ఆదాయముకొరకు వేచిచూడవలసి వచ్చును.రాజకీయ నాయకులకు ఉన్నపదవులు ఊడిపోవును.ఈ రాశి స్త్రీలకు శారీరక శ్రమున్నను మానసికానందాన్ని పొందుతూ తమపనులను చాటుకుంటారు.

**పరిష్కారములు :** శివ కళ్యాణం, పాశుపత హెూమం.

**నక్షత్ర ఫలితాలు**

ధనిష్ఠ – మానసిక చంచలంతో ఇబ్బందిపడతారు. సోమరితనం ఆవహిస్తుంది. పిల్లల పట్ల మిక్కిలి జాగ్రత్త వహిస్తారు. కొన్ని మంచి అవకాశాలను పొందుతారు.ఆర్థిక పరిస్థితిలో క్రమేపి మార్పు లుంటాయి. ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. విదేశయాన ప్రయత్నాలకు మార్గం సుగమ మవుతుంది.

శతభిషం – అన్ని కార్యములందు విజయాన్ని సాధిస్తారు. సౌఖ్యాన్ని పొందుతారు. శత్రుబాధలుండవు. గౌరవ మర్యాదలు అధికమవుతాయి. అద్భుత శక్తి సామర్థ్యాలను పొందగలుగుతారు. శుభవార్తలు వింటారు.

పూర్వాభాద్ర – వ్యాపారంలో విశేష లాభాన్ని అర్జిస్తారు. మంచివారితో స్నేహం చేస్తారు. అంతటా సుఖమే లభిస్తుంది. ధనలాభముంటుంది.ముఖ్యమైన సమాచారాన్ని సేకరిస్తారు. నూతన వస్తు,ఆభరణాలను కొనుగోలు చేస్తారు. ఆరోగ్యం గూర్చి జాగ్రత్త పడుట మంచిది.

**చైత్రము :**సంతానములో కొంతఅభివృద్ధి సూచనలుకల్గును. రైతులకు ప్రభుత్వ సహాయములు,ప్రకృతి సహాయములు,కూలీలు, పెట్టుబడులకొరతతో ఎదురుచూపులుగా యుందు రు. ఇతరుల విషయములలో జోక్యముచేసుకొనరాదు.తల్లి ఆరోగ్యరీత్యా తగు జాగ్రత్తలుపాటించాలి.ఎన్ని ఆటంకములు కలిగినా ఓర్పుగా పరిష్కరించి లాభములనుపొందుదురు. ఇనుము,సిమ్మెంటు,మత్తుపదార్థములు, మాంసము, విక్రయదారులకు అనుకూలతలుండును.

**వైశాఖము :**సభలుసమావేశములలో పాల్గొనిప్రతిభనుచాటుకొందురు. ఉన్నతవర్గములవారి మరియు సేవకులమన్ననలనుపొందుదురు.అన్నిరంగములవారికి వ్యతిరేకతలు, సమయస్ఫూర్తి లేని మాటలు, సులువులేని చేతలవలన ఇబ్బందులు కలుగును.అన్నిరంగములవారికి పరిస్థితి ఒకింతఅనుకూలంగావుంటుంది. రాజకీయనాయకులకు పట్టింది బంగారమన్నట్లుండును.

**జ్యేష్ఠము :** ప్రతిపనినిదూరదృష్టిలో ఆలోచించిచేయుటమంచిది. వ్యవసాయ మిషనరీ సంబంధకార్యక్రమములు, తల్లి,భార్య,బిడ్డలరీత్యా సుఖశాంతులుపొందుదురు.సాంస్కృతిక, ఆధ్యాత్మిక, ధార్మిక కార్యక్రమములపట్ల ఆసక్తి పెంచు కొందురు. అనుకున్నపనులు పట్టుదలతోసరిచేసుకొందురు.భార్యాభర్తలమధ్య పరస్పరసహకారము, సమన్వయం అవసరము.రాజకీయరంగమువారు తమ ప్రాబల్యంపెంచుకుంటారు.

**ఆషాఢము :** వ్యాపారము,వ్యవసాయము,కూలీ టెక్నికల్ చేతివృత్తులవారికికూడా శ్రమకు తగిన ఆదాయము ప్రోత్సాహము కలుగును.మిలటరీ, విద్యుత్తు, పోలీసుశాఖలవారికి ప్రోత్సాహము, ఆదాయములు కల్గును.వ్యవసాయదారులకు చాలాఊరటగాయుండును.కూలీలు పెట్టుబడులు, ప్రకృతి అనుకూలించును.

కుటుంబములోని వారు అందరు సహాయసహకారములతో ఉందురు. ప్రయత్నకార్యములు సత్వరమే పూర్తి చేయుదురు.

**శ్రావణము :**ప్రతివిషయములో ముందుండి ఇతరుల ఆలోచిస్తా ఉండగానే మీరాపనిని చేసి లాభములుపొందుదురు. కొత్తజాయింటుదారులు,గుమస్తాలుచేరుదురు. గతములో ఇబ్బం దులు కొంతవరకుతొలగును. విద్య,వైద్య, కంప్యూటర్, టెక్నికల్, చేతివృత్తులవారికి కూడా తగిన ప్రోత్సా హము ఆదాయములుండును.మెకానికులు,టెక్నికల్ చేతివృత్తులవారికి శ్రద్ధతో చేసినలాభములు కలుగును. క్రయవిక్రయములందు,గుమస్తాపనులందు,ఎగుమతులు,దిగుమతులందు ఆశాజనకమైన ఫలితములు కలుగును.

**భాద్రపదము :**చేయుపనులందు సామాన్యఅనుకూలతలుండును.ధనాదాయము బాగుం టుంది. కుటుంబములో ఆరోగ్యము,ఆనందముకలుగును. బంధుమిత్రులసమాగమము కలుగును. గృహమందు అలంకార వస్తుసేకరణలు, సుగంధ పుష్ప పరిమళప్రాప్తి కలుగును. ప్రతిపనిలోను మెలకువగా మెలగుటమంచిది. మీరు చేయు వృత్తి, ఉద్యోగ, వ్యాపారములందు మీ సీనియర్ల సలహా సంప్రదింపులతో అభివృద్ధిపథకములకు ప్లాను వేయుదురు. ప్రతిపనినిఅంచనాలువేసి ముందుకుసాగుటమేలు.

**అ.ఆశ్వీయుజము :**ప్రభుత్వకార్యాలయములోనిపనులు, వ్యవహారములు, కోర్టువ్యవహారములు అనుకూలముగా యుండును. రావలసిన బాకీలు విశేషప్రయత్నముతో వసూలు చేయుదురు. విద్య,వైద్య,వ్యాపార,కంప్యూటర్ రంగములవారికి అనుకూలతలుగాయుండును.బంధుమిత్రులరీత్యా అనుకూలతలుండును. ప్రభుత్వ కార్యాలయ ములలోని పనులు, కోర్టు వ్యవహారములు అనుకూలముగాయుండును. నూతనవస్త్రాభరణములు కొనుగోలు చేయుట, ఫర్నీచర్,అపూర్వవస్తుసాధనలుచేయుదురు.

**ని.ఆశ్వీయుజము :**కీలకవిషయములు ఆలోచించినిర్ణయములుతీసుకొనుటమేలు. దాంపత్యములో అనుకూల వాతావరణముఉంటుంది.స్థిరాస్తులకు సంబంధించినవిషయములో పురో భివృద్ధి కలుగుతుంది. రియల్ఎస్టేట్, బిల్డర్స్, రంగములవారికి స్వర్ణయుగముగా యుండును.సత్సంబంధాలను నేర్పు,ఓర్పుతో నెట్టుకురాగలరు. బంధుమిత్రులతో చిన్నచిన్న మాటపట్టింపులువస్తాయి.విద్య, వైద్య, కంప్యూటర్, గణితశాస్త్రమువారికి శ్రమకు తగిన ఫలితములుండును. ప్రోత్సాహము కరువుగాయుండును.

**కార్తీకము :**స్పెక్యులేషన్స్ అనుకూలించును.సంతతిమూలకము సంతోషకరమైన వార్తలు విందురు. శత్రువులపై విజయములు నూతన వస్త్ర వస్తువులప్రాప్తియశోభూషణ ప్రాప్తి, సంతాన ప్రాప్తి, వ్యవహారములందు జయము,అభ్యున్నతి కలుగును.సెంట్రింగ్, తాపీ, కలప, వడ్రంగము, బొగ్గుగనులందు పనిచేయు వారికి అనుకూలముగా యుండును. శ్రమకు మించిన ఆదాయము కలుగును. హెూదాకు తగినరీతిగా పనులు చేయుదురు. ధనాదాయమునకులోటుఉండదు.

**మార్గశిరము :**ఆస్తిఅంతస్తులు హెూదాలు అంటూ అదనపుఖర్చులు చేయుటమానాలి. అన్నిరంగములవారికి ఆదాయమునకులోటువుండదు. గతమునుండివున్నచిక్కుసమస్యలు రాజీధోర ణిలో పరిష్కారమగును. సాంఘిక అభివృద్ధి, వాహన, ప్రయాణలాభము కలుగును.విలువైన వస్త్రములు,నగలు,ఆభరణములు కొనుగోలు చేయుదురు. ట్రావెల్స్, టూరిజంవారికి యోగదాయక ముగా యుండును. మిలటరీ, విద్యుత్తు, కుమ్మరి, ఇటుక తీయువారు తదితర సంబంధవృత్తులవారికి మిక్కిలి లాభదాయకముగా యుండును.

**పుష్యము :** అంతుతెలియని అసంతృప్తిఆవేదనలు చోటుచేసుకొనును. జీర్ణకోశ, గర్భాశయవ్యాధులుకొలదిగా ఇబ్బందులుపెట్టును. తోబుట్టువులు,అత్తమామల సహాయమును కోరవలసిఉంటుంది. ధనాదాయమునకు లోటుఉండదు. మానసికవ్యాధులు కొలదిగా ఇబ్బందులు పెట్టును.తోబుట్టువులు,అత్తమామల సహాయమును కోరవలసి ఉంటుంది.అందువలన మీ కొరతతీరుతుంది.ఆరోగ్య పరిరక్షణ,తగిన విశ్రాంతిఅవసరమగును.

**మాఘము :**ఇంజనీర్లు,డాక్టర్లు,యాక్టర్లు,కీర్తిప్రతిష్ఠలు,ధనార్జనయే పరమావధిగా యుందురు. తీర్థయాత్రలు, ప్రయాణ ములు వృత్తిలాభములు కలుగును.కుటుంబములో చికాకులు కలిగినను వాటిని తెలివిగా సర్దుబాటు చేసుకొందురు.భూములు,గృహములు,అపార్టుమెంట్లు తదితరస్థిరాస్థులు కొనువారికి అమ్మువారికికూడా అనుకూలముగాయుండును.

**ఫాల్గుణము :**భార్యా బంధు మిత్రులు మరియు గతములో మీనుండి మేలు పొందినవారుకూడా మీకు వ్యతిరేకము. విద్యార్థులు పట్టుదలతోచదివి మంచిర్యాంకులకు విశ్వప్రయత్నాలు చేస్తారు. కుటుంబమున వివాహాది శుభకార్య ప్రయత్నములుఅనుకూలించును.

| ఆదాయం | 08 | రాజపూజ్యం | 01 |
|---|---|---|---|
| వ్యయం | 11 | అవమానం | 02 |



# మీన రాశి

పూర్వాభాద్ర 4 ఉత్తరాభాద్ర 1,2,3,4, రేవతి 1,2,3,4

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు సామాన్యముగా ఉన్నది. ఇతరుల సహకారముచే తమ పనిని పూర్తిచేసుకొనుటవేలు. కుటుంబ, ఆర్థిక పరిస్థితులు మెరుగ్గాఉన్ననూ చికాకు కలిగించును. సోదర, బంధువర్గమువారితో విభేదాలు ఏర్పడతాయి. దూర ప్రాంతముల నుండి బంధువులులేక స్నేహితులు వచ్చెదరు. కోర్టు, విదేశీ వ్యవహారాలు నష్టముతో పూర్తిఅగును. భాగస్వామ్యవ్యాపారలావాదేవీల విషయంలో తగుజాగ్రత్తవహించుట మేలుగా ఉన్నది. ఆకస్మిక ప్రయాణాలు ఆరోగ్యాన్ని దూరంచేస్తాయి. గతంలో నిలచిన పిత్రార్జితము సంవత్సరాంతమున చేతికందును. చేయువృత్తి ఉద్యోగమునందు శ్రమున్ననూ లాభము ఎక్కువగానే ఉండును. నిద్రలేమి తనముచేత చెడుకలలు వచ్చి భయభ్రాంతులకు గురిఅగుదురు. మధ్యమధ్య రక్తసంబంధ వ్యాధులు వచ్చుచుండును.

వ్యవసాయదారులకు పంటలు పండినను ఆదాయము వచ్చుట కష్టముగాఉన్నది. విద్యార్థులకు అనుకూల విద్యా యోగమున్నది. పురోహిత, జ్యోతిష, వాస్తు పండితులకు ఆదాయము కొరకు వేచిచూడవలసి వచ్చును. డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లకు ఆదాయమార్గాలకోసం అన్వేషణ సాగించవలెను. రాజకీయ నాయకులకు తామున్న పదవులనుండి నిష్క్రమించే యోగమున్నది. ఈ రాశి స్త్రీలకు రాజయోగమున్నందువలన ఏపని తలపెట్టినను విజయవంతముగా పూర్తిచేయుదురు.

**పరిష్కారములు :** దుర్గ సహస్రనామ పారాయణం, హోమం.

## నక్షత్ర ఫలితాలు

పూర్వాభాద్ర – అపకీర్తి రాకుండా జాగ్రత్తపడుట మంచిది. అనారోగ్య బాధలుంటాయి. ప్రయాణాల్లో వ్యయ, ప్రయాస లెక్కువగా వుంటాయి. భోజన సౌఖ్యముండదు. మానసికాందోళనతోనే కాలం గడుపవలసి వస్తుంది.

ఉత్తరాభాద్ర– ఆకస్మిక ధనలాభంలో ఆనందంగా ఉంటారు. ప్రయత్న కార్యాలన్నింటిలో సఫలీకృతులవుతారు. కీర్తి, ప్రతిష్ఠలు అధికమవుతాయి. శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెరవేర్చుకుంటారు. శుభవార్తలు వింటారు.

రేవతి – అనారోగ్య బాధలు అధికమవుతాయి. ఆర్థిక ఇబ్బందులతో సతమతమవుతారు. నూతన కార్యాలు ప్రారంభించ కుండానుండుట మంచిది. పరిస్థితులు సంతృప్తికరంగా నుండవు. మంచి నిద్ర పట్టును.

**చైత్రము :** భారీపరిశ్రమములు, యంత్రకర్మాగారములు నడుపువారికి కూలీలతో వ్యయ ప్రయాసలు, వ్యతిరేకతలుండును. విద్య, వ్యాపార, కంప్యూటర్, టెక్నికల్, చేతివృత్తులవారికి ప్రోత్సాహము, ఆదాయముకలుగును. కార్పొరేటు, వైద్యసంస్థలు, డాక్టర్లకుకూడా గౌరవ ఆదాయము లుండును. అకారణ ధనవ్యయముజరుగును. ఎదుటివారికిమధ్యవర్తిత్వముచేయు ప్రయత్నములు అనుకూలించవు. శ్రమాధికము ఆదాయముపరిమితముగాయుండును.

**వైశాఖము :** నూతనవస్త్రాభరణములు, కుటుంబములో ఆరోగ్యము, ఆనందము, అనుకూలత లుండును. స్త్రీసంబంధ, విద్యా, వాణిజ్య సంస్థలందు అభివృద్ధి అనుకూలతలుండును. పురోహి తులు, బ్రాహ్మణులు, న్యాయవాదులు, డాక్టర్లు, ప్లీడర్లకుయోగదాయకముగా యుండును. పుణ్యక్షేత్రములు, తీర్థయాత్రలు తదితర ఆధ్యాత్మిక కార్యక్రమములలోపాల్గొందురు.

**జ్యేష్ఠము :** కుటుంబములో అనారోగ్యము, అశాంతి, అవగాహనా లోపము కల్గును. బంధుమిత్రులసహాయము అందుటకష్టముగాయుండును. ప్రతివిషయములోనునేర్పుగా వ్యవహ రించవలసిన కాలముగాగుర్తించండి. కర్మాగారములందు, కృషి చేయువారికి వ్యయప్రయాసలు. ఉద్యోగ, వ్యవహారాదులందు ప్రోత్సాహంకన్పిస్తుంది. గురువులు, పురోహితులకు కొద్దిపాటి ఇబ్బందులుఏర్పడగలవు. రైతులు, ఫ్యాక్టరీకార్మికులకు, కూలీలకు యోగదాయకంగా వుంటుంది. అందరితోనూ ఉల్లాసంగా వుంటారు.

**ఆషాఢము :** మాట్లాడుమాటలు ఇతరుల మనస్సును నొచ్చుకొనని విధముగా మాట్లాడుట మేలు. విద్య, వైద్య, కంప్యూటర్, టెక్నికల్ చేతివృత్తుల వారికికూడా అభివృద్ధి, ప్రోత్సాహము, లాభ ముకల్గును. గుమస్తాలు, జాయింటుదారులు, భార్యాబిడ్డలుఅనుకూలముగాసంచరించుదురు. బంధుమిత్రులతో కలిసి విలాసములతో ఆనందముగా కాలము గడుపుదురు. పనులలోఆదాయానికి లోటుండదు. కానీ అదేసమయంలో ఖర్చుకూడా విప రీతంగా వుంటుంది. ధనధాన్యాలువృద్ధిచెందుతాయి. కుటుంబంలోప్రశాంతత నెలకొంటుంది. మీమాటకువిలువనిస్తారు. షేర్‌మార్కెట్ వారికి, నూతనవస్త్రాలు, నూతనవాహనప్రాప్తికలు గుతుంది.

**శ్రావణము :** బంధుమిత్రులరీత్యా ఆధాయమునుమించిన ఖర్చులు పట్టుదలతో వ్యవహరించిన పనులు సజావుగాసాగును. చెప్పుడు మాటలు చెవికి ఎక్కించుకొనకండి. వాహన ములు నడుపువారు సమయము గుర్తించుటమేలు. పుత్రులు, మిత్రులుకూడా శత్రువులుగా వ్యవహ రించు కాలముగాగుర్తించండి. మౌనము, ఓర్పు, నేర్పు శరణ్యమని గుర్తించుటమేలు. శత్రుపక్షబాధలు కొలదిగా వ్యతిరేకతలుకనబడును. ఋణములు చేయవలసి వచ్చుటకు అవకాశములుకలవు. ప్రయాణములందు, వాహనములందు, విద్యల యందు, భూముల యందు సామాన్య అనుకూలత లుండును. అపవాదులు, చేయని నేరములు మోపబడకుండా తగుజాగ్రత్తలుపాటించాలి.

**భాద్రపదము :** ప్రభుత్వోద్యోగులకు, టెక్నికల్‌వృత్తులవారికి ధనప్రాప్తి కలిగించును. కాని డబ్బుమాత్రంపొదుపు చేయలేరు. పన్నులు, చదువులకోసం ఖర్చవుతుంది. చేనేతకార్మికులు, వ్యవసాయదారులు చిన్నచిన్న ఆటంకాలు వచ్చినా సహనంతో నెట్టుకురాగలరు. ఆస్తులరీత్యా ఆదాయము చేతికందును. రైతులకు పంటలకంటె పాడిపరిశ్రమ మేలుగాయుండును. పూలు, పండ్లు, కూరగాయలు పండించువారికిఅమ్మువారికికూడా అనుకూలముగా యుండును. శరీరములో జ్వరములు, తదితర ఉష్ణసంబంధ వ్యాధులురాకుండా జాగ్రత్తలు పాటించాలి.

**అ. ఆశ్వీయుజము :** వృత్తి, ఉద్యోగ, వ్యాపారములందు దిగువ నౌకర్ల సహాయము, పై అధికారుల ఆదరణ, బంధుమిత్రలాభముకలుగును. ఇండ్లు, భూములు, అపార్టుమెంట్లు అమ్మువారికి కొను గోలు చేయువారికి మంచి అనుకూలతలుండును. విద్యుత్తు శాఖవారికి, మిలటరీ, పోలీసు శాఖలందు పని చేయువారికి అభివృద్ధి, ధనలాభము, ఇంక్రిమెంటులు, ప్రమోషన్లు కలుగును. గణితశాస్త్రము, రాజకీయము లవారికి లాభదాయకముగా నుండును. ఆర్థిక వెసులుబాటు పెరుగుతుంది.

**ని. ఆశ్వీయుజము :** కుటుంబ విషయములలో కొంతగా సహాయసహకారములు చేయుదురు. చేయుపనులందు అడ్డంకులు, అవరోధములు కలుగుచుండును. వృత్తి, ఉద్యోగ, వ్యాపారములందు ఉన్నత వర్గములవారి వత్తిడి అధికముగా యుండును. గుమస్తాలు, నౌకర్లు, జాయింటుదారులు, బంధుమిత్రులతో సున్నితముగా వ్యవహ రించాలి. తగవులువాదోపవాదములకు వెళ్లికుండుట మేలు. పోలీసుస్టేషన్లు, కోర్టులు లాంటి న్యాయ పోరాటములకు వెళ్లకుండుట మేలు.

**కార్తీకము :** కుటుంబములోఆనందము, క్రయవిక్రయములు, ఎగుమతులు, దిగుమతులు, టోకు, చిల్లరవ్యాపారులకుకూడా అనుకూలముగాయుండును. హోటళ్లు, వెల్డింగ్ షాపులు, కుమ్మర్లు, కమ్మర్లు, ఇటుకబట్టీలవారు తదితరవృత్తులవారికి అనుకూలముగాయుండును. బంధుమిత్రులు, మోసపూరితముగా వ్యవహరించుదురు. కుటుంబ ము నందు ఘర్షణవాతావరణములుండును.

**మార్గశిరము :** భూములు, గృహములు, అపార్టుమెంటు తదితరస్థిరాస్తులు కొనువారికి అమ్మువారికి కూడా అనుకూలముగాయుండును. రియల్‌ఎస్టేట్, బిల్డర్స్, తాపీ, సెంట్రింగ్ వర్కర్లులకు కూడా లాభదాయకముగా యుండును. మహిళామండలి, డ్వాక్రా గ్రూపులు, మహిళారాజకీయనాయకులు, మహిళలునిర్వహించు సంస్థలుఅభివృద్ధి లాభదాయకముగాయుండును.

**పుష్యము :** ప్రయాణములమూలకముగను, భార్యతరుపుబంధువులరీత్యా అనుకూల తలుండును. చేయువృత్తి, ఉద్యోగ, వ్యాపారవ్యవహారములందు అమితశ్రద్ధ అవుసరమగును. ఇష్టముకాని ఆర్థికవ్యవహారము లందు, ముందు జాగ్రత్తలు అవుసరమగును. వ్యవసాయానికి, తోబుట్టువులకి డబ్బుఖర్చవుతుంది. గతంకంటే ఆదాయం తగ్గుతుంది. వృత్తి, ఉద్యోగ, వ్యాపార, వ్యవహార, రాజకీయము లందు అభివృద్ధిఅనుకూలత.

**మాఘము :** అన్నిరంగములవారికిప్రయత్నకార్యములుఅనుకూలించును. కుటుం బములోఆరోగ్యము, ఆనందము అనుకూలత కలిగియుందురు. వ్యాపారములందు, గుమస్తా పనులందు, వ్రాతపనులందు, ఆదాయము బాగుంటుంది. ఇతరులతో మాట్లాడేసమయంలో జాగ్రత్తవహించాలి. మిలటరీ, పోలీసు, విద్యుత్తుశాఖ ఉద్యోగులకు ప్రమోషన్లు, ధనలాభము.

**ఫాల్గుణము :** పువ్వులు, పండ్లు, అగరవత్తులు, కర్పూరము, తదితర పూజావస్తువులు అమ్మువారికి స్వర్ణ యుగముగాయుండురు. భక్తిప్రపత్తులతో తరించుదురు. ఎనలేని ఆత్మశాంతిని పొందుదురు. అన్నిరంగములవారికి అతి ప్రయాసమీదధనము చేతికి అందును.

# భవిష్యవాణి 2020-21

1. తెలుగు రాష్ట్రాల మధ్య నదీ జలాల వివాదాలు.
2. తెలంగాణాలో డ్రగ్స్ కల్చర్ గ్రామాలకు వ్యాపిస్తుంది.
3. కె.సి.ఆర్ గారికి సంతానం వలన కీర్తినష్టం.
4. కొందరు తెలంగాణా రాష్ట్ర మంత్రులకు రోడ్డు ప్రమాదాలు, మరణం.
5. మంత్రి ఎర్రబెల్లి దయాకర్‌రావు గారికి ఆరోగ్యభంగం, అనుచర గణం ఆకస్మిక మరణాలు తీరనిలోటు.
6. బిజెపి మూర్ఖ నిర్ణయాలు దేశవ్యాప్తంగా తిరుగుబాటును ఎదుర్కోన్నా వీరనుకున్నదే రాజ్యం.
7. ఒక కేంద్ర మంత్రి అకాలమరణం.
8. కార్పొరేట్ విద్యా మోసాలు విద్య వ్యాపారమయం.
9. వైద్యరంగంలో ప్రకృతివైద్యం నిజమైనదని ప్రజలు విశ్వసిస్తారు.
10. అమెరికాలో విమాన ప్రమాదాలు, ప్రకృతి విలయం.
11. పాక్ ప్రపంచ దేశల దృష్టిలో ప్రమాదకర దేశమనే వాస్తవం విదేశీ సదస్సుల ద్వారా స్పష్టం అవుతుంది.
12. పాక్ చైనా దోస్తీ చైనాకు కీర్తి నష్టం.
13. ఎప్పుడూ చూడనన్ని విమాన ప్రమాదాలు జరుగుతాయి.
14. అక్టోబర్ 2020లో రష్యాపై ప్రకృతి కన్నెర్ర చేస్తుంది.
15. మార్చి 2020నుండి 6నెలలు ధరలు– నూనె, నెయ్యి, పాలు, పంచదార, బెల్లం, బియ్యం, మినుపులు, కందిపప్పుకు అనూహ్యం పెరిగి నట్టే పెరిగి పడిపోతాయి.
16. 2020 మార్చి నుండి నవంబర్ మధ్య ఫసిఫిక్‌దీవులు, ఫిలిప్పీన్స్‌ల్లో ప్రకృతి వైపరీత్యాలు, భూకంపాలు.
17. జపాన్‌కు తప్పని పెను భూకంపం.
18. భారత్ క్రికెట్‌లో గంగూలీ వల్ల అవినీతి, అధికార, రాజకీయ రోగం ముదురుతుంది.
19. ప్రముఖ తెలుగు టి.వి యాంకర్‌కు తీవ్ర అనారోగ్యం.
20. అన్ని రకాల లోహాల ధరలు పెరుగుతాయి.
21. భారత కీర్తి పతాకాన్ని విశ్వం శిఖరంలో నిలబెట్టడంలో ఇస్రో విజయాలు కీలకపాత్ర వహిస్తాయి.
22. వైఎస్ఆర్‌సిపి నిర్ణయాలు వివాదాల సంసారానికి ఉదాహరణలు.
23. తెలుగు ముఖ్యమంత్రుల తీరు మొండివాడు రాజుకన్నా బలవంతుడన్నట్టు ఉంటుంది.
24. కార్పరేట్ ఆసుపత్రుల్లో అవయవ విక్రయ కేంద్రాలుగా మారి కుంభకోణాలు బయటపడతాయి.
25. తెలుగు రాష్ట్రాల్లో మీడియా సంస్థలు కొన్ని అనూహ్యంగా మూతపడతాయి.
26. తెలంగాణాలో మళ్ళీ నక్సల్స్ ప్రభావం పెరుగుతుంది.
27. నవంబర్ తర్వాత దక్షిణ భారతదేశంలో బెంగుళూరు, హైదరాబాద్ వంటి నగరాల్లో అగ్ని ప్రమాదాలు.
28. అతి పెద్ద ఐటి సంస్థ కర్ణాటకకు చెందినది మూత పడుతుంది.
29. ఉల్లి, బంగాళదుంప, దోండకాయల ధరలకు రెక్కలు.
30. ఆకుకూరల ధరలు కూడా పెరుగుతాయి.
31. గ్రీకు దేశానికి దుర్భిక్షకాలం.
32. నిర్భయ, దిశా చట్టాలు వైఫల్యం.
33. నకిలీ విదేశీ సంస్థలు యమ్ఎల్‌యమ్ మార్కెటింగ్‌తో ప్రజలని దోచుకుంటాయి.
34. తెలంగాణాలో కల్తీ వ్యాపారాలు యధేచ్ఛగా సాగుతాయి.
35. తెలుగు చిత్ర సీమలో చిన్న చిత్రాలు భారీ విజయాలు సాధిస్తాయి.
36. భారీ చిత్రాల అపజయాలు తప్పవు.
37. మీడియాలో న్యూస్ న్యూసెన్స్ అన్నట్టు ప్రజలు భావించేలా తయారవుతుంది.
38. విద్యార్థులు విహరయాత్రల్లో మరణిస్తారు.
39. తెలంగాణాలో గంజాయి సాగు, వాడకం పెరుగుతుంది.
40. ఆంధ్రలో కాల్‌మనీ తిరిగి ఊపిరిపోసుకుంటుంది.
41. ఆగష్టు నుండి కేంద్రం జగన్‌పై ఉన్న కేసుల్ని కక్షసాధింపుకు లేవనెత్తుతుంది.
42. విజయవాడకు చెందిన బడా పారిశ్రామిక రాజకీయ నాయకుడు జైలుపాలు.
43. రోడ్డు ప్రమాదాల మరణాలెన్నో పెరుగుతాయి. మద్యం మత్తులో జరిగే ప్రమాదాలే తెలంగాణాలో ఎక్కువ.
44. సామాజిక మాధ్యమాలే కేంద్రంగా బ్యాంకు ఖాతాలపై దాడి.
45. ఫేస్‌బుక్‌కు గడ్డుకాలం చాలా దేశాల్లో నిషేదం.
46. సెల్ఫిపిచ్చి వల్ల, టిక్‌టాక్ వీడియోల కారణంగా ప్రాణాలు పోదం, కాపురాలు కూలడం ఎక్కువవుతుంది.
47. పాక్ తీవ్రవాదులకు అణ్వాయుధ సంపత్తిని సమకూరుస్తుంది.
48. భారత్ క్రికెట్‌లో రోహిత్‌శర్మ, విరాట్‌కోహ్లి, జడేజా, షమీ, రాహుల్, పంత్, మంగౌష్, పాండ్య, బూమ్రాల జైత్రయాత్ర.
49. తెలుగు ఇంజనీరింగ్ విద్యార్థులు కొందరు ఒక అసాంఘిక కార్యకలాపంతో వార్తల్లో నిలుస్తారు.
50. కాంగ్రెస్‌కు మరింత గడ్డుకాలం. సోనియాగాంధీ ఆరోగ్యం తీవ్రంగా దెబ్బతింటుంది.
51. తెలంగాణాలో గోహత్యలు జరిగి గోమాత గోష తప్పదు.
52. కొందరు హైందవ పీఠాధిపతులు దేశవ్యాప్తంగా వారి అక్రమ అకృత్య కార్యకలాపాలు ట్రస్ట్‌ల అక్రమార్జన వల్ల జైలుకి వెళతారు
53. తెలంగాణాలోను ఒక పెద్ద హైందవ ట్రస్ట్‌పై కేంద్రం కన్ను. తెలంగాణా రాజకీయనాయకుల అక్రమార్జనకు ఆట్రస్ట్ కేంద్ర బిందువనేది బయట పడుతుంది. వారికి ప్రభుత్వం ఇచ్చిన కోట్లు విలువ చేసే స్థలాలు వెనక్కి.

54. యాదాద్రి తెలంగాణా వైభవానికి ప్రతీకగా మారుతుంది.

55. సిరిధాన్యాల తినండి ఆరోగ్యం అని చెప్పె వారి కల్తీ సిరిధాన్యాల వ్యాపారం గుట్టు బయట పడుతుంది.

56. తెలంగాణా సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులు అవినీతికి అడ్డాలు.

57. ఎర్రచందన అంతర్జాతీయ స్మగ్లర్లు పట్టుబడతారు.

58. చిన్నదేశాల పెద్ద విమానాలు కూలిపోతాయి.

59. మోదీ, షాల ద్వయం చేసే విదేశీ పర్యటనలు కొన్ని వివాదాస్పదంగా ముగుస్తాయి.

60. న్యాయస్థానాల తీర్పులు హాస్యాస్పదం అవుతాయి. సాధారణ జనానికి న్యాయస్థానాల మీద అపనమ్మకం.

61. కార్పొరేట్ విద్యాలయాల్లో విద్యార్థుల అనుమానాస్పద మృతి.

62. చిదంబరం రాజకీయంగా కనుమరుగు, ఆరోగ్యభంగం.

63. మిర్చి, ప్రత్తి పంటలకు అనుకూలధర.

64. ఐటికి అనుకూలకాలం.

65. ఢిల్లీ ముఖ్యమంత్రి కేజ్రీవాల్‌కు తీవ్ర ఇబ్బందులు.

66. లండన్, బ్రిటన్ దేశాలపై తీవ్రవాద పంజా.

67. భారతదేశంలో సైనిక దుస్తుల్లో ఉగ్రవాద దాడులు.

68. ఉత్తరప్రదేశ్‌లో మతపరమైన హింస.

69. పసుపుకు మంచి ధర.

70. నవాజ్ షరీఫ్‌కు మృత్యు భయం.

71. నల్ల కుబేరులు బిజేపికి చుట్టాలు. వారిపై ద్వంద్వ వైఖరి.

72. తెలుగు రాష్ట్రాల్లో రియలెస్టేట్‌కు అద్భుతకాలం. జంటనగరాలు, వరంగల్ జిల్లాలు, జనగామకు రియలెస్టేట్ బూమ్.

73. పెట్రో ఉత్పత్తుల ధరలు పెరుగుతాయి.

74. కార్ల తయారీ, కొనుగోళ్ళకు చాలా గడ్డుకాలం.

75. అమెరికాకు తీవ్రవాద ముప్పు.

76. ఆస్ట్రేలియాలో గన్ కల్చర్.

77. వజ్రాలు, బంగారం, వెండి ధరల్లో తీవ్ర ఒడిదుడుకులు.

78. విశాఖలో తీవ్ర భూకుంభకోణాలు.

79. బంగ్లాదేశ్, మయన్మార్లు దొంగవ్యాపారాలు, స్మగ్లింగ్‌లు భారత ఈశాన్య రాష్ట్రాలకు ముప్పు చేస్తాయి.

80. ఉత్తర భారతదేశంలో ప్రకృతి వైపరీత్యాలు, భూకంపాలు.

81. తమిళ రాజకీయాల్లో కమల్, రజనీ ఎలాంటి ప్రభావం చూపలేరు.

82. పవన్‌కల్యాణ్ చాలా వివాదాలకు కేంద్రం అయి అపకీర్తి పాలు. 2021 మార్చి వరకు పవన్‌కు గడ్డుకాలం.

83. ర్యాగింగ్ భూతం తెలంగాణాలో కొందరు విద్యార్థుల్ని బలి తీసుకుంటుంది.

84. నిత్యానంద జైలుపాలు.

85. తెలంగాణాలో బంజరు భూములు సాగులోకి వస్తాయి.

86. వైసిపి నాయకుల తీరువల్ల జగన్‌గారి శ్రమ వృధా.

87. జగన్‌కు అత్యంత దగ్గరైన వైసిపి నాయకుడి మరణం.

88. టి.వి సీరియల్స్, టి.వి షోస్ అసభ్యతను మరింత పెంచిపోషిస్తాయి.

89. అమరావతి,ఆంధ్ర రాజధానుల విషయంలో ఉద్యమాలు,అనవసర రాద్ధాంతాలు ఆగస్టు వరకూ ఆగవు.

90. అమరావతి రాజధాని శంకుస్థాపన ముహూర్తం తప్పు, అలాగే అక్కడి శంకుస్థాపన జరిగిన స్థలంలో తీవ్రమైన భూశల్యాల కారణంగానే వివాదాస్పదం.

91. పివి.సింధు మరిన్ని విజయాలు.

92. ఉత్తరాంధ్రకు చెందిన హైందవ పీఠం ప్రవర్తన వివాదాస్పదం.

93. ఆగస్ట్ తర్వాత ఆంధ్రలో రాజకీయ అస్థిరత.

94. తెలుగు సినీ సినియర్ గాయకుడి మరణం.

95. తెలుగు సినీ ప్రముఖులు చాలా మందికి తప్పని ప్రమాదాలు, మృత్యు భయం.

96. మళ్ళీ కాస్టింగ్ కౌచ్, మీటూ ఉద్యమం.

97. ధనుష్‌కు ఆపదలు, అపకీర్తి.

98. అల్లుఅర్జున్ సినిమాలు అసంతృప్తి.

99. చరణ్, వరుణ్, సాయిధరమ్‌తేజ్, చిరంజీవిల సినిమాలు విజయం.

100. నాగార్జున, వెంకీ కుటుంబాలకు గడ్డు సమయం.

101. తెలుగు వార్తాపత్రికాధినేత ఆరోగ్యం విషమం.

ఇవన్నీ మాకు లభించిన జ్యోతిష వివరాలు, వర్ష జగర్లగ్న కుండలులూ పరిశీలించి మా పరిజ్ఞానం సహకరించిన మేరకు అందిస్తున్నాం.

## ఎందుకు సరైన ఫలితాలు అందరూ అందుకోవట్లేదు

ఇప్పుడు వీధికో జ్యోతిష్కుడు వాడికేమెచ్చో రాదో కనీసం జనాలకి అవగాహన ఉండదు. పూర్తి అపనమ్మకం. అలాగే **టి.వి** లో కనిపిస్తే వాడు గొప్ప . వాడికి ఎ బి సి **డి**లు రానక్కర్లేదు . వాడిపై ఎన్నికేసులున్నా వాడే గొప్ప. ఇంకో పైత్యం ఏంటంటే కొందరు ఎవడు జ్యోతిష్యం చెప్తే వాడి దగ్గరల్లా చెపించుకోవడం , మరోకరి దగ్గరికి వెళ్ళి మరి ముందు ఫలానా గురువుగారు ఇలా అన్నారు మీరిలా అంటున్నారేంటి అని పరీక్ష మాటలు. ఇక్కడ ప్రధాన లోపం సద్గురువును ఎంచుకోవడంలో . **ఒకే తల్లి,ఒకే తండ్రి లాగ ఒకే గురువు** అంతే. పది మంది భర్తలనే భావన ఎంత తప్పో , ఎక్కువ మంది గురువులను ఆశ్రయించడం మరింత తప్పు. ఎందుకంటే మీరెవరి మాట వినక వారిని పరిక్షించడం అనే తప్పు మీద తప్పు చేస్తారు. అందువల్ల పాడయ్యేది మీరే.

**సద్గురువును ఆశ్రయించు – మంచి మార్గంలో జీవించు**

# 2020-21 శ్రీశార్వరి సంవత్సరములో కార్తిప్రవేశములు, ఫలితనిర్ణయము

| క్ర.సం | తేది | వారము | కార్తె | ప్రవేశనక్షత్రం | ప్రవేశసమయం | రాశి | వృష్టి | కార్తి ఫలితము |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 13.04.2020 | సోమవారము | అశ్విని | పూ.షాఢ | రా 8.14 | ధను | అల్పవృష్టి | ఉక్కపోతలున్ననూ అప్పుడప్పుడు చిరుజల్లులు |
| 2 | 27.04.2020 | సోమవారము | భరణి | మృగ | మ 12.00 | వృష | అల్పవృష్టి | వేడి ఎక్కువగా ఉండును, సముద్ర తీరంలో వాన |
| 3 | 11.05.2020 | సోమవారము | కృత్తిక | పూ.షాఢ | ఉ 06.14 | ధను | పర్వతవృష్టి | ఉరుములతో కూడిన జల్లులు, ఎండ తీవ్రత |
| 4 | 24.05.2020 | ఆదివారము | రోహిణి | మృగ | రా 2.25 | మిధు | సువృష్టి | వేడి అధికముగానుండును, కాశ్మీరులో వేడి |
| 5 | 07.06.2020 | ఆదివారము | మృగశిర | పూ.షాఢ | రా 12.19 | ధను | అల్పవృష్టి | గాలిమార్పులతో దుమ్ము, ఎండ తీవ్రత |
| 6 | 21.06.2020 | ఆదివారము | ఆరుద్ర | ఆరుద్ర | రా 11.19 | మిధు | అల్పవృష్టి | వర్షములు తేలికగా పడును, రాత్రులు వేడి |
| 7 | 05.07.2020 | ఆదివారము | పునర్వసు | పూ.షాఢ | రా 10.54 | ధను | సువృష్టి | వర్షములు పడిననూ పగలు వేడిగానుండి,రాత్రులు చలి. |
| 8 | 19.07.2020 | ఆదివారము | పుష్యమి | పున | రా 10.27 | మిధు | పర్వతవృష్టి | నదీనగరాలలో అధికవర్షములు పడును. |
| 9 | 02.08.2020 | ఆదివారము | ఆశ్రేష | ఉ.షాఢ | రా 9.19 | మక | అల్పవృష్టి | సామాన్య పంటలకు తాపత్రయము |
| 10 | 16.08.2020 | ఆదివారము | మఖ | పున | రా 7.02 | మిధు | అల్పవృష్టి | సమతుల్యతగల వాతావరణము, చలి, వేడి |
| 11 | 30.08.2020 | ఆదివారము | పుబ్బ | శ్రవ | మ 2.57 | మక | సువృష్టి | మంచి వర్షములు పడును. గుజరాత్ లో తుఫాన్ |
| 12 | 13.09.2020 | ఆదివారము | ఉత్తర | పున | ఉ8.54 | మిధు | అల్పవృష్టి | నీటి దగ్గర ప్రాంతాలలో జాగ్రత్తగా ఉండాలి. |
| 13 | 26.09.2020 | ఆదివారము | హస్త | శ్రవ | రా 12.20 | మక | అల్పవృష్టి | సామాన్య వర్షములు పడును. పల్లపు ప్రాంతాలు జలమయం |
| 14 | 10.10.2020 | శనివారము | చిత్త | పున | మ 1.26 | మిధు | సువృష్టి | చక్కని వాతావరణముచే ప్రజలకు సుఖము |
| 15 | 23.10.2020 | శుక్రవారము | స్వాతి | ఉ.షాఢ | రా 11.52 | మక | అల్పవృష్టి | తెలుగు రాష్టాలలో సుభిక్షము, పంటలకు గిరాకీ |
| 16 | 06.11.2020 | శుక్రవారము | విశాఖ | పున | ఉ 8.06 | మిధు | అల్పవృష్టి | చలి ఉన్ననూ, పగలు వేడిగానుండును. |
| 17 | 19.11.2020 | గురువారము | అనూరాధ | ఉ.షాఢ | మ 2.04 | ధను | సువృష్టి | గాలిమార్పులచే వాతరోగములుండును జాగ్రత్త. |

## శార్వరి నామ సంవత్సరంలో శివ, విష్ణు, సుబ్రహ్మణ్య, చండీ, గణపతి ఆరాధనలకు ఉపయుక్త తిధులు-తేదీలు

| షష్ఠితిధులు | | ఏకాదశులు | | పౌర్ణములు | సంకటహర చతుర్థులు | మాస శివరాత్రులు | అమావాస్యలు | ఆరుద్ర నక్షత్రాలు |
|---|---|---|---|---|---|---|---|---|
| 30మార్చిసోమ | 8అక్టో గురు | 4ఏప్రి శని | 13అక్టో మంగ | 8ఏప్రి బుధ | 11ఏప్రి శని | 21ఏప్రి మంగ | 23ఏప్రి గురు | 1ఏప్రి బుధ |
| 13ఏప్రి సోమ | 21అక్టో బుధ | 18ఏప్రి శని | 27అక్టో మంగ | 7మే గురు | 10మే ఆది | 20మే బుధ | 22మే శుక్ర | 28ఏప్రి మంగ |
| 28ఏప్రి మంగ | 7నవం శని | 4మే సోమ | 11నవం బుధ | 5జూన్ శుక్ర | 8జూన్ సోమ | 19జూన్ శుక్ర | 21జూన్ ఆది | 26మే మంగ |
| 13మే బుధ | 20నవం శుక్ర | 18మే సోమ | 25నవం బుధ | 5జూలై ఆది | 8జూలై బుధ | 19జూలై ఆది | 20జూలై సోమ | 22జూన్ సోమ |
| 28మే గురు | 6డిసెం ఆది | 2జూన్ మంగ | 11డిసెం శుక్ర | 3ఆగ సోమ | 7ఆగ శుక్ర | 17ఆగ సోమ | 19ఆగ బుధ | 19జూలై ఆది |
| 11జూన్ గురు | 19డిసెం ఆది | 16జూన్ మంగ | 25డిసెం శుక్ర | 2సెప్టె బుధ | 5సెప్టె శని | 15సెప్టె మంగ | 17సెప్టె గురు | 16ఆగ ఆది |
| 26జూన్ శుక్ర | 4జన సోమ | 1జూలై బుధ | 9జన శని | 1అక్టో గురు | 5అక్టో సోమ | 15అక్టో గురు | 16అక్టో శుక్ర | 12సెప్టె శని |
| 10జూలై శుక్ర | 18జన సోమ | 16జూలై గురు | 24జన ఆది | 30నవం సోమ | 4నవం బుధ | 13నవం శుక్ర | 15నవం ఆది | 9అక్టో శుక్ర |
| 25జూలై శని | 2ఫిబ్ర మంగ | 30జూలై గురు | 7ఫిబ్ర ఆది | 30డిసెం బుధ | 3డిసెం గురు | 13డిసెం ఆది | 14డిసెం సోమ | 6నవం శుక్ర |
| 10ఆగ సోమ | 17ఫిబ్ర బుధ | 15ఆగ శని | 23ఫిబ్ర మంగ | 28జన గురు | 2జన శని | 11జన సోమ | 13జన బుధ | 3డిసెం గురు |
| 23ఆగ ఆది | 4మార్చి గురు | 29ఆగ శని | 9మార్చి మంగ | 27ఫిబ్ర శని | 1ఫిబ్ర సోమ | 10ఫిబ్ర బుధ | 11ఫిబ్ర గురు | 30డిసెం బుధ |
| 8సెప్టె మంగ | 19మార్చి శుక్ర | 13సెప్టె ఆది | 25మార్చి గురు | 28మార్చి ఆది | 2మార్చి మంగ | 11మార్చి గురు | 13మార్చి శని | 26జన మంగ |
| 22సెప్టె మంగ | 2ఏప్రి శుక్ర | 27సెప్టె ఆది | 7ఏప్రి బుధ | | 31మార్చి బుధ | 10ఏప్రి శని | 12ఏప్రి సోమ | 23ఫిబ్ర మంగ |
| | | | | | | | | 22మార్చి సోమ |
| సుబ్రహ్మణ్యఆరాధనకు శ్రేష్ఠం | | వైష్ణవ ఆరాధనకు శ్రేష్ఠం | | దేవీ ఉపాసనకు చండీహెూమానికి సత్యనారాయణ వ్రతాలకు శ్రేష్ఠం | గణపతి ఆరాధనకు శ్రేష్ఠం | శివారాధనకు శ్రేష్ఠం | ప్రత్యంగిరా హెూమానికి శివారాధనకు శ్రేష్ఠం | శివారాధనకు శ్రేష్ఠం |

# రాశి కూటాది చక్రం

| అవకహడ చక్రం | నక్షత్ర ములు | రాశి | అధి పతులు | గ్రహ మైత్రి | గ్రహ శత్రు | గ్రహ సమం | గణము | పాదం | యోని | నాడి | వశ్యం | వర్ణం | రజ్జు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చూ,చే,చో,ల | అశ్వ | మేషం | కుజుడు | గురు | బుధ | శుక్ర | దేవ | బంగారము | గుఱ్ఱము | ఆది | సిం | క్షత్రియ | పాదం |
| లీ,లూ,లే,లో | భరణి | మేషం | కుజుడు | చంద్ర | బుధ | శని | మను | బంగారము | ఏనుగు | మధ్య | వృశ్చి | క్షత్రియ | కటి |
| అ | కృత్తిక | మేషం | కుజుడు | రవి | బుధ | – | రాక్ష | బంగారము | మేక | అంత్య | – | క్షత్రియ | ఉదరం |
| ఈ,ఉ,ఏ | కృత్తిక | వృషభం | శుక్రుడు | బుధ | రవి | – | రాక్ష | బంగారము | మేక | అంత్య | కర్క | వైశ్య | ఉదరం |
| ఓ,వా,వీ,వూ | రోహి | వృషభం | శుక్రుడు | శని | చంద్ర | కుజ | మను | బంగారము | పాము | అంత్య | తుల | వైశ్య | కంఠం |
| వే,వో | మృగ | వృషభం | శుక్రుడు | శని | కుజ | గురు | దేవ | బంగారము | ఆడపాము | మధ్య | – | వైశ్య | మస్తకం |
| కా,కి | మృగ | మిథున | బుధుడు | రవి | చంద్ర | కుజ | దేవ | బంగారము | ఆడపాము | మధ్య | కన్య | – | మస్తకం |
| కూ,ఖం,జ్ఞ,ఛ | ఆర్ద్ర | మిథున | బుధుడు | శుక్ర | చంద్ర | గురు | మను | వెండి | కుక్క | ఆది | – | శూద్ర | కంఠం |
| కే,కో,హ | పున | మిథున | బుధుడు | శుక్ర | చంద్ర | శని | దేవ | వెండి | ఆడపిల్లి | ఆది | – | – | ఉదరం |
| హి | పున | కర్కాటక | చంద్రుడు | – | – | కుజ | దేవ | వెండి | ఆడపిల్లి | ఆది | వృశ్చి | – | ఉదరం |
| హు,హే,హో,డా | పుష్య | కర్కాటక | చంద్రుడు | రవి | – | బు,గు | దేవ | వెండి | ఆడమేక | ఆది | – | బ్రాహ్మ | కటి |
| డీ,డూ,డే,డో | ఆశ్లే | కర్కాటక | చంద్రుడు | బుధ | – | శు,శ | రాక్ష | వెండి | మగపిల్లి | అంత్య | ధను | – | పాద |
| మా,మీ,మూ,మే | మఖ | సింహం | సూర్యుడు | కుజ | – | – | రాక్ష | వెండి | ఎలుక | అంత్య | – | – | పాద |
| మో,టా,టీ,టు | పుబ్బ | సింహం | సూర్యుడు | గురు | శుక్ర | బు | మను | వెండి | ఆడఎలుక | మధ్య | తుల | క్షత్రియ | కటి |
| టే | ఉత్తర | సింహం | సూర్యుడు | చంద్ర | శని | – | మను | వెండి | ఎద్దు | ఆది | – | – | ఉదరం |
| టో,పా,పి | ఉత్తర | కన్య | బుధుడు | రవి | చంద్ర | కుజ | మను | వెండి | ఎద్దు | ఆది | మీన | – | ఉదరం |
| పూ,షం,ణం,ఠ | హస్త | కన్య | బుధుడు | శుక్ర | చంద్ర | గురు | దేవ | వెండి | బఱ్ఱె | ఆది | మిథు | వైశ్య | కంఠం |
| పే,పో | చిత్త | కన్య | బుధుడు | శుక్ర | చంద్ర | శని | రాక్ష | వెండి | పులి | మధ్య | – | – | మస్తకం |
| రా,రీ | చిత్త | తుల | శుక్రుడు | బుధ | రవి | కుజ | రాక్ష | వెండి | పులి | మధ్య | – | – | మస్తకం |
| రూ,రే,రో,తా | స్వాతి | తుల | శుక్రుడు | శని | చంద్ర | గురు | దేవ | వెండి | దున్న | అంత్య | మక | శూద్ర | కంఠం |
| తీ,తు,తే | విశాఖ | తుల | శుక్రుడు | శని | చంద్ర | – | రాక్ష | లోహము | ఆడపులి | అంత్య | కన్య | – | ఉదరం |
| తో | విశాఖ | వృశ్చిక | కుజుడు | గురు | – | శుక్ర | రాక్ష | లోహము | ఆడపులి | అంత్య | – | – | ఉదరం |
| నా,నీ,నూ,నే | అనూ | వృశ్చిక | కుజుడు | చంద్ర | బుధ | శని | దేవ | లోహము | ఆడజింక | మధ్య | కర్కా | బ్రహ్మ | కటి |
| నో,య,యీ,యు | జ్యేష్ఠ | వృశ్చిక | కుజుడు | రవి | – | – | రాక్ష | లోహము | మగజింక | ఆది | – | – | పాదం |
| యే,యో,బా,బీ | మూల | ధనుస్సు | గురుడు | కుజ | బుధ | – | రాక్ష | లోహము | ఆడకుక్క | ఆది | మీనం | – | పాదం |
| బు,థా,భా,ఢా | పూ.షాఢ | ధనుస్సు | గురుడు | చంద్ర | శుక్ర | శని | మను | రాగి | కోతి | మధ్య | – | క్షత్రియ | కటి |
| బే | ఉ.షాఢ | ధనుస్సు | గురుడు | రవి | – | – | మను | రాగి | ముంగిస | అంత్య | – | – | ఉదరం |
| బో,జా,జి | ఉ.షాఢ | మకరం | శని | శుక్ర | రవి | – | మను | రాగి | ముంగిస | అంత్య | మేషం | – | ఉదరం |
| జూ,జె,జో,ఖ | శ్రవణ | మకరం | శని | బుధ | చంద్ర | గురు | దేవ | రాగి | ఆడకోతి | అంత్య | కుంభ | వైశ్య | కంఠం |
| గా,గి | ధనిష్ఠ | మకరం | శని | – | కుజ | – | రాక్ష | రాగి | ఆడసింహం | మధ్య | – | – | మస్తకం |
| గూ,గే | ధనిష్ఠ | కుంభం | శని | బుధ | చంద్ర | గురు | రాక్ష | రాగి | ఆడగుఱ్ఱం | ఆది | మేషం | శూద్ర | కంఠం |
| గో,సా,సీ,సు | శత | కుంభం | శని | బుధ | చంద్ర | గురు | రాక్ష | రాగి | ఆడగుఱ్ఱం | ఆది | మేషం | శూద్ర | కంఠం |
| సే,సో,దా | పూ.భా | కుంభం | శని | – | కుజ | – | మను | రాగి | సింహం | ఆది | – | – | ఉదరం |
| ది | పూ.భా | మీనం | గురుడు | రవి | – | – | మను | రాగి | సింహం | ఆది | – | – | ఉదరం |
| దు,శ్యం,ఝూ,థా | ఉ.భా | మీనం | గురుడు | చంద్ర | బుధ | శని | మను | రాగి | ఆవు | మధ్య | మకరం | బ్రహ్మ | కటి |
| దే,దొ,చా,చి | రేవతి | మీనం | గురుడు | కుజ | శుక్ర | – | దేవ | బంగారం | ఆడఏనుగు | అంత్య | – | – | పాదం |

## శిశుజననము - నక్షత్ర పాద దోషములు

| నక్షత్రము | 1వ పాదము | 2వ పాదము | 3వ పాదము | 4వ పాదము |
|---|---|---|---|---|
| అశ్విని | తండ్రికి | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | మంచిది | శిశువునకు |
| కృత్తిక | మంచిది | చెడ్డది | మంచిది | తల్లికి |
| రోహిణి | పిత్రు,మామ | పిత్రు,మామ | పిత్రు,మామ | పిత్రు,మామ |
| మృగశిర | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| ఆర్ద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | చెడ్డది | చెడ్డది | మంచిది |
| ఆశ్రేష | మంచిది | ధనహాని | తల్లి | తండ్రి |
| మఖ | చెడ్డది | మంచిది | చెడ్డది | మంచిది |
| పూర్వఫల్గుని | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఉత్తరఫల్గుని | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| హస్త | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| చిత్ర | చెడ్డది | చెడ్డది | మంచిది | మంచిది |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |
| అనూరాధ | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| జ్యేష్ఠ | తల్లికి | సోదర,మామ | శిశువునకు | తండ్రికి |
| మూల | తండ్రికి | తండ్రికి | ధనహాని | మంచిది |
| పూ.షాఢ | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| ఉ.షాఢ | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ట | మంచిది | చెడ్డది | మంచిది | మంచిది |
| శతభిష | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| పూ.భాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఉ.భాద్ర | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |

## శ్రీ శార్వరి నామ సంవత్సర (2020-21) గ్రహ సంచారములు

### రవి సంచారము – 2020

| | | | | |
|---|---|---|---|---|
| ఏప్రి | 13 | మేషం | రా. | 8.24 |
| మే | 14 | వృషభం | సా. | 5.16 |
| జూన్ | 14 | మిథునం | రా. | 11.55 |
| జూలై | 16 | కర్కాటకం | ఉ. | 10.50 |
| ఆగష్టు | 16 | సింహం | రా. | 7.10 |
| సెప్టె | 16 | కన్య | రా. | 7.08 |
| అక్టో | 17 | తుల | ఉ. | 7.07 |
| నవ | 16 | వృశ్చిక | ఉ. | 6.55 |
| డిసె | 15 | ధనస్సు | రా. | 9.29 |
| **21జన** | 14 | మకరం | ఉ. | 8.15 |
| ఫిబ్ర | 12 | కుంభం | రా. | 9.09 |
| మార్చి | 14 | మీనం | సా. | 5.15 |

### కుజ సంచారము – 2020

| | | | | |
|---|---|---|---|---|
| మార్చి | 22 | మకరంలో | సంచారం | |
| మే | 4 | కుంభం | రా. | 8.39 |
| జూన్ | 18 | మీనం | రా. | 8.15 |
| ఆగష్టు | 16 | మేషం | రా. | 6.30 |
| సెప్టె | 8 | వక్రం | రాతె. | 5.05 |
| అక్టో | 4 | వక్రీమీనం | ఉ. | 10.19 |
| నవ | 13 | వక్రత్యాగం | రాతె. | 5.48 |
| డిసెం | 24 | మేషం | ఉ. | 10.20 |
| **21ఫిబ్ర** | 21 | వృషభం | రాతె. | 4.36 |
| ఏప్రి | 13 | మిథునం | రా. | 1.15 |

### బుధ సంచారము – 2020

| | | | | |
|---|---|---|---|---|
| ఏప్రిల్ | 7 | మీనం | ప. | 2.19 |
| ఏప్రిల్ | 24 | మేషం | రా. | 2.36 |
| మే | 9 | వృషభంవక్రీ | ఉ. | 9.50 |
| మే | 24 | మిథునం | రా. | 11.55 |
| ఆగష్టు | 1 | కర్కాటకం | రా. | 3.34 |
| ఆగష్టు | 17 | సింహం | ఉ | 8.30 |
| సెప్టె | 2 | కన్య | ప. | 12.00 |
| సెప్టె | 22 | తుల | సా. | 4.52 |
| నవం | 28 | వృశ్చికం | ఉ. | 7.05 |
| డిసెం | 17 | ధనస్సు | ప. | 11.40 |
| **2021** | | | | |
| జన | 4 | మకరం | రా. | 3.55 |
| జన | 25 | కుంభం | సా. | 4.30 |
| ఫిబ్ర | 4 | వక్రీబుధమకరం | రా | 11.05 |
| మార్చి | 11 | కుంభం | ప. | 12.35 |

### గురు సంచారము – 2020

| | | | | |
|---|---|---|---|---|
| **20**మార్చి | 29 | మకరం | రా. | 3.50 |
| జూన్ | 29 | వక్రీధనస్సు | రాతె. | 5.20 |
| నవ | 20 | మకరం | ప. | 1.24 |

### శుక్ర సంచారము – 2020

| | | | | |
|---|---|---|---|---|
| మార్చి | 28 | వృషభం | ప. | 3.40 |
| జూలై | 31 | మిథునం | రాతె. | 5.09 |
| ఆగష్టు | 31 | కర్కాటకం | రా. | 2.03 |
| సెప్టెం | 27 | సింహం | రా. | 1.03 |
| అక్టో | 23 | కన్య | ఉ. | 10.44 |
| నవం | 16 | తుల | రా. | 12.59 |
| డిసెం | 10 | వృశ్చికం | రాతె. | 5.20 |
| **21జన** | 3 | ధనస్సు | రాతె. | 5.05 |
| జన | 27 | మకరం | రా. | 3.29 |
| ఫిబ్ర | 20 | కుంభం | రా. | 2.22 |
| మార్చి | 16 | మీనం | రా. | 3.00 |
| ఏప్రిల్ | 10 | మేషం | ఉ. | 6.30 |

**శని సంచారము – 2020** వత్సరమంతయు మకరరాశి సంచారము.

**రాహు సంచారము–2020** వత్సరాది నుండి 23 సెప్టెం ఉ8.23 వరకు మిథునరాశియందు తదుపరి వత్సరమంతా వృషభరాశియందు సంచరించును.

**కేతు సంచారము – 2020** వత్సరాది నుండి 23 సెప్టెం. ఉ8.23 వరకు ధనస్సురాశి యందు తదుపరి వృశ్చికరాశి యందు సంచరించును.

**చంద్రుని సంచారము**–ప్రతిరోజు ఉన్న నక్షత్ర సంచారమును బట్టి తెలుసుకోవాలి.

# ముహూర్తాలలో గమనించాల్సినవి

వాస్తవంగా ఆలోచిస్తే ప్రతీ పంచాంగమునందు ఇచ్చే ముహూర్తములు అందరికి ఒక లాగే ఫలమును ఇచ్చునా అనే సందేహం కలుగకమానదు. ఒకే ముహూర్తము అందరికి యోగ్యముకాదు. పుట్టిన జన్మలగ్న, జన్మరాశిని అనుసరించి ముహూర్తము నిర్ణయించవలసి వస్తుంది. అయితే ముహూర్తసమయానికి ఉండే గ్రహబలాలవల్ల అందరూ ఒకే ముహూర్తంలో ఆచరించినా కాలక్రమంలో అవి సత్ఫలితాలను ఇచ్చుటలేదని పరిశీలనలో తెలుతోంది.

జాగ్రత్తగా ముహూర్త నిర్ణయం చేస్తే భవిష్యత్తులో ప్రమాదములు సంభవించవు. వాటిని వివరించుటకే మా ప్రయత్నం.

1. మన జన్మ లగ్నానికి ముహూర్త లగ్నము అష్టమ,షష్టమ, వ్యయము, ద్విర్ద్వాదశము కా రాదు. మిత్రత్వము ఉన్నప్పుడు దోషంకాదు.

2. లగ్న బలం, గ్రహ బలం శుభప్రదముగా ఉన్నప్పుడు పంచకరహితము చూడక్కరలేదు. అష్టమ, షష్ఠ, వ్యయ, రిఃఫ చంద్రుడు, షష్ఠ శుక్రుడు ఇలా ఒకటేమిటి ప్రతీ విషయాన్ని ప్రామాణికసూత్రాల ఆధారంగా సూక్ష్మ పరిశీలన చేయగా అనేక విషయాలు మనకు గోచరిస్తాయి. అందులో కొన్నిటిని ఇస్తున్నాము.

ఇక రహితం విషయంలో కూడా చాలా సూక్ష్మపరిశీలన జరగవలసి ఉన్నది.

1) రవి యోగప్రదుడైన లగ్నాలకు రాజ పంచకము, 2) చంద్రుడు యోగప్రదుడైన లగ్నాలకు వసు పంచకము, 3) కుజుడు యోగప్రదుడైన లగ్నాలకు అగ్ని,రాజ పంచకము,
4) గురుడు యోగప్రదుడైన లగ్నాలకు మృత్యుపంచకమయినా శుభమే. 5) శని యోగ ప్రదుడైన లగ్నాలకు మృత్యు పంచకమయినా శుభమే.

ఉదా : తులా లగ్నమునందు ముహూర్తమయి మృత్యు పంచకమైనా దోషము ఉండదు. ఎందుకనగా తులాలగ్నానికి శని రాజయోగ కారకుడు కనుక,మృత్యువుకు శని అధిపతి కనుక చెడు చేయడు.మేష లగ్నంలో ముహూర్తం ఉండి మృత్యు పంచకము అయితే పూర్తిదోషము ఉండును.మేషలగ్నానికి శని పాపి కనుక. ఇలానే అన్ని లగ్నాలకు చూచుకునేది. ఇంకా

1) రవి యోగ ప్రదుడైనప్పుడు జన్మతారలోనూ, 2) రాహువు యోగప్రదుడైనప్పుడు విపత్తార లోనూ, 3) కేతువు యోగప్రదుడైనప్పుడు ప్రత్యక్తారలోనూ, 4) శని యోగప్రదుడైనప్పుడు నైధనతార లోనూ ముహూర్తము శుభమే.

5) రవి యోగప్రదుడు కానప్పుడు జన్మతారలోనూ, 6) కుజుడు యోగప్రదుడు కానప్పుడు పరమైత్ర తారలోనూ, 7) గురుడు యోగ ప్రదుడు కానప్పుడు క్షేమతారలోనూ, 8) బుధుడు యోగప్రదుడు కానప్పుడు సంపత్తారలోనూ, 9) చంద్రుడు యోగప్రదుడు కానప్పుడు సాధన తారలోనూ ముహూర్తం దోషము.

ప్రతీ విషయం వెతికితే చాలా సూక్ష్మమైన అంశాలు బయటకు వస్తాయి. అయితే ఈ విషయాలు గ్రంథాలలో కనిపించవు.పరిశీలనలో మాత్రమే తెలతాయి.ఇలా చెప్తే చాలా విషయాలు ఉంటాయి. ఒక పెద్దగ్రంథమే అవుతుంది. పరిశీలన కొరకు క్లుప్తంగా ఇవ్వబడి నది. ఎవరిమటుకువారు పరిశీలించి తెలుసుకోవాలి. కేవలం ఇది నా వ్యక్తిగత శాస్త్రీయ అభిప్రాయం మాత్రమే.

మన జాతకం బాగోనప్పుడు మంచి ముహూర్తమయినా ఫలవంతము కాజాలదు. నైధనతారలో ముహూర్తం ఉండి శని బలవత్తరమయితే ముహూర్తము ఆచరించవచ్చు. ఎట్టి అభ్యంతరమూ లేదు. లగ్న-సప్తమ మందు గురుడుంటే లక్ష దోషాలు పోతాయనేది నానుడి మాత్రమే.అదే గురుడు రాశి చక్రంలో లగ్న మందుండి అంశ చక్రాదులలో నీచలో ఉన్నప్పుడు ఆ ముహూర్తము గురు బలాన్ని పొందినట్లుకాదు.

ఇలా ఎన్నో విషయాలు పెద్దల ద్వారా గ్రహించవచ్చు.

లగ్న,హోర,ద్రేక్కాణ,నవాంశ,ద్వాదశాంశ,త్రింశాంశ అనే 6 చక్రాలు శుద్ధిగా ఉండాలని శాస్త్ర నిర్ణయం. కావాలంటే ఒక్కసారి వివాహంలో పఠించే చూర్ణికలో చివరన చూడండి. కేవలం పంచాంగంలో ఉన్నాయని ముహూర్తం పెడితే అది సమాజానికి మేలు చేయదు.

ముహూర్తం తప్పుగా నిర్ణయిస్తే కొన్ని కుటుంబాలపై ప్రభావం చూపుతుంది. ఆ తప్పు మనల్ని వెంటాడుతుంది. యజమానుల శాపం తగులుతుంది.

... శుభమ్ ...

| జన్మలగ్నం | శుభ లగ్నాలు | మధ్యమ లగ్నాలు | అశుభ లగ్నాలు |
|---|---|---|---|
| మేషం | మేష,కర్కా,సింహ, వృశ్చి, ధను, మక,మీనం | మిథునం | వృష,సింహ,కన్య, తుల,కుంభ |
| వృషభం | వృష, మిథు, కన్య, తుల,మక,కుంభం | కర్కాటకం, సింహం | మేషం, వృశ్చికం, |
| మిథునం | వృష, మిథు,కన్య, తుల, కుంభ, మీన | కర్కాటకం | మేష, సింహ, వృశ్చి,ధను, మక |
| కర్కాటకం | మేష, వృష, కర్కా, సింహ, తుల,వృశ్చి,మీన | కన్య, ధనుస్సు, మకరం, మిథునం | కుంభం |
| సింహం | మేష, సింహ, వృశ్చి,ధను, | కన్య, కుంభ, మీన | వృష, మిథు,కర్కా, తుల,మక, |
| కన్య | వృష,మిథు,సింహ, కన్య,తుల,ధను,మక, | మేషం, కర్కా, వృశ్చి, కుంభం | మీనం |
| తుల | వృష, మిథు, కర్కా, తుల, మక, కుంభ | కన్య | మేష, సింహ, వృశ్చి, ధను, మీన |
| వృశ్చికం | మేషం, సింహం, వృశ్చికం, ధనుస్సు, మీనం | కర్కాటకం | వృష, మిథు, కన్య, మక, కుంభ |
| ధనుస్సు | మేష, వృశ్చి,ధను,మీనం | కర్కాటకం,సింహం | వృష, మిథు, కన్య, తుల, మక,కుంభ |
| మకరం | వృష, మిథు, కన్య,తుల, మక, కుంభ | కర్కాటకం | మేష, సింహ, వృశ్చి, ధను, మీన |
| కుంభం | వృష, మిథు, తుల, ధను, కుంభ | కర్కాటకం, మకరం | మేష, సింహ, కన్య, వృశ్చి, మీన |
| మీనం | మేష, కర్కా, వృశ్చి,ధను, మీన | కన్య, మకరం | వృష, మిథు, సింహ, తుల,కుంభ |

## జనన విషయమై దుష్టతిథి వార నక్షత్రములు

అశ్విని 1వ పాదము, మఘ 1వ పాదము, రేవతి 4వ పాదము. ఇవి శిశుగండము, భరణి 3వ పాదము, కృత్తిక 2వ పాదము, పుష్య 2,3 పాదములు, మఘ 3వ పాదము, ఉత్తర 1వ పాదము (కొందరు ఉత్తరాషాఢ యందురు) హస్త 3వ పాదము, చిత్త 1,2 పాదములు, పూర్వాషాఢ 3వ పాదము. ఇవి పురుషుడైన పితృగండం, స్త్రీ శిశువైనచో మాతృగండం.

రోహిణి 1,2 పాదములు తల్లికిని, మేనమామకును, 3,4 పాదములు కేవలం మేనమామకును గండములు. ఆశ్రేష 2వ పాదము ధనహని, 3వ పాదము తల్లిగండము, 4వ పాదము తండ్రి గండము, 1వ పాదము దోషము కాదు. మూల 1వపాదము తండ్రి గండము, 2వ పాదము తల్లిగండము, 3వ పాదము ధనహని, 4వ పాదము దోషము కాదు. అందును మూల 1వ పాదములో మొదటి సగము మిక్కిలి దోషమయినది. జ్యేష్ఠ యొక్క నక్షత్రాద్యంతమును 11చే భాగింపవలయును. అందేభాగమైనదో ఆ భాగము యొక్క ఫలమును తెలిసికొనవలయును. 1వ భాగము మాతామహి గండం. 2వ భాగము మాతామహ గండం, 3వ భాగము మేనమామ గండము, 4వ భాగము తల్లి గండము, 5వ భాగము శిశువు గండము, 6వ భాగము గోత్రనాశనము, 7వ భాగము ఉభయ కుల నాశనం, 8వ భాగము సోదర గండము, 9వ భాగము శ్వశుర గండము, 10వ భాగము సర్వనాశనము చేయును, 11వ భాగము మిక్కిలి దుష్టమయినది.

మీన మేషములకు, కర్కట సింహములకు, వృశ్చిక, ధనుస్సులకు సంధి అర ఘడియ ప్రబల శిశు గండం. పంచమీ షష్టికిని, దశమేకాదశులకును, పూర్ణిమా-అమావాస్య ప్రతిపత్తులకును సంధి 2 ఘడియలును బహుళ 14శి ఆరు వంతులలోను మొదటి ఆరవవంతు గాక మిగిలిన 5 భాగములు దుష్టములైనవి. వ్యతీపాత, వైధృతి, పరిఘ, వ్యప్ర, వైప్ర లకును మహాపాతలు, సంధ్యాకాలము అమావాస్యలకు తల్లి, తండ్రి, సోదరుడు వీరి నక్షత్రములైనను గ్రహణకాలమైనను గూడా శాంతి చేయవలెను.

పైన చెప్పబడిన నక్షత్రములందు ఆయా పాదములయందు జననమయినచో మహాదోషముగాన హోమములు, సమారాధనము మెదలగు సంపూర్ణ శాంతి చేయవలయును. చెప్పబడిన దుష్ట నక్షత్ర పాదములలో గాక తక్కిన పాదములలో జన్మించిన సామాన్య శాంతి చేసికొనుట యుక్తము. నక్షత్రము మంచిదై తక్కిన తిథి మొదలగునవి చెడుగైనను సామాన్య శాంతి చేసికొనవలయును. పేగు మెడలో వేసికొని పుట్టినను, దంతములతో పుట్టినను, కవల పిల్లలు పుట్టినను, శాంతి విధానమున శాంతి చేసికొనవలయును. తల్లిదండ్రుల నక్షత్రములలో పుత్రజననమయినను, పుత్రికాజననమయినను, గోముఖ ప్రసవ శాంతి చేసికొనవలయును. సోదర, సోదరీ నక్షత్రములలో జననమయ్యెనను సామాన్యశాంతి చేయవలెను. పైన తెలిపిన దుష్టకాలములలో జననమయిన నక్షత్ర జపము హోమము-తర్పణము నవధాన్యముల దానమిచ్చుట సమారాధనము శివాభిషేకము మెదలగు సంపూర్ణ శాంతి చేయవలయును. దుష్ట నక్షత్రములలోని దుష్టపాదములతో గాక మంచి పాదములలో జన్మించినను, మరియు మృగశిర 1వ పాదము, విశాఖ 4వ పాదము, అనూరాధ 3వ పాదము, ధనిష్ఠ 2వ పాదము, శతతార 1వ పాదము, ఉత్తరాభాద్ర 4వ పాదము – ఇవైనను సామాన్య శాంతి చేసికొనుట యుక్తము.

## జాతాశౌచాది విషయములు

స్త్రీలు బహిష్టు అయినప్పుడు, పురుషుడు వచ్చినపుడు, మరణము కలిగినను, రాత్రి ప్రమాణమును 3చేభాగించగా మొదటి 1–2 భాగములలోగా నగుచో పూర్వదినమనియు 3వ భాగములో నయిన పరదినమనియు లెక్కించనగును. గర్భము 6 మాసములు దాటినది లగాయితు అనగా 7వ మాసమువచ్చినది లగాయితు జ్ఞాతులకు అందరకును ప్రసవాశౌచము 10 రోజులు పట్టవలయును

## బాలారిష్ట గ్రహములు - భంగములు

(1) లగ్న శని (2) తృతీయ గురుడు (3) చతుర్ధ బుధుడు (4) పంచమ సూర్యుడు (5) షష్ఠ శుక్రుడు (6) సప్తమ కుజుడు (7) అష్టమ చంద్రుడు (8) నవమ రాహువు (9) ద్వాదశ కేతువు ఉన్నయెడల పండ్రెండు సంవత్సరముల లోపల అరిష్టము చేయుదురు. అట్లు అరిష్టము చేయని యెడల వారి వారి దశలలో నరిష్ట ము చేయగలరని శాస్త్రములు తెల్పుచున్నవి. శుభగ్రహములు బలవంతులై పాపగ్రహములు దుర్బలులై యుండి లగ్నము శుభక్షేత్రమై శుభదృష్టి కలిగియుండెనేని బాలారిష్టభంగమగును.

## నవగ్రహములకు జపహోమాదులు

| జన్మ (నామ) నక్షత్రం | | | గ్రహ నామం | నవ రత్నములు | అల్ప మూల్యం | జప పూజ | నవ ధాన్యములు | జప సంఖ్య | ఫలం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కృత్తి | ఉత్తర | ఉషా | రవి | కెంపు | పగడం | అభిషేక | గోధుమలు | 6వే | ఆరోగ్యం |
| రోహి | హస్త | శ్రవ | చంద్ర | ముత్యం | వెండి | దుర్గపూజ | బియ్యం | 10వే | కార్యసిద్ధి |
| మృగ | చిత్త | ధని | కుజ | పగడం | పగడం | సుబ్రహ్మణ్యం | కందులు | 7వే | శత్రుజయం |
| ఆర్ధ | స్వాతి | శత | రాహు | గోమేధి | లాజావ | దుర్గపూజ | మినుములు | 18వే | ధనప్రాప్తి |
| పున | విశా | పూభా | గురు | పుష్యరా | ముత్య | నమకపా | సెనగలు | 16వే | కుటుంబవృద్ధి |
| పుష్య | అనూ | ఉభా | శని | నీలం | లోహ | శివపూజ | నువ్వులు | 19వే | ఆరోగ్యవృద్ధి |
| ఆశ్రే | జ్యేష్ఠ | రేవ | బుధ | పచ్చ | బంగారు | విష్ణుపూజ | పెసలు | 17వే | బుద్ధిబలం |
| మఘ | మూల | అశ్వి | కేతు | వైఢూర్య | లాజావ | సూర్యనమ | ఉలవలు | 7వే | ఆరోగ్యం |
| పుబ్బ | పూషా | భర | శుక్ర | వజ్ర | వెండి | లక్ష్మీపూజ | బొబ్బర్లు | 20వే | ధనవృద్ధి |

## మాసాధిపతులు - మాసనామములు

| నెల | మాసము | మగశిశువు | ఆడ శిశువు |
|---|---|---|---|
| 1 | చైత్రమాసము | కృష్ణ | భూదేవి |
| 2 | వైశాఖమాసము | అనంత | కల్యాణి |
| 3 | జ్యేష్ఠమాసము | అచ్యుత | సత్యభామ |
| 4 | ఆషాడమాసము | చక్రి | పుణ్యవతి |
| 5 | శ్రావణమాసము | వైకుంఠ | రూపవతి |
| 6 | భాద్రపదమాసము | జనార్దన | ఇందుమతి |
| 7 | ఆశ్వీయుజమాసము | ఉపేంద్ర | చంద్రావతి |
| 8 | కార్తీకమాసము | యజ్ఞేశ్వర | లక్ష్మి |
| 9 | మార్గశిరమాసము | వాసుదేవ | వాగ్దేవి |
| 10 | పుష్యమాసము | హరినాథ | పద్మావతి |
| 11 | మాఘమాసము | గోవింద | శ్రీదేవి |
| 12 | ఫాల్గుణమాసము | పుండరీకాక్ష | సావిత్రి |

**శిశువును భూమిపై కూర్చుండబెట్టుటకు:** అశ్విని, మృగ, పుష్య, జ్యేష్ఠ ఈ నక్షత్రములు మంచివి. కుంచెడు ధాన్యం రాశిగా పోసి దానిపై నూతన వస్త్రము వేసి, 5వ నెలలో శిశువును దానిపై కూర్చుండబెట్టవలెను. పెద్దలచే ఆశీర్వచనము చేయించవలెను.

**అన్నప్రాశన:** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిథులు, సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్విని, రోహి, మృగ, పున, పుష్య, ఉత్త, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, ఉ.భాద్ర, రేవతి నక్షత్రములు, వృషభ, మిథున, కర్కా, కన్య, ధను, మీన లగ్నములు మంచివి. పురుషులకు సరిమాసం, స్త్రీలకు బేసిమాసం చూచేది లగ్నశుద్ధి కావలెను. మగపిల్లవానికి 6,7,10,12 సరిమాసములలో చెయ్యవలెను. ఆడపల్లిలకు 7,9,11 బేసి మాసములలో చెయ్యవలెను.

**కేశఖండనము (పుట్టువెంట్రుకలు):** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిథులు, సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్విని, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, తుల, ధను, మీనలగ్నములు ఉత్తరాయణము నందు 1,3,5 సంవత్సరములలో చేయవలెను. అష్టమ శుద్ధి చూచి స్త్రీలకు సరినెలలో జరిపించవలెను. పుణ్యక్షేత్రములలో కూడ జరిపించవచ్చును. శిశువు యొక్క తల్లి 5 మాసములు దాటి గర్భవతియైన యెడల పుట్టు వెంట్రుకలు తీయించరాదు. 5 సం॥లు దాటిన (పిల్ల) పిల్లవానికి తల్లి గర్భవతియైననూ కేశఖండన చేయవచ్చును. పెళ్ళి అయిన ఆరుమాసముల వరకు గృహారంభ, గృహప్రవేశము చేయరాదు.

# స్త్రీల విషయములో శుభముహూర్తాలు

## రజస్వల విషయమై దుష్ట తిథి వార నక్షత్రములు

రెండు పక్షములందు 1,4,6,8,9,12,14 తిథులయందును, అమావాస్యయందును, ఆది, మంగళ, శని వారములయందు భరణీ, కృత్తిక, ఆరుద్ర, పునర్వసు, ఆశ్రేష, మఘ, పుబ్బ, జ్యేష్ఠా, పూ.షా, పూ.భా యీ నక్షత్రములును దుష్టములు. వీటియందు ప్రథమ రజస్వలయినచో శాస్త్రోక్త శాంతిజేసి తిరుగ మంచికాల మందు రజస్వలయగు వరకు గర్భాదానము చేయింపజాలరు. నక్షత్రము దుష్టమయినచో హెూమవిధాన ముగ శాంతి చేయవలయును. నక్షత్రము మంచిదై, తక్కినవి చెడుగైనచో సామాన్య శాంతి చేయవలయును మరియు వ్యతీపాత, వైధృతి, పరిఘా పూర్వార్ధము, సంక్రాంతి, గ్రహణకాలము, నిద్రాసమయము ఇవియు ను శుభమయినవి కావు. మరియు ప్రాత: కాలమున సౌభాగ్యవతి, పూర్వాహ్ణమందు యాత్రలు చేయునది, మధ్యాహ్నమున పుత్రవతియు, ధనవతియు, సాయంకాలమున జారిణి, సంధ్యలయందు దుశ్చేష్టురాలును, అర్ధరాత్రియందు విధవయును, ఉష:కాలమున సౌభాగ్యవతియునగును.

**పుంసవన, సీమంతములు:** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, పౌర్ణమి తిథులను, బుధ, గురు, శుక్రవారములు, రోహిణి, హస్త, చిత్త స్వాతి, పుష్య, ఉత్తరాత్రయం, పున, అనూ, శ్రవ, ధని, రేవతి నక్షత్రములును, మేష, మిథున, తుల, ధను, కుంభ లగ్నములు మంచివి. పుంసవనమును 3వ మాసం, సీమంతమునకు 4,5,8మాసములుమంచివి.

**గాజులు పెట్టుటకు:** 5-7 బేసి మాసములలో పెట్టవలెను.

**గర్భవతియైన స్త్రీనిపురిటికి తీసుకొని వచ్చుటకు:** తిథి, వార నక్షత్రములు మంచివి చూసి 7వ మాసమునందు గాని, 9వ మాసమురాగానే గాని పుట్టింటికి తీసుకురావలెను. మొదటి రెండు పురుళ్ళు పుట్టింటినందు మూడవ పురుడు అత్తవారింటినందు పోసుకొనవలెను. బారసాల మొదటి నెలలో 11,21,23,25,27,29 బేసిరోజుల్లోను లేక 3వనెలలో చేయవలెను.

**బాలింతరాలి పథ్యము:** బుధ, గురు, శుక్రవారములు, పున, పుష్య, ధని, మృగ, హస్త, చిత్త, స్వాతి, రోహి, శ్రవ, ఉత్త, ఉ.షాఢ, ఉ.భాద్ర, అనూ, రేవతి నక్షత్రముల యందు, శుభతిథుల యందు మంచిది. దశమ స్థాన మందు గ్రహములు లేకుండా ఉండవలెను.

**బాలింతరాలికి స్నానమునకు:** హస్త, మృగ, అనూ, రోహి, రేవతి, అశ్వి, ఉత్తర, ఉ.షాఢ, ఉ.భాద్ర, స్వాతి నక్షత్రములు, ఆది, మంగళ, గురు వారములు మంచివి. 11వ రోజున చేయించవలెను.

**చెవులు కుట్టుటకు:** విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి తిథులు, సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్విని, మృగ, పున, పుష్య, ఉత్తర, హస్త, చిత్త, అనూ, ఉ.షాఢ, శ్రవ, ధని, ఉ.భాద్ర, రేవతి నక్షత్రములు వృషభ, మిథు, కర్కాటక, కన్య, ధను, మీన లగ్నములు, 6,7,8 మాసములందు జరిగించవలెను. అష్టమ శుద్ధి, గురుబలం ఉండవలెను.

**కన్యలకు ముక్కు కుట్టుటకు:** అశ్వి, మృగ, పున, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, శ్రవణ, ధని, శతభిష, రేవతి నక్షత్రముల యందు శుక్ల పక్షము నందు ముక్కు కుట్టవలెను.

**దత్తత స్వీకారము:** 2,3,5,7,10 శుద్ధ ఏకాదశి, త్రయోదశి తిథులు, రోహి, పున, పుష్య, ఉత్తర, ఉ.షాఢ, ఉ.భాద్ర, హస్త, స్వాతి, అనూ, శ్రవణం ధనిష్ఠ, శత, రేవతి నక్షత్రములు. బుధ, గురు, శుక్రవారములందు జరిపించ వచ్చును. లగ్నమందు శుభగ్రహములుండుట, శుభగ్రహ దృష్టి మంచిది.

**పరామర్శకు:** ద్విపాద, త్రిపాదనక్షత్రములు, ధనిష్ఠా పంచకములు, ఆది, మంగళ, శుక్రవారములయందు పరామర్శ చేయరాదు. సంవత్సర మధ్యలో ఎప్పుడు చూచుటకు వెళ్లినా బేసిమాసము 1,3,5,7,9,11లలో చూడవలెను.

**సకేశస్త్రీని పరామర్శ చేయుటకు:** వర్జ్య, దుర్ముహూర్తములు, పంచ పర్వములు, మంగళవారం, శుక్రవారం వీటిని తప్పించి సకేశిగా ఉన్న విధవ స్త్రీని, భోజనము చేసిన తర్వాత వెళ్ళి పరామర్శించవలెను. ఆ విషయములో ద్విపాద, త్రిపాద నక్షత్ర విచక్షణ అవసరములేదు.

## దినాధిపతుల ఫలములు

రవిఫలం: కంటికి సంబంధించిన వ్యాధులు, తలనొప్పి, ప్రతి పని యందు ఆటంకములు, మానసికమైన ఆందోళన, కుటుంబములోని వారితో కలహములు, వేళకు భోజనము చేయకపోవుట, అనవసర ధనవ్యయం, కోర్టు వ్యవహారములు, శరీర శ్రమ, సూర్య ప్రార్ధనలు, ఆదిత్యహృదయము చదువుకొనవలెను.

చంద్రఫలం: మనస్సు ప్రశాంతముగా యుండుట, కుటుంబములోని వారితో సంతోషంగాయుండుట, దైవదర్శనంచేయుట, పెద్దవారిని, అధికారులనుకలియుట నూతన స్త్రీలతో పరిచయం, రుచికరమైన పదార్ధములను తినుట.

కుజఫలం: ధన విషయంలో చికాకులు, వ్యాపార చిక్కులు, ఉద్రేకముతో కూడిన ఆలోచనలు చేయుట, రాజకీయ నాయకుల పరిచయం, వాహన ప్రమాదములు, ఏ పని నెరవేరకపోవుట, శరీర శ్రమ, ప్రయత్నించిన పనులు పూర్తిగాకపోవుట, శివ ప్రార్ధనలు, సుబ్రహ్మణ్య ప్రార్ధనలు చదువుకొనవలెను.

బుధఫలం: నూతన వ్యక్తులతో స్నేహము, శాస్త్రవేత్తలతో పరిచయం, నూతన ఏజన్సీలు, వ్యాపార ప్రయత్నములు కలిసివచ్చుట, ప్రయాణము రీత్యా లాభం, పెండింగ్‌వ్యవహారములు పరిష్కారమగుట, అంతుపట్టని వ్యవహారములకు యుక్తిగా పరిష్కారము చేయుట, విష్ణు సహస్రనామములు చదువవలెను.

గురుఫలం: గౌరవప్రదమైన సభలలో పాల్గొనుట, పేరుప్రఖ్యాతులు గల వ్యక్తులను, పండితులను కలుసుకొనుట, పుణ్యక్షేత్రములను చూచుట, ధన విషయములో రావలసినబాకీలు వసూలగుట, దైవసంబంధమైన పనులలో ఉత్సాహము చూపుట, దూరపుబంధువుల నుండి ఉత్తరములు వచ్చుట, మనస్సు సంతోషముగా యుండుట, శివ ప్రార్ధనలు చదువవలెను.

శుక్రఫలం: విలాసవస్తువులను కొనుట, పరిమళద్రవ్యములను వాడుట, నూతన స్త్రీలతో పరిచయం, ఉన్నతాధికారులను కలుసుకొనుట, స్త్రీ మూలకమైన లాభములు పొందుట, పాతబాకీలు వసూలగుట, కొత్త కొత్త ఆలోచనలు కలుగుట, సినిమాలు చూచుట, సంగీత సభలకు వెళ్ళుట, లలితా సహస్రనామములు చదువవలెను.

శనిఫలం: ఏ పని మొదలు పెట్టినా పూర్తికాకపోవుట, ఆటంకములు, మనస్సు స్థిమితముగా లేకపోవుట, విపరీతపు ఆలోచనలు, తన చేతిక్రింద పనిచేయువారితో అకారణకలహములు, అనవసర ధనవ్యయం, బద్ధకముగా యుండుట, చిన్న చిన్న ప్రమాదాలు, శనికి సంబంధించిన ప్రార్ధనలు, వెంకటేశ్వరసుప్రభాతం చదవవలెను.

రాహుఫలం: శారీరక సంబంధమైన బాధలు, విషజంతు భయము, ఏ పనీపూర్తిగా నెరవేకపోవుట, ఆటంకములు, మనస్సు అనేకరములైన ఆలోచనలతో యుండుట నీచ జనులతో సహవాసము, అకారణ కలహములు, వేళకు సరిగా భోజనం చేయక పోవుట. దుర్గాష్టకం, దేవీ సంబంధమైన ప్రార్ధనలు చదువుకొనవలెను.

కేతుఫలం: ప్రభుత్వ అధికారులతోను, తమకన్నా తక్కువవారితోను చిక్కులు, ధన వ్యయము, వేదాంత, మత సంబంధమైన చర్చలు, వాదోపవాదములు చేయుట, అవమానములు పొందుట, జంతుభయం, ఊహించని విధముగా ధనవ్యయమగుట. శివప్రార్ధనలు, సుబ్రహ్మణ్య ప్రార్ధనలు చదువవలెను.

## మంచి శకునములు

డోలు, సన్నాయి మొదలగు మంగళవాయిద్యములు వినుట, మంచి మాటలు చెప్పుకొనుట, పండ్లు, పువ్వులు, ముత్తైదువు, వేశ్యలు, కన్యలు, తెల్లనిఅన్నము, గుర్రము, ఎద్దు, పాలు, పెరుగు, నీటితో నిండిన రెండు నీటికడవలు, కల్లు, కావిడి, బిందెలు, గాజుల మల్లారం, పసుపు, గంధం, ఒక క్షత్రియుడు, ఇద్దరు బ్రాహ్మణులు, వైశ్యులు, కర్రపట్టుకొన్న ఒక శూద్రుడు, మాంసము, ఉతికిన వస్త్రములు, చాకలిమడతలు, దంపతులు, ఎలుకను నోట కరచుకొని వచ్చు పిల్లి, ఉతికిన వస్త్రములు తెచ్చు చాకలి, గంటధ్వని వినబడుట, అనుకూలవాయువులు వీచుట, మాంసమును నోట కరచుకొని వచ్చు కుక్క, కుక్కచెవి విదుల్చుట, ఆడకుక్క కోడి మున్నగునవి వచ్చుట మంచిది.

ఇంటిలో తేనెపట్టు, పుట్టలు పెట్టుట, ఇంటిపై గ్రద్ధవాలుట, మొండి చెయ్యి మొలుచుట వలన కలుగు శుభాశుభములు తెలిసికొనుట తూర్పున సంపదవృద్ధి, ఆగ్నేయమున అగ్నిభయము, దక్షిణమున మరణము, నైఋతిన సంతానహాని, పడమరన రాజ్యపూజ్యము, వాయువ్యమున పశుహాని, ఉత్తరమున పశునాశనము, ఈశాన్యమున భార్యకు కీడు, గృహమధ్యము యజమానికి హాని, ఇవి పుట్టినప్పుడు 6 మాసములు ఇంటిని విడుచుట కాని, ధర్మసింధువులో చెప్పిన ప్రకారము శాంతి చేయించుట ఉత్తమము.

# దినాధిపతులు - తారాబలం చూచుకొను విధము

జన్మ లేక నామ నక్షత్రాల రీత్యా ప్రతిదినము వచ్చు నిత్య నక్షత్రములను బట్టి ఈ దిగువ నక్షత్రాధిపతిని చూచుకోవలెను.

| జన్మనక్షత్రము లేక నామ నక్షత్రము | అశ్విని మఖ మూల | భరణి పుబ్బ పూ॥షాఢ | కృత్తిక ఉత్తర ఉ॥షాఢ | రోహిణి హస్త శ్రవణం | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆరుద్ర స్వాతి శతభిషం | పున విశాఖ పూ॥భా | పుష్య అనూ ఉ॥భా | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని, మఖ, మూల | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 |
| భరణి, పుబ్బ, పూ.షాఢ | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 |
| కృత్తిక, ఉత్తర, ఉ.షాఢ | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 |
| రోహిణి, హస్త, శ్రవణం | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 |
| మృగశిర, చిత్త, ధనిష్ఠ | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 |
| ఆరుద్ర, స్వాతి, శతభిషం | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 |
| పున, విశాఖ, పూ.భాద్ర | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 |
| పుష్య, అనూ, ఉ.భాద్ర | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 |
| ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 |

ఇందు: 1.జన్మతార, 2. సంపత్తు, 3. విపత్తు, 4. క్షేమం, 5. ప్రత్యక్, 6. సాధన, 7. నైధన, 8. మిత్ర, 9. పరమమిత్ర తారలు వచ్చుచుండును. కాని జన్మ విపత్, ప్రత్యక్, నైధనతారలు మంచివికావు. మిగలిన తారలు మంచివి.
చంద్రబలం ముఖ్యముగా జన్మరాశికి 1-3-6-7-10-11 రాశులు ఉభయపక్షములందును, శుక్లపక్షమున 2-5-9, కృష్ణపక్షమున 4-8-9, కృష్ణపక్షమున 4-8-12 రాశులలో ఉన్న చంద్రుడు చంద్రబలమునకు మంచిది. వివాహాది శుభకార్యములకు చంద్రబలం తప్పనిసరిగా చూడవలెను.

# ప్రతి రోజు ఉదయాది గ్రహములు పరిపాలించు కాలచక్రములు

| వారం | కాలం | 6మొ7 | 7మొ8 | 8మొ9 | 9మొ10 | 10మొ11 | 11మొ12 | 12మొ1 | 1మొ2 | 2మొ3 | 3మొ4 | 4మొ5 | 5మొ6 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | పగలు | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని |
| | రాత్రి | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| సోమ | పగలు | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి |
| | రాత్రి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| మంగ | పగలు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర |
| | రాత్రి | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |
| బుధ | పగలు | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| | రాత్రి | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని |
| గురు | పగలు | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| | రాత్రి | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | శని |
| శుక్ర | పగలు | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| | రాత్రి | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | శని | శుక్ర | బుధ | చంద్ర |
| శని | పగలు | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |
| | రాత్రి | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

ప్రతి దినము సూర్యోదయ, సూర్యాస్తమయ కాలములు బట్టి ఒక గంట కాలము కలుపుకొని ఫలములు చూచేది.

## హోరా కాలములో చేయు పనులు

గమనిక: ప్రతిరోజు ఏ వారంతో మొదలగునో ఆరోజు మొదటిహోరా ఆ వారాధిపతి అగును. అది మొదలుకొని రవి, శుక్ర, బుధ, చంద్ర, శని, గురు, కుజ, హోరలు క్రమముగా ఒకొక్క భాగమునకు అధిపతి అగును. ఒకరోజుకు 24 కాల హోరలు వచ్చును. పగలు 12 రాత్రి 12 ఉదాహరణకు ఆదివారం సూర్యోదయం 6–10 ని॥లకు, సూర్యాస్తమయం 6–46 ని॥లు అనుకొనుము. ఇక్కడ పగటి ప్రమాణం పెరిగి రాత్రి ప్రమాణం తగ్గడం వలన హోరా ప్రమాణం కూడా మారును. అది ఎలాగంటే 36 ని॥లు పెరిగినది. దీనిని 12 భాగములు పంచగా 3 ని॥లు వచ్చును. కనుక ప్రతి హోరా 1–03 ని॥లు ఉండును. ఈ విధముగానే రాత్రికి 3ని॥లు తగ్గును. కనుక రాత్రి హోరా 0–57ని॥లు మాత్రమే ఉండును. ఈ విధముగా స్పష్టముగా హోరాకాలము తెలుసుకొని పాటించవలెను.

రవి: రాజకీయ వ్యవహారములు, నోట్లు, దస్తావేజులు వ్రాయుటకు, క్రయవిక్రయా దులకు, ఉద్యోగప్రయత్నములకు, అప్లికేషనులు వ్రాయుటకు సన్మానములకు, దావా, అప్పీళ్ళు చేయుటకు, ప్లీడర్లను, వైద్యులను కలుసు కొనుటకు, సాహస కార్యములకు, అధికార దర్శనమునకు, చట్టసంబంధమైన వ్యవహారములు నడుపుటకు మంచిది.

చంద్ర: ఉద్యోగంలో ప్రవేశం, వ్యవసాయం, తోటపనులు, పెద్దలను దర్శించుట, స్త్రీలను కలియుట, నీటిప్రయాణము, గృహసంబంధపనులు, నూతులు, చెఱువులు త్రవ్వుటకు, నూతన ఆభరణములు ధరించుటకు, వెండి పాత్రలు వాడుకొనుట, తెలుపు వస్తువ్యాపారములకు, స్థలమార్పులకు మంచిది.

కుజ: సాహస కార్యములకు, కృషి, అగ్నిసంబంధమగు పనులు చేయుటకు, సైన్యములో చేరుటకు మంచిది. పొయ్యి వేయుటకు, గ్యాస్ స్టౌ, మిక్సీ, గ్రైండర్స్ మొ॥నవి వాడుటకు మంచిది. శుభకార్యములకు మంచిదికాదు. కష్టనష్టములు, విరోధములు, చిక్కులు కలుగును. అశుభమైనది.

బుధ: వ్యాపారమునకు సంబంధించిన పనులు, శుభప్రయత్నములు, నూతన కట్టడము, సమస్త వ్రాత పనులకు, ప్రయాణమునకు, జ్యోతిష, శిల్ప, గణితములు నేర్చుకొనుటకు, రాయబారము జరుపుటకు, స్వర్ణ, వస్త్ర వ్యాపార విషయములకు మంచిది.

గురు: ఔషధ సేవకు, బాకీలు వసూళ్ళకు, లాటరీలు వేయుట, నూతన వస్తు వస్త్రాదులుధరించుట, ఉద్యోగం, నూతనగ్రంథపఠనము, వివాహ ప్రసంగములకు, అన్నిరకములైన శుభ కార్యములకు ధనము బ్యాంకులలో నిల్వ చేయుటకు మంచిది.

శుక్ర: స్త్రీ–పురుషుల సమాగమం, శుభప్రయత్నాలు, స్త్రీలతో ప్రసంగము, నూతన వస్తు, వస్త్రధారణ, ప్రయాణం, ఔషధసేవ, పథ్యం పెట్టుట, అలంకారములు చేయించుట, నిశ్చయ తాంబూలములకు, తీర్థయాత్రలు చేయుటకు, అధికారులను కలుసుకొనుటకు, నూతన వాహనములు ఉపయోగించుటకు శుభం.

శని: సేవకావృత్తికి, ఇనుము, మినుగులు, నూనె, తారు, కీలు, చేపలు, ఆయిల్స్, పాత ఇనుము వ్యాపారములు, భూమి వ్యవహారములకు మంచిది. సేవకా వృత్తియందు ప్రవేశించుటకు మంచిది. మిగిలిన కార్యములు చేయరాదు.

## బల్లిపాటునకు ఫలములు

శిరస్సు – కలహము, ముఖము – బంధు దర్శనము, కనుబొమ్మల నడుమ – రాజానుగ్రహము, పై పెదవి – ధనవ్యయము, క్రింది పెదవి – ధనలాభము, ముక్కు చివర – రోగము, కుడి చెవి – దీర్ఘాయువు, ఎడమ చెవి – వర్తక లాభము, నేత్రము – ఖైదు, గడ్డము – రాజదండనము, నోరు – భయము, కంఠము – శత్రుహని, కుడిభుజము – ఆరోగ్యము, ఎడమ భుజము – స్త్రీ సంగమము, కుడి ముంజేయి – కీర్తి, ఎడమ ముంజేయి – రోగము, స్తనయుగ్మము – దోషము, ఉదరము – ధాన్యలాభము, రొమ్ము,నాభి – ధనలాభము, ప్రక్కలు – సుఖము, పాదము – ప్రయాణము, వీపు – శుభము, గోళ్ళు – ధనవ్యయము, లింగము – దారిద్ర్యము, జుట్టు కొన – మృత్యువు. ఈ ప్రదేశముల యందు తొండ ప్రాకినను ఫలమిట్లేయ ని తెలియునది. పురుషునకు కుడిభాగము ఫలము. స్త్రీకి ఎడమ భాగమునందగును.

## ప్రయాణ విషయమై ఆనందాది యోగములు

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | యోగములు |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | ఆనందయో 15ది.కార్యసిద్ధి |
| భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | కాలదండ 27ది. కార్యసిద్ధి |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | ధూమ్ర 8ది. సొమ్ము నష్టం |
| రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | రేవ | ధాత్రీ 4ది. కార్యమగును |
| మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | అశ్వ | సౌమ్య 30ది. సర్వసౌఖ్యము |
| ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ధ్వాంక్ష15ది. రోజకార్యహాని |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | ధ్వజ 10ది. కార్యసిద్ధి |
| పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | రేవ | రోహి | శ్రీవత్స 3ది. లాభం |
| ఆశ్లే | హస్త | అనూ | ఉషా | శత | అశ్వ | మృగ | వజ్ర 2ది. కార్యనాశనం |
| మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆరు | ముద్గ 1ది. కలహం |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | ఛత్రయో 3ది. స్త్రీలాభం |
| ఉత్త | విశా | పూషా | ధని | రేవ | రోహి | పుబ్బ | మిత్ర 5ది. సన్మిత్రలాభం |
| హస్త | అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఉత | మానస కార్యలాభం |
| చిత్త | జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆరు | మఖ | పద్మ 1ది. ఐశ్వర్యప్రదం |
| స్వాతి | మూల | శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | లంబ 3ది. కష్టం, నష్టం |
| విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | ఉత్పాత 4ది. ద్రవ్యనాశనం |
| అనూ | ఉషా | శత | అశ్వ | మృగ | ఆశ్లే | హస్త | మృత్యు 10ది. ద్రవ్యనాశనం |
| జ్యేష్ఠ | అభి | పూభా | భర | ఆరు | మఖ | చిత్త | కాల 5ది. అవమానం |
| మూల | శ్రవ | ఉభా | కత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధ 7ది. కార్యసిద్ధి |
| పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | శుభ 6ది. పనియగును |
| ఉషా | శత | అశ్వ | మృగ | ఆశ్లే | హస్త | అనూ | అమృత 2ది. కార్యసిద్ధి |
| అభి | పూభా | భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | ముసల 8ది. దుఃఖం |
| శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గదా 10ది. చెరువుగల్లును |
| ధని | రేవ | రోహి | పుష్య | ఉత్తర | విశా | పూషా | మాతంగ 2ది. అశ్వలాభం |
| శత | అశ్వ | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉషా | రాక్షస 9ది. మిత్రకలహం |
| పూభా | భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | చర 8ది. దుర్వార్త శ్రవణం |
| ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | సిద్ధి 3ది. శుభాశుభమిశ్రమం |
| రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | వర్ధమాన 10ది. ఉత్తమ |

# వారశూల

పరాశర సిద్ధాంతరీత్యా నూతన పరిశోధన రీత్యా ఈ వారశూల విధి విధానము తెలుపుతున్నాను.

1. ఆదివారం – పశ్చిమదిశ ప్రయాణం నిషిద్ధం
2. సోమవారం – ఆగ్నేయ దిశ ప్రయాణం నిషిద్ధం
3. మంగళవారం – ఉత్తరదిశ ప్రయాణం నిషిద్ధం
4. బుధవారం – దక్షిణదిశ ప్రయాణం నిషిద్ధం
5. గురువారం – నైరుతిదిశ ప్రయాణం నిషిద్ధం
6. శుక్రవారం – వాయువ్యదిశ ప్రయాణం నిషిద్ధం
7. శనివారం – తూర్పుదిశ ప్రయాణం నిషిద్ధం

ఆయావారాలలో ఆయాదిక్కులకు వెళ్ళిన కార్యవిఘ్నం, ధన నష్టము కలుగును. తప్పనిసరి పరిస్థితులలో వెళ్ళవలసివస్తే, ఈ క్రింది కాలాలలోనైనా ప్రయాణం వాయిదావేయాలి. ఈక్రింది కాలాల తర్వాత దైవప్రార్థన చేసుకుని ప్రయాణం చేయాలి. సూర్యోదయం 6 గం॥ సూర్యాస్తమయం 6 గం॥ అగు దినం అనగా పగలు రాత్రిసమానంగా వున్న దినాలలో ఈకాలమానం సరిపోవును. సూర్యోదయ, సూర్యాస్తమ యాలు హెచ్చుతగ్గులు జరిగి నపుడు పగలు రాత్రి ప్రమాణాన్నిబట్టి గణితరీత్యా ఆ కాలాలు సాధించి హెచ్చుతగ్గులు చేసుకోవాలి.

ఆదివారం సాయంత్రం 4-30 నుండి 6 గం॥ మధ్య
సోమవారం ఉదయం 7-30 నుండి 9 గం॥ మధ్య
మంగళవారం రాత్రి 10-30 నుండి 12 గం॥ మధ్య
బుధవారం పగలు 10-30 నుండి 12 గం॥ మధ్య
గురువారం మధ్యాహ్నం 1-30 నుండి 3 గం॥ మధ్య
శుక్రవారం రాత్రి 7-30 నుండి 9 గం॥ మధ్య
శనివారం ఉదయం 4-30 నుండి 6 గం॥ మధ్య

ఏయే వారాలలో ఏయే దిక్కులకు ప్రయాణం చేసిన ఏయే కాలాలలో ప్రయాణం చేసిన కార్యజయం కలుగును అను విధి విధాన మును కూడ క్రింద వివరించు చున్నాను.

1. ఆదివారం – తూర్పుదిశా ప్రయాణం ఉత్తమఫలం
2. సోమవారం – వాయువ్యదిశా ప్రయాణం ఉత్తమఫలం
3. మంగళవారం – దక్షిణదిశా ప్రయాణం ఉత్తమ ఫలం
4. బుధవారం – ఉత్తరదిశా ప్రయాణం ఉత్తమ ఫలం
5. గురువారం – ఈశాన్యదిశా ప్రయాణం ఉత్తమఫలం
6. శుక్రవారం – ఆగ్నేయదిశా ప్రయాణం ఉత్తమఫలం
7. శనివారం – పడమరదిశా ప్రయాణం ఉత్తమఫలం

ఆయా వారాలలో ఈ క్రింది కాలాలలో ప్రయాణం చేస్తే తప్పక కార్య జయం కలుగును.

ఆదివారం ఉదయం 4-30 నుండి 6 గం॥ మధ్య
సోమవారం రాత్రి 7-30 నుండి 9 గం॥ మధ్య
మంగళవారం ఉదయం 10-30 నుండి 12 గం॥మధ్య
బుధవారం రాత్రి 10-30 నుండి 12 గం॥ మధ్య
గురువారం రాత్రి 1-30 నుండి 3 గం॥ మధ్య
శుక్రవారం ఉదయం 7-30 నుండి 9 గం॥ మధ్య
శనివారం సాయంత్రం 4-30 నుండి 6 గం॥ మధ్య

ఈ పైకాలాలు సూర్యోదయ, సూర్యాస్తమ యాలు 6గం॥అగు దినం, పగలు, రాత్రి, సమానంగా ఉన్నదినాలలో ఈకాల మానం సరి పోవును. సూర్యోదయ సూర్యాస్తమయాలు హెచ్చు తగ్గులు జరుగు నపుడు పగలు, రాత్రి ప్రమాణాన్ని బట్టి గణితరీత్యా ఆ కాలాలు సాధించి హెచ్చు తగ్గులు చేసుకోవాలి.

# గౌరీపంచాంగము

పగలు-రాత్రి ప్రమాణములను 8చే భాగించగా వచ్చిన లబ్దము పగలురాత్రుల ముహూర్తకాలం స్ఫుటమగును.

## పగటి ముహూర్తములు

| | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| 2 | లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| 3 | విషం | ఉద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| 4 | అమృ | లాభం | లాభం | ఉద్యో | లాభం | కలహం | ఉద్యో |
| 5 | శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం |
| 6 | ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | సుఖం | లాభం |
| 7 | అమృ | లాభం | విషం | ధనం | విషం | ధనం | ధనం |
| 8 | విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

## రాత్రి ముహూర్తములు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | శుభం | రోగం | జ్వరం | లాభం | సుఖం | అమృ | విషం |
| 2 | అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| 3 | జ్వరం | ఉద్యో | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| 4 | రోగం | ధనం | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| 5 | కలహం | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహం |
| 6 | లాభం | అమృ | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| 7 | ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| 8 | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

| | రాహు కాలము | గుళిక కాలము | యమకంటక కాలము |
|---|---|---|---|
| ఆది | మ.గం.4-30ల 6-00 | మ.గం.3-00ల 4-30వ | మ.12.0ల 1.30 |
| సోమ | ఉ.గం.7-30ల 9-00వ | మ.గం.1-30ల 3-00వ | 10-30ల 12-00 |
| మంగ | మ.3-00ల 4-30వ | మ.గం.12-00ల 1-30వ | 9-00ల 10-30ల |
| బుధ | మ.12-00ల 1-30వ | ఉ.గం.10-30ల 12-00వ | 7-30ల 9-00 |
| గురు | మ.1-30ల 3-00వ | ఉ.గం.9-00ల 10-30వ | 6-00ల 7-30 |
| శుక్ర | ఉ.10-30ల 12-00వ | ఉ.గం.7-30ల 9-00వ | 3-00ల 4-30 |
| శని | ఉ.9-00ల 10-30వ | ఉ.గం.6-00ల 7-30వ | 1-30ల 3-00 |

**గమనిక:** రాహు కాలము మద్రాస్ ప్రాంతముల వారికి ఆచారము కలదు. మన ప్రాంతమువారు దుర్ముహూర్తములు చూచుకొనవలెను.

# వధూవర గుణమేళన చక్రము (వరుని నక్షత్రము)

| వధూ నక్షత్ర | అశ్వ భ కృ 1 | కృ 3 రో మృ 2 | మృ 2 ఆర్ద్ర పున 3 | పున 4 పుష్య ఆశ్లే | మఘ పుబ్బ ఉఫ 1 | ఉఫ 3 హ చి |
|---|---|---|---|---|---|---|
| అశ్వ | 28 33 28 | 18 21 22 | 26 17 18 | 22 31 27 | 21 26 17 | 11 9 13 |
| భర | 34 28 29 | 19 22 15 | 18 26 26 | 30 23 24 | 21 19 28 | 21 19 6 |
| కృ1 | 27 27 28 | 17 9 15 | 19 20 21 | 25 26 23 | 17 21 22 | 15 15 18 |
| కృ3 | 18 18 19 | 28 19 25 | 16 17 18 | 22 23 20 | 19 23 24 | 21 21 23 |
| రోహి | 23 23 10 | 19 28 36 | 27 23 23 | 27 26 13 | 12 26 28 | 25 26 20 |
| మృ2 | 22 13 15 | 27 34 28 | 20 25 23 | 26 19 22 | 21 17 25 | 23 27 13 |
| మృ2 | 27 18 21 | 18 25 20 | 28 33 31 | 19 10 15 | 24 20 28 | 30 34 21 |
| ఆర్ద్ర | 19 27 21 | 18 24 26 | 34 28 25 | 13 20 13 | 23 29 22 | 24 24 27 |
| పున3 | 19 26 22 | 19 23 24 | 32 24 28 | 16 23 16 | 27 22 21 | 23 24 25 |
| పున4 | 21 28 23 | 20 24 25 | 19 10 14 | 28 35 28 | 15 20 14 | 16 18 20 |
| పుష్య | 30 21 26 | 23 24 17 | 10 18 21 | 35 28 30 | 18 14 23 | 26 27 12 |
| ఆశ్లే | 25 23 22 | 19 12 21 | 13 12 15 | 28 28 28 | 15 15 17 | 20 22 26 |
| మఘ | 21 21 17 | 18 11 19 | 22 22 21 | 16 18 16 | 28 30 26 | 16 16 32 |
| పుబ్బ | 27 19 21 | 22 25 17 | 20 28 27 | 22 16 16 | 30 28 34 | 24 22 8 |
| ఉఫ1 | 18 27 22 | 23 25 25 | 28 21 21 | 16 25 18 | 26 34 28 | 18 16 14 |
| ఉఫ3 | 13 21 16 | 21 25 23 | 30 23 23 | 19 28 21 | 17 25 19 | 28 25 24 |
| హస్త | 11 20 16 | 21 26 26 | 33 23 23 | 19 28 21 | 17 22 17 | 26 28 27 |
| చిత్త2 | 13 6 19 | 25 20 12 | 19 26 24 | 20 12 26 | 23 9 15 | 24 27 28 |
| చిత్త2 | 22 15 28 | 23 20 12 | 13 20 18 | 20 12 26 | 25 10 17 | 17 20 21 |
| స్వాతి | 27 29 17 | 12 16 27 | 27 26 26 | 28 28 15 | 13 25 25 | 25 27 21 |
| విశా3 | 22 22 20 | 15 10 18 | 19 21 21 | 22 21 19 | 17 19 18 | 17 18 27 |
| విశా1 | 16 16 14 | 19 14 22 | 13 14 14 | 19 18 15 | 21 23 21 | 13 19 28 |
| అనూ | 24 14 19 | 24 27 20 | 11 16 21 | 26 18 21 | 24 20 29 | 26 27 12 |
| జ్యేష్ఠ | 12 18 24 | 29 22 22 | 13 3 6 | 10 20 26 | 31 23 16 | 13 12 25 |
| మూల | 12 20 24 | 19 13 14 | 21 15 12 | 8 17 24 | 25 19 9 | 13 13 27 |
| పూషా | 27 20 19 | 13 20 12 | 18 26 26 | 23 13 17 | 21 19 27 | 27 26 11 |
| ఉషా1 | 25 27 14 | 8 11 18 | 24 26 26 | 23 24 9 | 11 27 28 | 28 27 20 |
| ఉషా3 | 28 29 16 | 14 17 22 | 20 22 22 | 22 28 13 | 6 22 23 | 26 25 17 |
| శ్రవ | 27 26 13 | 10 17 26 | 23 21 23 | 28 26 15 | 17 18 20 | 23 25 18 |
| ధని2 | 20 10 26 | 23 20 12 | 8 17 17 | 22 13 28 | 18 5 12 | 16 18 16 |
| ధని2 | 20 11 26 | 30 27 19 | 10 19 19 | 14 5 20 | 25 11 19 | 17 21 18 |
| శత | 15 21 28 | 32 25 25 | 18 10 10 | 7 15 20 | 26 20 13 | 11 8 26 |
| పూభా3 | 18 25 20 | 24 31 31 | 24 17 17 | 13 20 14 | 19 25 17 | 15 17 18 |
| పూభా1 | 14 21 16 | 19 26 26 | 25 18 18 | 18 25 18 | 16 22 14 | 16 18 19 |
| ఉభా | 24 15 18 | 21 25 17 | 16 25 27 | 26 19 20 | 17 15 25 | 27 26 9 |
| రేవతి | 25 24 11 | 14 17 26 | 25 24 25 | 24 27 13 | 12 22 22 | 24 26 20 |

బ్రాహ్మణులకు గ్రహమైత్రియును, క్షత్రియులకు గణకూటమును, వైశ్యులకు స్త్రీ దీర్ఘ కూటము

# వధూవర గుణమేళన చక్రము (వరుని నక్షత్రము)

| వధూ నక్షత్ర | చి 2 స్వా వి 3 | వి 4 అనూ జ్యే | మూ పూ ఉషా 1 | ఉషా 3 శ్ర ధ 2 | ధ 2 శ పూభా 3 | పూభా 1 ఉభా రే |
|---|---|---|---|---|---|---|
| అశ్వ | 22 26 22 | 19 26 15 | 13 27 24 | 26 24 21 | 21 15 16 | 14 24 26 |
| భర | 14 29 22 | 19 17 19 | 20 20 27 | 28 26 10 | 10 20 24 | 22 16 28 |
| కృ1 | 21 15 19 | 16 20 26 | 24 19 14 | 15 10 25 | 25 27 19 | 17 19 11 |
| కృ3 | 22 10 14 | 21 25 31 | 20 13 9 | 14 10 23 | 29 31 23 | 20 22 14 |
| రోహి | 19 15 9 | 16 30 24 | 14 20 11 | 17 18 20 | 26 24 30 | 27 26 19 |
| మృ2 | 10 25 17 | 23 22 25 | 15 11 18 | 21 24 13 | 19 27 29 | 26 17 27 |
| మృ2 | 14 27 19 | 14 11 13 | 23 18 24 | 20 25 12 | 13 21 23 | 27 17 27 |
| ఆర్ద్ర | 20 27 20 | 13 17 4 | 16 27 27 | 22 22 17 | 18 11 16 | 19 27 27 |
| పున3 | 18 27 21 | 13 20 5 | 13 26 27 | 27 13 17 | 18 11 17 | 19 27 28 |
| పున1 | 20 27 20 | 19 26 10 | 8 20 21 | 28 27 21 | 12 7 11 | 17 25 25 |
| పుష్య | 11 26 21 | 20 19 22 | 17 11 22 | 26 25 13 | 4 14 18 | 24 18 27 |
| ఆశ్లే | 25 11 16 | 15 20 26 | 22 16 8 | 12 13 27 | 18 18 12 | 18 20 12 |
| మఘ | 25 11 17 | 24 26 34 | 24 21 11 | 5 4 18 | 24 25 18 | 17 18 12 |
| పుబ్బ | 11 25 19 | 26 24 24 | 19 19 27 | 21 18 4 | 11 19 24 | 23 16 24 |
| ఉఫ1 | 17 26 17 | 24 32 19 | 10 27 28 | 22 20 11 | 18 12 16 | 15 26 24 |
| ఉఫ3 | 16 25 16 | 18 27 13 | 15 28 29 | 26 25 16 | 16 10 14 | 18 29 27 |
| హస్త | 19 26 17 | 19 26 12 | 14 26 27 | 23 24 19 | 19 7 14 | 19 27 27 |
| చిత్త2 | 20 19 26 | 28 11 25 | 28 13 21 | 17 19 18 | 18 24 18 | 22 11 21 |
| చిత్త2 | 28 27 34 | 24 7 21 | 28 13 21 | 25 27 26 | 20 26 20 | 15 4 13 |
| స్వాతి | 28 28 20 | 10 23 18 | 23 26 18 | 22 23 27 | 21 20 25 | 19 20 13 |
| విశా3 | 34 18 28 | 18 17 21 | 28 21 13 | 17 17 32 | 26 26 22 | 16 13 5 |
| విశా1 | 23 8 17 | 28 27 31 | 23 17 9 | 12 12 27 | 27 26 22 | 21 18 9 |
| అనూ | 7 22 17 | 28 28 31 | 16 14 22 | 25 26 12 | 12 22 24 | 24 18 27 |
| జ్యేష్ఠ | 20 17 20 | 31 30 28 | 15 17 17 | 20 20 25 | 25 18 11 | 9 21 21 |
| మూల | 27 21 27 | 24 26 16 | 28 27 25 | 15 15 21 | 25 21 11 | 17 25 27 |
| పూషా | 11 26 19 | 18 18 19 | 27 28 34 | 24 23 8 | 15 22 29 | 32 23 32 |
| ఉషా1 | 20 19 12 | 11 25 19 | 25 34 28 | 18 15 15 | 2 22 28 | 31 32 23 |
| ఉషా3 | 24 23 16 | 14 28 22 | 16 25 19 | 28 25 25 | 17 17 23 | 30 32 23 |
| శ్రవ | 25 23 16 | 14 28 23 | 17 25 15 | 24 28 30 | 21 18 23 | 32 31 24 |
| ధని2 | 24 26 30 | 28 14 28 | 21 9 16 | 25 21 28 | 18 23 21 | 26 15 22 |
| ధని2 | 19 22 25 | 28 12 26 | 29 16 13 | 18 21 20 | 28 33 28 | 18 7 14 |
| శత | 26 19 26 | 26 21 19 | 22 23 23 | 18 18 25 | 33 28 19 | 9 17 16 |
| పూభా3 | 19 28 21 | 21 27 12 | 15 30 29 | 24 25 20 | 27 19 28 | 18 23 20 |
| పూభా1 | 12 20 14 | 21 27 11 | 15 31 30 | 28 30 25 | 17 7 16 | 28 33 30 |
| ఉభా | 3 19 12 | 19 20 22 | 24 22 31 | 29 29 14 | 6 16 21 | 33 28 34 |
| రేవతి | 13 11 5 | 12 27 22 | 27 30 21 | 19 22 22 | 14 16 18 | 29 33 28 |

శూద్రులకు యోని పొంతనము శుభయుక్తమై వుండి 18 గుణములకు పైన వచ్చిన వివాహమునకు శుభము

# భార్గవ సిద్ధాంత పంచాంగము

**ప్రతిరోజు సూర్యోదయం నుండి 24 ని॥ల చొప్పన ఫలితము చూడాలి, తిథి, వార, నక్షత్రములు చూడనవసరం లేదు. దీనిని అనుసరించుట శ్రేయోదాయకం.**

| గం॥ని॥ | గం॥ని॥ | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 06-00 | 06-24 | లాభం | వివాదం | ధనలాభం | దుర్వార్త | ధనలాభం | కార్యజయం | క ష్టం |
| 06-21 | 06-48 | ధనలాభం | లాభం | సుఖం | మనోవ్యథ | కలహం | మిశ్రమలాభం | సుఖం |
| 06-48 | 07-12 | కలహం | క్షేమం | భయం | ధనలాభం | భయం | ధనలాభం | విరోధ ం |
| 07-12 | 07-36 | అనారోగ్యం | ధనలాభం | కష్టములు | కార్యజయం | శుభం | శుభం | ధనలాభం |
| 07-36 | 08-00 | చోరభయం | భూలాభం | జయం | భయం | కార్యసిద్ధి | విరోధం | జయ ం |
| 08-00 | 08-24 | శతృవృద్ధి | ధననష్టం | సుఖం | సుఖం | కార్యజయం | జయం | కార్యజయం |
| 08-24 | 08-48 | కార్యసిద్ధి | కార్యసిద్ధి | సుఖం | సుఖం | ధనలాభం | హాని | కార్యలాభం |
| 08-48 | 09-12 | సుఖం | వస్తుప్రాప్తి | భయం | భీతి | లాభం | స్నేహం | సన్మానం |
| 09-36 | 10-00 | మిత్రవృద్ధి | సుఖం | మనోభయం | మిశ్రమఫలం | కార్యజయం | మిశ్రమఫలం | అనారోగ్యం |
| 10-00 | 10-24 | కార్యభంగం | స్త్రీలాభం | సుఖం | కార్యసిద్ధి | వృత్తిలాభం | సౌఖ్యం | సౌ ఖ్యం |
| 10-26 | 10-04 | సుఖం | కార్యసాధన | కార్యహాని | మిశ్రమఫలం | శుభం | ధనలాభం | సంతాపం |
| 10-48 | 11-12 | జయం | కార్యహాని | మిశ్రమలాభం | శుభం | ధనలాభం | క్షేమం | భయం |
| 11-12 | 11-36 | కార్యసిద్ధి | వివాదం | భయం | లాభం | ఆరోగ్యం | కార్యసిద్ధి | మిత్రప్రాప్తి |
| 11-36 | 12-00 | కలహం | కార్యసిద్ధి | కష్టము | శుభం | నష్టం | వాహనభీతి | జయం |
| 12-00 | 12-24 | ఇష్టసిద్ధి | ఇష్టలాభం | రోగపీడ | సౌఖ్యం | పనినష్టం | సుఖం | ధనలాభ ం |
| 12-24 | 12-48 | కార్యహాని | ధనలాభం | లాభం | ఫలిసిద్ధి | విరోధం | భయం | శుభ ం |
| 12-48 | 01-12 | జయం | కార్యజయం | కార్యసిద్ధి | క్షేమం | కార్యసిద్ధి | శుభం | మిశ్రమ ం |
| 01-12 | 01-36 | ఇష్టసిద్ధి | శుభం | కార్యహాని | మిశ్రమఫలం | బంధనము | సుఖహాని | కార్యసిద్ధి |
| 01-36 | 02-00 | సంతాపం | మిశ్రమఫలం | ఉద్యోగలాభం | వివాదం | హాని | ధనవ్యయం | కార్యజయం |
| 02-00 | 02-24 | ధనవ్యయం | సుఖం | వ్యర్థం | ఇష్టసిద్ధి | కలహం | కార్యజయం | జయం |
| 02-24 | 02-48 | విరోధం | మనస్తాపం | కార్యహాని | లాభం | జయం | సౌఖ్యం | మిశ్రమఫలం |
| 02-48 | 03-12 | ధనలాభం | కార్యసిద్ధి | అపజయం | ఉద్యోగలాభం | కార్యభంగం | భయం | విరోధం |
| 03-12 | 03-36 | శతృవృద్ధి | ప్రయాణం | శతృజయం | విజయం | అశుభం | కార్యహాని | రోగపీడ |
| 03-36 | 04-00 | కలహం | ధనలాభం | ధనవ్యయం | అభీష్టసిద్ధి | స్నేహం | నష్టం | మనస్తాపం |
| 04-00 | 04-24 | రోగం | విద్యాలాభం | సుఖం | శుభం | అధికజయం | అపవాదులు | లాభం |
| 04-24 | 04-48 | ధనలాభం | కార్యనష్టం | కార్యలాభం | క్షేమం | కలహం | భయం | కార్యసిద్ధి |
| 04-48 | 05-12 | కార్యసిద్ధి | గౌరవం | క్షేమం | జయం | మనోభీతి | పనినష్టం | లాభం |
| 05-12 | 05-36 | నష్టము | శుభం | కార్యసిద్ధి | ఉద్యోగలాభం | జయం | కార్యజయం | సుఖం |
| 05-36 | 06-00 | భూలాభం | అధికారలాభం | సౌఖ్యం | అశుభం | కార్యసిద్ధి | ధనలాభం | జయం |

## వివాహ చక్రమును గూర్చి ముఖ్య వివరణ

ఉత్తర కాలామృతమందు శ్రీకాళిదాసుచే చెప్పబడినది. పటమునందు చూపిన విధముగా 27 నక్షత్రములను వేసుకొనిన ఆయా ఫలములు కలుగునని చెప్పబడినది.




పై పటములోని చూపిన విధముగా ముహూర్తము రోజున సూర్యుడు వుండు నక్షత్రము మొదలు వివాహ ముహూర్త నక్షత్రము వరకు లెక్కించి ఆ మొత్తమును మూడు మూడు నక్షత్రముల చొప్పున మధ్య గడి మొదలు పైభాగము తూర్పు, ఆగ్నేయం, దక్షిణం, నైఋతి, పడమర, వాయువ్యం, ఉత్తరం, ఈశాన్యపర్యంతము వేసుకొనవలెను. ఆవిధముగా వేసిన పిమ్మట పై పటంలోని ఫలితములను గమనించి విజ్ఞులు మంచి ఫలమున్ను చక్రశుద్ధి కల ముహూర్తములను గ్రహింతురు గాక!

మాంగళ్య చక్రశుద్ధి

వివాహముహూర్త సమయమునకు శుక్రుడున్ననక్షత్రంమొదలు వివాహ ముహూర్త నక్షత్రం వరకు లెక్కించగా 1,2,3 అనారోగ్యము. 4,5,6 లక్ష్మీ ప్రదం. 7,8,9 దుర్బలం. 10,11,12 దారిద్ర్యం. 13,14,15 సర్వసౌభాగ్యము. 16,17,18 సుఖభంగం. 19,20,21 జారత్వం. 22, 23,24 కుటుంబవృద్ధి.

### వధూవరులు ఒకే నక్షత్రమైన వివాహము చేయు నక్షత్రములు

వధూవరులు ఒకే నక్షత్రములు రాశిభేదమున్నను ఏకరాశి అయిఉండి వేరే నక్షత్రములైయున్నను శుభము. రోహిణి, ఆర్ద్ర, పుష్య, మఘ, విశాఖ, శ్రవణము, ఉత్తరాభాద్ర, రేవతి ఈ ఎనిమిది నక్షత్రములలోను వధూవరులు ఏకనక్షత్రమువారైనను వివాహము చేయవచ్చును. అశ్విని, భరణి, ఆశ్రేష, పుబ్బ, స్వాతి, మూల, శతభిషము మధ్యమములు. తక్కిన నక్షత్రములు ఒక్కటైనచో వధూవరులకు హాని కలుగును.

వివాహ విషయమై స్త్రీ యొక్క నక్షత్ర విశేష ఫలము: 'మూల' మామకు గండము, 'ఆశ్రేష' అత్తకు గండము, 'మఘ' మూల వంటిది. 'విశాఖ' స్త్రీ అయిన భర్త యొక్క తమ్ములకు గండము. 'జ్యేష్ఠా' నక్షత్రం స్త్రీ అయిన భర్త యొక్క అగ్రజులకు గండము. ఈ నక్షత్రములో పుట్టిన స్త్రీ యొక్క జాతకములో భర్త స్థానము నుండి చెప్పబడినటువంటి బంధు స్థానములను బాగుగా పరిశీలించవలెను.

వధూవరులకు పరస్పర వైరము కలిగించు వేధ నక్షత్రములు: అశ్విని– జ్యేష్ఠలకు, భరణి–అనురాధలకు, కృత్తిక–విశాఖలకు, రోహిణి–స్వాతులకు, ఆశ్రేష–మూలలకు, మఘ–రేవతులకు, పూర్వఫల్గుణి–ఉత్తరాభాద్రలకు, ఉత్తరఫల్గుణి–పూర్వాభాద్రలకు, హస్త–శతతారలకు పరస్పర వేధ గలిగి యుండును. గాన నీ నక్షత్రముల జంటలో ఒక జంట దంపతుల జన్మ నక్షత్రములై యుండెనేని దంపతులకు కలహాకరంబగును. ద్విపాద నక్షత్ర ములగు చిత్రామృగశీర్ష ధనిష్ఠలును పరస్పర వైరము గలవై యుండును.

## వధూవర గుణమేళికా చక్రం నందు గుర్తించ వలసిన ముఖ్యాంశాలు

వధువు నక్షత్రంనుండి వరుని నక్షత్రం కలుపగా 18 గుణములు కన్నా తక్కువరాకూడదు. ఈగుణమేళిక చక్రము షష్టాష్టక ద్విర్ద్వాదశ, నవపంచక దోషము పరిహారమైన రాశులకు 7 గుణములు, నాడీకూట పరిహారమైన నక్షత్రములకు 8 గుణములు, వధువు రాక్షసగణమై, వరుడు మానుష గణమైన రాక్షస గణదోషం లేని స్త్రీ నక్షత్రములై నపుడు '1' అధికముగ గుణము ప్రాప్తించును. ఈవిధంగా పరిహారములతోకూడిన మార్కులు ఈ పట్టికలో లిఖించబడినవి. స్త్రీరాశి, పురుషరాశి మిత్రరాశులయిన రాశికూటదోషంపరిహార మైన మార్కులు హెచ్చును. ఉదాహరణకు మేష వృశ్చి కాలు, మిధున మకరాలు, సింహమీనాలు, తులావృషభాలు, ధనుర్ కర్కాటకాలు, కుంభకన్యలు వధూవరుల రాశులైనపుడు ఈ రాశులు మిత్రరాశులై నందున షష్టాష్టదోషం పరిహారమై 7 మార్కులు హెచ్చును. అలాగే మీన మేషాలు, సింహ కర్కాటకాలు, మకర కుంభాలు, కన్యాతులలు, వృశ్చికధనస్సు మిత్ర రాశులయి నందున ద్విర్ద్వాదశ దోషం పరిహారమై 7మార్కులు హెచ్చును. అలాగే మేష సింహాలు, వృషభకన్యలు, మిథున తులలు, సింహ ధనస్సులు, తులాకుంభాలు, వృశ్చికమీనాలు, ధనుర్ మేషాలు, మకర వృషభాలు, కర్కాటక వృశ్చికాలు కుంభ మిథునాలు, మీన కర్కాటకాలు, కన్యా మకరాలు వధూవరుల రాశులైనపుడు ఈ రాశులు మిత్రరాశులు అయినందున నవపంచక దోషం పరిహారమై 7 మార్కులు హెచ్చును. ఏకనాడి దోషంలేని నక్షత్రాలుకొన్ని ఉన్నందున ఆ నక్షత్రవధూ వరుల నాడీకూట పరిహారమై8మార్కులు హెచ్చును. ఉదాహరణకు :

ఏకనాడీ దోషపరిహారము : ఉత్తర, శతభిషం, పూర్వాభాద్ర, పునర్వసు, ఆరుద్రా, మూల, అశ్విని ఈ నక్షత్రములలో దంపతుల నక్షత్రములుండిన ఏకనాడీ దోషంలేదు.

మద్యైకనాడీదోష పరిహారము :పూ.షా.అనూరాధ, ధనిష్ట, పుష్యమి, చిత్తా, పుబ్బ, మృగశిర ఈ నక్షత్రములలో దంపతుల నక్షత్రములుండిన మద్యైకనాడీ దోషం లేదు.

పార్శ్వనాడీ దోష పరిహారము : కృత్తిక, విశాఖ, ఆశ్లేషా, శ్రవణం, మఖా, ఉత్తరాషాఢ, రోహిణి ఈనక్షత్రములలో దంపతుల నక్షత్రములుండిన పార్శ్వనాడీదోషము లేదు. పై శ్లోక ప్రమాణరీత్యా ఏకనాడీ (ఆదినాడీ) మధ్యనాడీ, పార్శ్వ నాడీ (అంత్యనాడీ) పై నక్షత్రాల్లో జన్మించిన వధూవరులకు నాడీ దోష పరిహారమై 8 మార్కులు ప్రాప్తించును.

అలాగే ఆశ్లేషా, చిత్తా, విశాఖ, జ్యేష్ఠ, మూల, శతభిషా నక్షత్ర స్త్రీలకు రాక్షసగణదోషం లేనందున, మనుష గణం ప్రాప్తించు పురుష నక్షత్రాలకు పై రాక్షస గణం కల్గిన నక్షత్ర స్త్రీలతో పొంతనంలో '0' మార్కులకు బదులు '1' మార్కు వచ్చును. లోకాచారము కోసము ఈ గుణములను చూడవలసివచ్చు చున్నదేగాని దంపతులయొక్క అన్యోన్యత, అనురాగములు పెంపొందవలెనన్న వధూవర జాతకపరిశీలనే ముఖ్యమైనది. వధూవర జాతకము లందు కుజ శుక్ర దోష విచారణ చాలాముఖ్యం. మేష, కర్కాటక, సింహ,వృశ్చిక,ధనుర్, మీనలగ్నములకు యవ్వన కారకుడైన శుక్రుడు ఆధిపత్యపాపి అగును. ఆధిపత్యపాపి అయిన శుక్రుడు ఈ లగ్నము లకు 7,8 భావములోవున్న 7,8 భావములను వీక్షించిన శుక్రదోషం ప్రాప్తించును. వృషభ, మిథున, కన్య,తుల, మకర, కుంభ లగ్నములకు యవ్వన కారకుడైన కుజుడు ఆధిపత్యపాపి అగును. ఈ ఆధిపత్య పాపి అయిన కుజుడు ఈ లగ్నములకు 7,8 భావములలో ఉన్న 7,8 భావములను వీక్షించిన కుజదోషం ప్రాప్తించును. మేష,కర్కాటక, సింహ, వృశ్చిక, ధనుర్, మీన లగ్నజులకు (గురువర్గ) యవ్వనకారకుడైన కుజుడు ఆధిపత్యశుభుడు, వృషభ, మిథున, కన్య, తుల, మకర, కుంభ లగ్నజులకు యవ్వన కారకుడైన శుక్రుడు ఆధిపత్య శుభుడు. మేష,కర్కాటక, సింహ, వృశ్చిక, ధనుర్, మీన లగ్నజులకుశుక్రుడు ఆదిపత్య పాపిగా సప్తమ, అష్టమభావాలను స్థితి, వీక్షణల్లో అశుభపరచివున్న శుక్రుడు ఆధిపత్య శుభుడైన వృషభ, మిథున, కన్య, తుల, మకర, కుంభ లగ్నజులకు సప్తమ, అష్టమ భావాలను స్థితి వీక్షణాలలో శుభపరచినవారితో వివాహం చేయడం వల్ల శుక్రదోషం నశించును. వృషభ, మిథున, కన్య, తుల, మకర, కుంభ లగ్నజులకు (శనివర్గ) కుజుడు ఆధిపత్య పాపిగ సప్తమ, అష్టమ భావాలను స్థితి, వీక్షణల్లో అశుభ పరచి వున్న, కుజుడు ఆధిపత్య శు భుడైన మేష, కర్కాటక, సింహ, వృశ్చిక, ధనుర్, మీన లగ్నజులకు సప్తమ, అష్టమ భావాలను స్థితి వీక్షణల్లో పరచిన వారితో వివాహము చేయడం వల్ల కుజదోషం నశించును. గురువర్గులు, శనివర్గులుతో శనివర్గులు గురువర్గులతో వివాహం శుభం. బేసి లగ్నజులు సరిలగ్నజులతో, సరిలగ్నజులు బేసి లగ్నజులతో వివాహం అత్యంత శుభం.

## కుజ దోషం

కుజదోషమనగా జాతకచక్రములో లగ్నమునుండి గాని, చంద్రరాశి నుండి గాని, శుక్రుడున్న రాశినుండి గాని 2,4,7,8,12 రాశులలో కుజుడున్నదోషం, మృత్యుప్రదం.
కుజుడు కళత్ర నాశనము చేయువాడు. శుక్రుడు కళత్ర కారకుడు. వీరిరువురి కలయిక లేక శుక్రునిపై కుజదృష్టి వధూవరులలో ఏ ఒక్కరి జాతకములో మాత్రమే ఉన్ననూ అది కుజదోషం కలుగును.

ఒకరి జాతకములో కుజదోషముండి ఇంకొకరి జాతకములో లేకున్న యెడల అట్టి జాతక వధూవరులకు వివాహము చేయరాదు.

### కుజ దోష పరిహారాలు

**శ్లో ॥ అర్కేందు క్షేత్రజాతానాం కుజదోష నవిద్యతే ।**
**స్వేచ్ఛామిత్రజాతానాం పీడకోసభవేత్కుల ॥**

కర్కాటక, సింహ, మేష, వృశ్చిక, ధనస్సు, మీన, మకర లగ్న జాతకులకు కుజదోషము ఉండదు. చూడవలసిన అవసరము లేదు.

1. కుజచంద్రులు, కుజగురులు కలిసిన దోషపరిహారం.
2. కుజుడు 2వ ఇంట ఉన్నను, జన్మలగ్నం కన్యగాని, మేషంగాని అయినచో దోషంలేదు.
3. 9వ స్థానములో బలమైన శుభగ్రహములున్నచో కుజదోషం వర్తించదు.
4. తుల, వృషభ లగ్న జాతకులకు 12వ స్థానములోనున్న కుజదోషం ఉండదు.
5. మేష, వృశ్చిక లగ్న జాతకులకు 4వ స్థానములోనున్న కుజదోషం ఉండదు.
6. మకర, కటక, లగ్న జాతకులకు 7వ స్థానములోనున్న కుజదోషం ఉండదు.
7. ధనూ, మీన లగ్న జాతకులకు 8వ స్థానములోనున్న కుజదోషం ఉండదు.
8. లగ్నములో మరియు 4,9,12 స్థానములలో శనిగ్రహము ఉన్నచో కుజదోషము లేదు.
9. స్త్రీ జాతకములో ద్వితీయమందు పూర్ణచంద్రుడుగాని, బుధ గురు శుక్రులలో ఏ ఒక్కరైనను ఉన్ననూ కుజదోషం వర్తించదు.
10. స్త్రీ పురుషుల ఇద్దరి జాతకములలో 2, 7 స్థానములలో పాప గ్రహములున్న కుజదోషం వర్తించదు.
11. సమాన దోషమున్నను, ఒకరి జాతకమున లగ్నము నుండి మరొకరి జాతకమున చంద్ర, శుక్ర స్థానములనుండి కుజదోషమున్నను దోషపరిహారమే అట్టి వివాహము చేయవచ్చును.

**కుజదోషం వర్తించని జన్మ నక్షత్రములు :** అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, ఉత్తర, స్వాతి, అనూరాధ, పుర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి.

**జన్మ నక్షత్రమున చేయదగిన శుభకార్యములు:** జన్మనక్షత్రమున నిషేకము, యాగము, చౌలకర్మ, అన్నప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, పట్టాభిషేకము, భూ సంపాదనముల యందు శుభమును కలిగించును.

**జన్మనక్షత్రమున చేయరాని శుభకార్యములు:** జన్మనక్షత్రమున పుంసవనము, యుద్ధము, సీమంతము, గర్భాదానము, శ్రాద్ధము, క్షౌరకర్మ, ఔషధసేవ, ప్రయాణము, వివాహము అశుభమునిచ్చును.

### ఏలినాటి శని – కంటక శని

సూర్య పుత్రుడైన శని చంద్రలగ్నాత్తు ద్వాదశ (12) జన్మ (1) ద్వితీయ స్థానము లందు శని సంచరించు కాలమును ఏలినాటి శని యందురు. శనిరాశి 1 కి $2\frac{1}{2}$ సంవత్సరాలు చొప్పున 12, 1, 2 రాశులుకు మొత్తము $7\frac{1}{2}$ సంవత్సరాలు ఉండును. అట్లాగే చంద్ర లగ్నాత్తు 4, 8 స్థానము లందు సంచరించు కాలము కంటక శని అందురు. ఈ ఏలినాటి శని కంటక శని జరుగు కాలములకు మానవుడు తాను చేసిన పాప పుణ్యముల ననుసరించి సుమారు కష్టనష్టములకు లోనగును. తద్దోష నివృత్తికి తైలాభిషేకము, రుద్రాభి షేకములు జరిగించుకొనుట మంచిది.

శని 12-1, 2 రాశులలో ననుసరించు కాలములో ఫలితము శుభాశుభ మిశ్రమముగా నుండును.

## రాశి పొంతనము

1. స్త్రీ రాశి నుండి పురుషరాశి వరకు 7,8,9,10,11,12 అయినచో శుభం
2. పురుష రాశి నుండి స్త్రీ రాశి వరకు 2,3,4,5,6,7 అయినచో శుభం
3. దంపతులకు ఏకరాశియైన ఉత్తమం

| శుభ ద్విర్ద్వాదశములు | | శుభ షష్టాష్టకములు | | శుభ నవపంచకము లు | |
|---|---|---|---|---|---|
| మీన | మేషం | మేష | వృశ్చికం | మేష | సింహ |
| సింహ | కన్య | మిథున | మకర | వృషభ | కన్య |
| కటక | సింహం | సింహ | మీన | మిధున | తుల |
| మకర | కుంభం | తుల | వృషభ | సింహ | ధను |
| కన్య | తుల | ధను | కటక | తుల | కుంభ |
| వృశ్చిక | ధనుస్సు | కుంభ | కన్య | వృశ్చిక | మీన |
| వృషభ | మిధున | ధను | మేష | మకర | వృషభ |

| అశుభ ద్విర్ద్వాదశములు | | అశుభ షష్టాష్టకములు | | అశుభ నవ పంచకములు | |
|---|---|---|---|---|---|
| కుంభ | మీనం | మేష | కన్య | కటక | వృశ్చిక |
| మేష | వృషభం | మిధున | వృశ్చిక | కన్య | మకర |
| మిధున | కటక | సింహ | మకర | కుంభ | మిధున |
| మకర | ధనుస్సు | తుల | మీన | మీన | కటక |
| తుల | వృశ్చికం | ధను | వృషభ | కుంభ | కటక |

### వివాహ శుభ కార్యములకు నియమ నిబంధనలు

1. అన్నదమ్ములకు అక్కాచెల్లెల్లను ఇచ్చి వివాహం చేయకూడదు
2. ఒకే లగ్నములో కుమారునకు, కూతురుకు వివాహం చేయకూడదు
3. ఒకే లగ్నమునకు ఇద్దరు అన్నదమ్ములకుగాని, అక్కాచెల్లెకుగాని వివాహంచేయరాదు.
4. ఒకే గృహమందు ఇరువురు అన్నదమ్ములకు ఒకేసారి వివాహంగాని,ఉపనయనం గాని చేయరాదు.
5. ఒకే గృహమందు ఒకే లగ్నములో ఒక ఉపనయనం, ఒక వివాహం చేయరాదు.
6. అన్నాచెల్లెళ్ళకు ఒకే లగ్నములో, ఒకే వేదిక మీద వివాహం చేయకూడదు
7. అమ్మాయి వివాహం ముందుగా అయిన తర్వాత అబ్బాయి వివాహం చేయాలి.
   ఏక కాలంలో (కవలలు) అమ్మాయి తర్వాత అబ్బాయి వివాహం చేయాలి. కవల పిల్లలకు ఏక కాలమునందు వివాహం చేయవచ్చును.
8. పుత్రిక వివాహానంతరం పుత్రుని వివాహమైనను, పుత్రునకు ఉపనయనమైనను చేయవచ్చును.
9. పుత్ర వివాహం చేసిన తర్వాత 6 నెలలు వరకు అన్నదమ్ములకు ఉపనయనం చేయరాదు.
10. ఫాల్గుణ మాసంలో ఒక వివాహం చేసి, ఉగాది తర్వాత మరో వివాహం చేసుకోవచ్చు. ఉగాది ముంది వెనుకలుగా వివాహములు నిర్వహించుట శాస్త్ర సమ్మతం.
11. పుత్రునకు ఉపనయం తర్వాత పుత్రికకు వివాహం చేయవచ్చును.
12. పుత్రునకు.పుత్రికకు ఒకే సంవత్సరంలో వివాహం చేయవచ్చును. కాని ఇద్దరు కుమారులకు ఒకే సం॥లో ఉపనయనం, వివాహం చేయరాదు. ఇతరమైన శుభకార్యములు చేయవచ్చును.

## మృతాశౌచము

శిశువు గర్భమునందే మరణించినచో స్నానంచేసి తల్లిదండ్రులకు జ్ఞాతులకు 10 రోజులు పురుడు. శిశువు జన్మించి నాభిచ్ఛేదము కాకుండగనే మరణించినచో తల్లికి 10దినములు పురుడు. తండ్రికి జ్ఞాతులకు 3 రోజులు జాతాశౌచము, మృతాశౌచము – స్నానమాత్రముచే శుద్ధి. శిశువు నాభిచ్ఛేదానంతరము 10 దినములలోపుగా మరణించినచో జ్ఞాతులందరకు జాతాశౌచము కలదు. మృతాశౌచము స్నానమాత్రముచే శుద్ధి. పురుడు శుద్ధి అయినప్పటి నుండియు దంతోత్పత్తి కాలమగు 6 మాసములలోపుగా శిశువు మరణించినచో తల్లిదండ్రులకు 3 రోజులాశౌచము, జ్ఞాతులకు స్నానము మాత్రము.

6 మాసములు దాటినది లగాయితు 3 సంవత్సరములు నిండులోగా మరణించిన తల్లిదండ్రులకు 3 దినములు. మగ శిశువగుచో జ్ఞాతులకు ఒకరోజు అశౌచము. ఆడపిల్ల యగుచో జ్ఞాతులకు స్నానమాత్రమే చేయదగియున్నది. 3 సంవత్సరములు దాటినది మొదలు ఉపనయన పర్యంతము మగవాడు మరణించిన జ్ఞాతులకు తల్లిదండ్రులకు 3 రోజులాశౌచము. వివాహోపనయనముల కాలము దాటిన స్త్రీ పురుషులు మరణించిన జ్ఞాతులు తల్లిదండ్రులు 10 రోజులు పూర్ణాశౌచము పట్టవలెను. రజస్వల అయిన స్త్రీ వివాహము కాకపోయినను మరణించినచో 10 రోజులు పూర్ణాశౌచము తల్లిదండ్రులు జ్ఞాతులు పట్టవలెను.

### మృతి విషయమై చెడు నక్షత్రములు మొదలగునవి

1,2,6,7,10,12,13,14 ఈ తిధులు ఆది, మంగళ, శుక్ర, శనివారములు, కృత్తిక, రోహిణి, మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములు దోషములు. వీటియందు మృతి సంభవించినచో గృహమునకు దోషము. నక్షత్రము చెడుదైనచో అధిక దోషము. నక్షత్రము మంచిదై మిగిలినవి చెడువైనచో స్వల్పదోషము చూచుటకు నివే చూడవలెను. ఈ చక్రము సూర్యుడు కృత్తిక నక్షత్రములో నుండగా చూపబడినది. సూర్యుడున్న నక్షత్రము మొదలు మృత నక్షత్రము వరకు సభిజిత్తుతో కూడ లెక్కించవలెను. సూర్యుడున్న నక్షత్రము ఈశాన్య దిక్కున వ్రాసి అచట నుండి లోపల నాలుగు నక్షత్రములు విదిక్కుల యందు వ్రాసి లోపల నుండి వెలుపలకు 3 నక్షత్రములు దిక్కులయందు వ్రాయవలెను. అంతరంగము నందయితే 3 పక్షములు మధ్య యందయితే 2 పక్షములు దాని తరువాతదయిన నొకపక్షమును గృహమును విడువవలయును. బాహ్య మందు శుభుడు.




**పక్షిణి పట్టదగినవారు –** పినతల్లులు, పెదతల్లులు, మేనమామ భార్యలు, వీరి స్త్రీ పురుష సంతానము, మాతాపితామహులు, పెద్దతండ్రి, పినతండ్రి వీరి పురుష సంతానము, అన్నదమ్ములు,వారి స్త్రీ పురుష సంతానము, వివాహమయిన కుమార్తెలు, అల్లుండ్రు, కూతురు, స్త్రీ పురుష సంతానము, సవితి తల్లి సోదరులకు, సాపత్ని సోదర సోదరికును, పురుషులకు అక్కా చెల్లెండ్ర భర్తలు, భార్య సోదరులు, అత్తమామలు.

**పక్షిణి పట్టదగని వారు –** వివాహమయిన స్త్రీలకు పెదతండ్రి, పినతండ్రి భార్యలు, భర్త సోదరుని కుమార్తె లు, అక్కా చెల్లెండ్ర భర్తలు, మేనమామ కూతురుకాని సోదరుని భార్య.

బ్రాహ్మణులకు 10 దినములు, క్షత్రియులకు 12 దినములు, వైశ్యులకు 15 దినములు, శూద్రులకు 30 దినములని అన్ని ధర్మశాస్త్రముల యందు ఆశౌచము చెప్పబడియున్నది.

# ముహూర్తాలలో గమనించాల్సినవి

## శంకుస్థాపన

తిథి : 2, 3, 5, 7, 10, 11, 13
వారం : బుధ, గురు, శుక్ర
నక్షత్రం : అశ్వి,రోహి,మృగ,పున,పుష్య,ఉఫ,హస్త చిత్ర,అనూ,ఉషా,శ్రవ,ధని,శత,ఉభా,రేవ
లగ్నం : వృష,మిథు,కన్య,ధను,కుంభ,మీన
విశేషం : అష్టమశుద్ధి 1,3,5 మాసములు శుభం

## గర్భాదానం

తిథి : 2, 3, 5, 7, 10, 13
వారం : సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం: రోహి, మృగ,పున,పుష్య,ఉఫ,హస్త,చిత్ర, స్వాతి,అనూ,ఉషా, శ్రవ,ధని,శత,ఉభా
లగ్నం: మేష,వృష,కటక,కన్య,తుల,ధను,మీన
విశేషం :చతుర్థశుద్ధి, అష్టమశుద్ధి
కాని దినములు

## డోలారోహణం

తిథి : 2, 3, 5, 7, 10, 13
వారం : సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం : అశ్వి,రోహి,మృగ,పున,పుష్య,ఉఫ,హస్త,చిత్ర అనూ,ఉషా,ఉభా,రేవ
లగ్నం :వృష,మిథు,కటక,కన్య,తుల,ధను,మీన
విశేషం: లగ్నశుద్ధి, అష్టమశుద్ధి, పంచవ్రతములు

## గృహప్రవేశం

తిథి : 2, 3, 5, 7, 10, 11, 13
వారం : బుధ, గురు, శుక్ర
నక్షత్రం : రోహి,మృగ,ఉఫ,చిత్ర,అనూ,ఉషా,ధని, శత,ఉభా,రేవ శుభం పుష్య మధ్యమం. (అశ్వి,పున,హస్త,స్వాతి,శ్రవ)
లగ్నం : వృష,మిథు,కన్య,ధను,కుంభ,మీన
విశేషం : చతుర్థశుద్ధి, అష్టమశుద్ధి, వృషభ, కలశచక్రశుద్ధి

## పుంసవనం - సీమంతం

తిథి : 2, 3, 5, 7, 10, 11,13,15
వారం : సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం: అశ్వి,రోహి,మృగ,పున,పుష్య,ఉఫ హస్త,చిత్త,స్వాతి,అనూ,ఉషా,శ్రవ,ధని, శత, ఉభా
లగ్నం: వృశ్చికం సింహం తప్పఇతరలగ్నములు
విశేషం: తృతీయ, నవమశుద్ధి, 4,6,8 నెలలు

## అన్న ప్రాశనం

తిథి : 2, 3, 5, 7, 10, 13
వారం : సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం : అశ్వి,రోహి,మృగ,పున,పుష్య,ఉఫ,హస్త, చిత్ర,స్వాతి,అనూ,ఉషా,శ్రవ,ధని,శత, ఉభా,రేవ
లగ్నం : వృష,మిథు,కటక,కన్య,మీన,ధను
విశేషం : దశమశుద్ధి , పురుషులకు సరి, స్త్రీలకు బేసి మాసం

## నిషేకం

తిథి : 2, 3, 5, 7, 10
వారం : సోమ,బుధ, గురు, శుక్ర
నక్షత్రం : అశ్వి,రోహి,ఉఫ,హస్త,స్వాతి,అనూ, మూల,ఉషా,శ్రవ,శత,ఉభా
లగ్నం : వృష,మిథు,కటక,కన్య,తు,ధను,కుంభ,మీన
విశేషం : లగ్నశుద్ధి, మాఘాది పంచకం శుభం

## నామకరణం - జాతకర్మ

తిథి : 2, 3, 5, 7, 10, 11, 13
వారం : సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం: అశ్వి,రోహి,పున,పుష్య,ఉఫ,హస్త, స్వాతి,అనూ,ఉషా,శ్రవ,ధని,శత,ఉభా
లగ్నం: వృష,మిథు,కటక,కన్య,తుల,ధను,మీన
విశేషం: అష్టమశుద్ధి, లగ్నశుద్ధి

## కర్ణవేధ

తిథి : 2, 3, 5, 7, 10, 13
వారం : సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం : అశ్వి,మృగ,పున,పుష్యఉఫ,హస్త,చిత్ర, అనూ,ఉషా,శ్రవ,ధని,ఉభా,రేవ
లగ్నం : వృష,మిథు,కటక,కన్య,తుల,ధను,మీన
విశేషం : అష్టమశుద్ధి 6,7,8 మాసములు శుభం

## కేశఖండనం

తిథి : 2, 3, 5, 7, 10
వారం : సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం: అశ్వి, మృగ,పున,పుష్య,హస్త,చిత్ర,స్వాతి, శ్రవ,ధని,శత,రేవ
లగ్నం : వృష,మిథు,కటక, కన్య,తుల, ధను,మీన
విశేషం : ఉత్తరాయణం ప్రథమ యామం

## నూతన వస్త్రధారణ

తిథి : 2, 3, 5, 7, 10, 13, 15
వారం : సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం : అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, ఉఫ,హస్త,చిత్త, స్వాతి, అనూ,మూల, ఉషా,శ్రవ,ధని,శత,ఉభా,రేవ
లగ్నం : వృష,మిథు,కటక, కన్య,తుల,ధను,మీన
విశేషం : తృతీయ శుద్ధి

## ప్రయాణం

తిథి : 2, 3, 5, 7, 10, 13
వారం : సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం : అశ్వి, మృగ, పున,పుష్య,హస్త,అనూ, శ్రవ,ధని,రేవ,మూల
లగ్నం : మేష,వృష,కటక,కన్య,తుల,ధను,మీన
విశేషం : వారశూలలు పనికిరావు.

## అక్షరాభ్యాసం

తిథి : 2, 3, 5, 7, 10
వారం : సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం : అశ్వి, ఆర్ద్ర,పున,పుష్య,హస్త,చిత్ర,స్వాతి, అనూ, శ్రవ, రేవ
లగ్నం : మేష,కటక,తుల,మకర
విశేషం : అష్టమశుద్ధి, ఉత్తరాయణం 5సం॥

## ఉపనయ

తిథి : 5,7,10, కృష్ణ 2,7
వారం : ఆది, సోమ, బుధ, గురు, శుక్ర
నక్షత్రం : అశ్వి,రోహి,మృగ,పున, ఉఫ,హస్త,చిత్త, స్వాతి, అనూ,ఉషా,శ్రవ,ధని,శత,ఉభా,రేవ
లగ్నం : వృష,మిథు,కటక,కన్య,ధను,మీన
విశేషం :అష్టమశుద్ధి, ప్రదోషానధ్యాయకేంద్ర పాపగ్రహ రహితం

## కూపారంభం (బోరుబావి)

తిథి : 2,3,5,7,10,13,15
వారం : సోమ,గురు,శుక్ర
నక్షత్రం : రోహి,మృగ,పుష్య,ఉఫ,హస్త, చిత్ర, అనూ, జ్యేష్ఠ, ఉషా,శ్రవ,శత, ఉభా
లగ్నం : కట,మకర,మీనం శుభం(కుంభ,వృష)
విశేషం : లగ్నమందు చంద్రశుక్రులు, ఉత్తర ఈశాన్యం శుభం.

## విద్యాభ్యాసం

తిథి : 2, 3, 5, 7, 10,11
వారం : ఆది,సోమ,బుధ,గురు,శుక్ర
నక్షత్రం : అశ్వి, మృగ,ఆర్ద్ర,పున,పుష్య,ఆశ్రే,పుబ్బ, హస్త,చిత్ర,స్వాతి,మూల,పూషా,శత,పూభా
లగ్నం : మేష,కటక,తుల,మకర,మీన
విశేషం : అష్టమశుద్ధి, అనధ్యాయరహితం

## వివాహం

తిథి : 2, 3, 5, 7, 10,13
వారం : బుధ,,గురు,శుక్ర,శని,ఆది
నక్షత్రం : అశ్వి, రోహి,మృగ,మఖ,ఉఫ,హస్త,చిత్ర, స్వాతి,అనూ,మూల,ఉషా,శ్రవ,ధని, ఉభా,రేవ
లగ్నం : మేష,కటక,తుల,వృష, మిదు, కన్యా,ధను, మీన
విశేషం : సప్తమ,అష్టమశుద్ధి, మాఘాదిపంచకం

## బీజావాపనం

తిథి : 2, 3, 5, 7, 10,13
వారం : సోమ,బుధ,గురు,శుక్ర
నక్షత్రం : అశ్వి,రోహి,మృగ,పుష్య,మఖ,ఉఫ,హస్త, చిత్ర, స్వాతి,అనూ,మూల,ఉషా,శ్రవ,ధని,శత,ఉభా,రేవ
లగ్నం : వృష,మిథు,కటక,కన్య,వృశ్చి,ధను, మీన
విశేషం : అష్టమశుద్ధి.

## వాణిజ్యం

తిథి : 2, 3, 5, 7, 10,13
వారం : సోమ,బుధ,గురు,శుక్ర
నక్షత్రం: అశ్వి, రోహి,మృగ,పుష్య,హస్త,చిత్ర, ఉత్తరాత్రయం,అనూ,రేవ
లగ్నం : వృష, మిథు, కటక, కన్య,తుల,ధను,మీన
విశేషం : శుభం

## క్షౌరం

తిథి : 2, 3, 5, 7, 10,13
వారం : సోమ,బుధ,గురు,శుక్ర
నక్షత్రం: అశ్వి, మృగ,పున,పుష్య,హస్త,చిత్ర,స్వాతి,శ్రవ,ధని,శత,రేవ
లగ్నం : వృష, మిథు, కటక, తుల,ధను,మీన
విశేషం : భోజనానంతరం, భార్య 6 నెలల గర్భిణియైన కూడదు.

## స్వయం ఉపాధి వృత్తులు చేపట్టు వారికి టేబులు

| నెం. | నూతన వృత్తులు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|---|
| 1. | పాలకేంద్రము | పౌర్ణమికి ముందు | సో, గు, శు | రోహి, పుష్య, స్వాతి, అనూ | వృష, హ, తుల | శుక్రుడు ఉచ్ఛ |
| 2. | మత్స్య పరిశ్రమ | పౌర్ణమికి ముందు | సో, గు, శు | పుష్య, రేవ, శ్రవ | కట, మీన, మక | లగ్నంలో చంద్రుడు |
| 3. | పాడి పరిశ్రమ | పౌర్ణమికి ముందు | సో, గు, శు | రోహి, మఖ, నూ, మూల | వృష, తుల | షష్టాధిపతికి ఉచ్ఛ |
| 4. | గొర్రెల పెంపకం | పౌర్ణమికి ముందు | సో, బు, గు,శు | రోహి, మఖ, నూ, మూల | వృష, తుల | షష్టాధిపతికి ఉచ్ఛ |
| 5. | కోళ్ళ పెంపకం | పౌర్ణమికి ముందు | సో, బు, గు,శు | రోహి, మఖ, నూ, మూల | వృష, తుల | షష్టాధిపతికి ఉచ్ఛ |
| 6. | బట్టల వ్యాపారం | పూర్ణ తిథులు | సో, గు, శు | రోహి, స్వా, పుష్య | వృష, తుల | స్థిరరాశుల శుభుల కేంద్రస్థితి |
| 7. | మందుల షాపు | పూర్ణ తిథులు | బు, గు, సో,ఆ | మృ, రో, పున పుష్య, ఉత్త | మదుకన్య | లగ్నంలో బుధుడు |
| 8. | పండ్ల కొట్టు | పూర్ణ తిథులు | బు, గు, సో ఆ | రోహి, పున, శ్రవ, అనూ | కట,మీన,వృష,తుల | లగ్నంలో గురుడు |
| 9. | వర్కు షాపు | పూర్ణ తిథులు | శ, శు, సో | పుష్య, అనూ, ఉత్తర | మఖ, కుంభ, కన్య | శని ఉచ్ఛస్వక్షేత్రం |
| 10. | స్వీటు సెంటర్ | పూర్ణ తిథులు | గు, శు, సో | రోహి, పుష్య, ఉ.భాద్ర | మీన, ధన, వృ,తుల | లగ్నంలో చంద్రుడు |
| 11. | ఐస్ పార్లర్ | పూర్ణ తిథులు | సో, శు, గు | రో, పుష్య, శ్రవ, కువ,ఉ.భా | మీన, కట, మక | లగ్నంలో శుక్రుడు |
| 12. | ఫ్యాన్సీ షాపు | పూర్ణ తిథులు | గు, శు, సో,బు | రో, పుష్య, శ్రవ, కువ,ఉ.భా | వృ, తు, మీన,కట | లగ్నంలో శుక్రుడు |
| 13. | బుక్ సెంటర్ | పూర్ణ తిథులు | గు, శు, సో,బు | రో, పుష్య, శ్రవ, కువ,ఉ.భా | వృ, తు, మీన,కట | లగ్నంలో బుధుడు |
| 14. | ప్రింటింగ్ ప్రెస్ | జయ తిథులు | ఆ, సో, శు | రో, పుష్య, శ్రవ, కువ,ఉ.భా | మే, వృ, మ, కుం | శని ఉచ్ఛ / స్వక్షేత్ర |
| 15. | మెట్లు కొట్టు | జయ తిథులు | ఆ, సో, శు | రో, పుష్య, శ్రవ, కువ,ఉ.భా | మే, వృ, మ, కుం | కుజుడు ఉచ్ఛస్థితి |
| 16. | రసాయనములషాపు | జయ తిథులు | ఆ,సో,శు | రో, పుష్య, శ్రవ, కువ, ఉ.భా | మే, వృ, మ, కుం | కుజుడు ఉచ్ఛస్థితి |

## మీ పేరును బట్టి మీకు పనికివచ్చే సింహద్వారములు, ఆయములు, తెలుసుకొనుట

| మీ పేరులో మొదటి అక్షరం | వర్గు | సరిపోయే సింహద్వారం | సరిపడని సింహద్వారం | సరిపోయే ఆయం | సరిపడని ఆయం |
|---|---|---|---|---|---|
| అ నుండి అం, అః వరకు | అ వర్గు | తూర్పు, పడమర, దక్షిణం | ఉత్తరం | ధ్వజ, సింహ, గజాయం | వృషభాయం |
| క, ఖ, గ, ఘ, ఙ | క వర్గు | దక్షిణం, పడమర | తూర్పు, ఉత్తరం | గజాయం | సింహ, వృషభ,ధ్వజ |
| చ, ఛ, జ, ఝ, ఞ | చ వర్గు | తూర్పు, ఉత్తరం, పడమర | దక్షిణం | ధ్వజ, సింహ, వృషభ | గజాయం |
| ట, ఠ, డ, ఢ, ణ | ట వర్గు | తూర్పు, ఉత్తరం, పడమర | దక్షిణం | ధ్వజాయం | సింహ,వృషభ,గజాయం |
| త, థ, ద, ధ, న | త వర్గు | తూర్పు, ఉత్తరం | దక్షిణం, పడమర | వృష, సింహ, గజాయం | ధ్వజాయం |
| ప, ఫ, బ, భ, మ | ప వర్గు | తూర్పు, ఉత్తరం | దక్షిణం, పడమర | సింహ, ధ్వజాయం | వృషభ, గజాయం |
| య, ర, ల, వ | యవర్గు | తూర్పు, పడమర, దక్షిణం | ఉత్తరం | ధ్వజ, వృషభ, గజాయం | సింహాయం |
| శ, ష, స, హ | శ వర్గు | దక్షిణం, తూర్పు | ఉత్తరం, పడమర | వృషభ, గజాయం | సింహ, ధ్వజాయం |

- **చైత్ర, వైశాఖ, ఫాల్గుణ** మాసములందు – **తూర్పు** సింహ ద్వారం గల గృహము నిర్మించాలి.
- **జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ** మాసములందు – **తూర్పు, దక్షిణ** సింహ ద్వారం గల గృహము నిర్మించాలి.
- **భాద్రపద, ఆశ్వీయుజ, కార్తిక** మాసములందు – **దక్షిణ, పడమర** సింహ ద్వారం గల గృహము నిర్మించాలి.
- **మార్గశిర, పుష్య, మాఘ** మాసములందు – **ఉత్తర, పడమర** సింహ ద్వారం గల గృహము నిర్మించాలి.

## వాస్తు ప్రకరణము

ఆయుష్షు లేని మానవుడు అష్టఐశ్వర్యములు వున్న ఎలా నిరుపయోగమో, ఆయంలేని గృహం కూడ అంతే నిరుపయోగం. గృహమునకు కావలసిన పొడవు వెడల్పుచే (గర్భం) గుణించగా ఏర్పడు సంఖ్య 9 చే భాగించగా చదరపు గజాలలో గృహ పిండం వచ్చును. (పిండము అనగా మానవ ఉత్పత్తికి మూలా ధారము) దానినే క్షేత్రపదం అని, సామాన్య గణితంలో వైశాల్యం అని వ్యవహరింతురు. పొడవు వెడల్పు హస్తములలో గాని గజములలోగాని గ్రహించుట ప్రాచీన ఋషి సాంప్రదాయం, ప్రాచీన మతంలోని హస్తములు 18 బ్రిటిష్ అంగుళాలు, రెండుహస్తములు 36 బ్రిటీష్ అంగుళాలు లేక ఒక గజం 9 చదరపు అడుగులు ఒక చదరపు గజం అగును కావున చదరపు గజములలో గృహగర్భం నిర్ణయించుట ప్రాచీన సాంప్రదాయం. ఈ ఆయములు 1. ధ్వజాయం 3. సింహాయం 5.వృష భాయం 7.గజాయం శ్రేష్ఠమైనవి. 2. ధుమాయం 4. శ్వానాయం 6. ఖరాయం 8. కాకాయం నిషిద్ధాయములు. గృహ గణితంలో నవవర్గలు, ఏకాదశివర్గలు, చతుర్థశివర్గలు షోడశ వర్గలు, అష్టాదశ వర్గలు చెప్పబడి నవి. ఏకాదశవర్గలు లోకోచారమున ఎక్కువగా వినియోగించు చున్నారు. గృహపిండమును 9చే గుణించి 8చే భాగించగా శేషం ఆయమగుచున్నది. గృహపిండ మును 9చే గుణించి 8చే భాగించడం లోని గుడార్థం ఏమనగా మానవుని శరీరంలో నవద్వారములు చెప్పబడుసంఖ్య 9, అష్ట దిక్పాలకుల సంఖ్య 8, నవద్వారముల భగవత్ నిర్మితమైన ఈ దేహం అష్టదిక్కులు యేర్పరచి అష్టదిక్పాల్పలకులకు స్థానమిచ్చు మానవ నిర్మితమైన గృహం ఈ రెండు గుణించగా మానవునకు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించే ఆయము ఏర్పడుచున్నది.

గృహనిర్మాణం దీర్ఘచతురస్రాకృతి స్థలం అత్యంత శుభదాయకం. కారణం ఏమన గృహకారకుడయిన గురువు దీర్ఘచతురస్ర మండలము నకు అధిపతి కావున. గృహమునకు ఏ విధమైన వీధిపోట్లు అయిన దుష్ఫలములను ఇచ్చును. దేవశిల్పి విశ్వకర్మ విదిక్కులలో సింహద్వార నిర్ణయం అశుభప్రదమని తెలియజేసిరి. సింహద్వారం వాస్తుపురుషుని యొక్క నోరు అని విశ్వకర్మ అభిమతం, సింహద్వార ఇరువైపుల కిటికీలు వాస్తు పురుషుని నేత్రాలు అని విశ్వకర్మ అభిమతం. విశ్వకర్మ వచనం ద్వారా విదిక్కులలో సింహద్వారం నిర్ణయం నిషిద్ధంగా గోచరించు చున్నది. శాస్త్రీయంగా సింహద్వార నిర్ణయం ఏమనగా ఇంటి లోపలి కొలతలు 9 భాగములుగా విభజించి సవ్యక్రమములో నవగ్రహ స్థానము లేర్పరచి మధ్యనున్న బుధ, గురు, శుక్రస్థాన ముల యందు శుభమని తెలిపిరి. మధ్యనున్న గురుస్థానం బ్రహ్మస్థానమును సూచించును కావున దేవాలయములకు ఈ గురుస్థానం నందు సూచించిన సింహద్వార నిర్ణయం శుభంగా మానవ నివాసగృహ ములకు బుధ, శుక్రస్థానములు సింహ ద్వారములకు శుభంగా నిర్ణయించిరి.సింహద్వారం గృహంమధ్య నుండి ఉత్తరం లేక తూర్పునకు కొన్ని అంగుళాలయిన జరిపి సింహద్వారస్థాపన చేయాలని నియ మం ఉ న్నది, కావున తూర్పు దక్షిణ సింహద్వారములవారు బుధ స్థానమున, పశ్చిమ ఉత్తర సింహద్వారములు శు క్రస్థానము నందు సింహద్వారం నిర్ణయించుట ప్రామాణికమైనది. సింహద్వారం మాత్రం నిర్దుష్ట ప్రదేశాలలో నిర్ణయించవలెను. గృహములోపల ఏమూల యందు వాకిళ్ళువున్న ద్వారశూలకాదని విశ్వకర్మ వాస్తుశాస్త్రమున తెలుప బడినది.

**దైవ మందిరం :** ఈశాన్యం దైవ మందిరం అని విశ్వకర్మ వచనం ఈశాన్యంనందే దైవమందిరం స్థాపించుటకు కారణం జ్యోతిషశాస్త్ర బద్ధంగా యోచించగా ఈశాన్యదిక్కునకు గురుకేతువులు అధిపతులగు దురు. గురువు జ్ఞానకారకుడు, కేతువు మోక్ష కారకుడు. జ్ఞానమోక్షాదులు జీవితపరమార్థాలుగా భావించి మన మహర్షులు ఈశాన్యమునందు దైవమందిర స్థాపనకు ప్రాధాన్యత నిచ్చిరి. నేటి నవీనశాస్త్రవేత్తలు నైరుతి మూలయందు కూడ దైవ మందిరం నిర్మిస్తున్నారు. నైఋతి దిశకు నిఋతి అను రాక్షసుడు అధిపతి అందుచేతనే ఈ నైఋతి మూలను రాక్షస మూలగా అభివర్ణింతురు. ఈ రాక్షసమూలయందు దైవ మందిర నిర్మాణం అశాస్త్రీయమైనది. ఈశాన్యంనందు బరువు వుండకూడదని దేవుని పీఠము నిర్మించుట దోషమని నేటి నవీన వాస్తుశాస్త్రవేత్తలు తెలుపు తున్నారు. ఈ విషయం అభూతకల్పన. దేవుడు ఎత్తైన పీఠము నందు గృహకర్త దేవుని కన్నా తక్కువ ఎత్తున కూర్చుని పూజించిన సత్సంప్రదాయం. ఈశాన్యములో బరువు వుండరాదన్న సూత్రమే స్వతంత్రమైనది. ప్రామాణిక విరుద్ధమైనది దేవుని గదిలో ఎత్తైన పీఠములో దేవుణ్ని వుంచి పూజించడం శాస్త్రీయమైనదిగా గుర్తిం చాలి.

**వంటగది :** ఆగ్నేయం పాకసదనం అని విశ్వకర్మ వచనం, ఆగ్నేయంలో పాకశాల స్థాపనక కారణం జ్యోతిషశాస్త్రబద్ధంగా యోచించగా ఆగ్నేయ దిక్కుకు శుక్రుడు అధిపతి. శుక్రుడు అగ్ని తత్వ గ్రహమయినందున స్త్రీ గ్రహమయినందున ఆగ్నేయమందు వంట గది నిర్మాణం ఉత్తమమని మహర్షులు నిర్ణయం. విశ్వకర్మ తెలిపిన దేవమానుష గంధర్వ భాగవిభజన ప్రకారం తూర్పు దక్షిణ సింహ ద్వారములవారు వాయువ్య గదిలో ఆగ్నేయ మూలన వంటగదిగా వుపయోగించవచ్చును. **రోలు నిలుపు స్థలం :** రోలు శనేశ్వరునిగా చెప్పబడినది. రోలు సింహద్వారం ఎదురుగా కనిపించరాదు. రోలుకు పొయ్యికి పశ్చిమ ఉత్తర సింహ ద్వారములవారు మాత్రం ఆగ్నేయ గదిలో ఆగ్నేయమూలన వంటగదిగా వుపయోగించవచ్చు.

**స్నానశాల :** పూర్వశ్యాం స్నానమందిరం అని విశ్వకర్మ వచనం ఈ ప్రవచనాన్ని జ్యోతిషశాస్త్ర బద్ధంగా యోచించగా మేష సింహ కర్కాటక వృశ్చిక ధనుర్ మీనలగ్నముల వారికి తూర్పు దిశాధిపతి అయిన రవి శుభుడు కావున ఈ లగ్నజులకు తూర్పు స్నాన మందిరం శ్రేష్టమయినది. పై లగ్నజులకు వాయువ్య దిశాధిపతి అయిన చంద్రుడు శుభుడగును. కావున పై లగ్నజులు వాయువ్య మూలన కూడ స్నానశాల ఏర్పరచుకోవచ్చును. అట్లే దక్షిణ దిశాధిపతి శుభుడు కావున పై లగ్నజులకు దక్షిణదిశ స్నానశాల శుభం. మిగిలిన వృషభ, మిధున, కన్య, తుల, మకర, కుంభ లగ్నజులకు సూర్యచంద్రులు ఆధిపత్య పాపులగుదురు. కావున వీరికి ఆదిపత్య శుభులైన శుక్ర బుధ శని రాహు దిశలయిన ఆగ్నేయ, ఉత్తర, పశ్చిమ, నైఋతి దిశలలో స్నాన శాలలు ఏర్పరచు కొనవచ్చును.

**మరుగుదొడ్లు :** విశ్వకర్మ గృహమునకు వెనుకభాగమున మరుగు దొడ్లు నిర్మించాలని చెప్పెను. తూర్పు ముఖద్వారం వారు నైరుతి పశ్చిమదిశల యందు మరుగుదొడ్లు నిర్మించుకొనవచ్చును. దక్షిణ సింహద్వారం ఉత్తరము మరుగుదొడ్లు నిర్మించుకో వచ్చును. పశ్చిమ సింహ ద్వారంవారు తూర్పు దిక్కున మరుగుదొడ్లు నిర్మించు కోవచ్చును, ఉత్తర సింహద్వారంవారు దక్షిణం మరుగుదొడ్లు నిర్మించు కోవచ్చును. తూర్పు దక్షిణ సింహద్వారం వారు తూర్పు, దక్షిణ ఈశాన్య వాయువ్యాలలో మరుగుదొడ్లు నిర్మించరాదు. పశ్చిమ ఉత్తర సింహ ద్వారం వారు ఆగ్నేయ ఉత్తర పశ్చిమ నైరృతి దిశలలో మరుగుదొడ్లు నిర్మించరాదు. జ్యోతిషశాస్త్ర బద్ధంగా మరుగుదొడ్లు శత్రుదిక్కులలో వుండాలి మిత్రదిక్కులలో పనికిరాదు. ఈశాన్యం అన్నిదిక్కులవారు మరుగుదొడ్డి నిర్మించ రాదు.

**బీరువా నిలుపుస్థలం :** భాండగారం ఉత్తరే అని విశ్వకర్మ వచనం. ఈ వచనాన్ని జ్యోతిషశాస్త్రబద్ధంగా యోచించగా వృషభ మిధున కన్యా, తుల, మకర కుంభలగ్నజులకు ఉత్తరాన ధనపేటిక శ్రేష్ఠమైనదిగా ధృవీకరించవచ్చు. ఉత్తరదిశకు కుబేరుడు అధిపతి కుబేరుడు లక్ష్మిఅనుగ్రహ ప్రదాత కావున పై లగ్నజులకు ఉత్తరం ధనపేటిక శ్రేష్ఠమయినది. మిగిలిన మేషకర్కాటక సింహ వృశ్చిక ధనుర్ మీనలగ్నజులకు వాయువ్య మూలన ధనపేటిక స్థాపన జ్యోతిషశాస్త్ర బద్ధంగా సరియైనది. కారణం చంద్రుడు లక్ష్మీకార కత్వం గ్రహం వాయువ్యదిశకు అధిపతి, చంద్రమండల మధ్యస్థే చంద్రామ్ చంద్రసహోదరి అని పద్మపురాణంలో తెలిపిన లక్ష్మీ అష్టోత్తర శతనామస్తోత్రం ప్రకారం లక్ష్మీచంద్రగ్రహాధిపతి దేవతగా చెప్పబడినది. చంద్రుడు వాయువ్య దిశాధిపతి కావున వాయువ్యమూల యందు పై లగ్నజులు ధనపేటిక తూర్పు ముఖంగా స్థాపించడం జ్యోతిషశాస్త్ర బద్ధంగా సరియైనది.

**తులసికోట నిర్మాణం :** తులసి లక్ష్మీ స్వరూపంగా చెప్ప బడింది. దైవతార్చన తర్వాత తులసిని పూజించడం హైందవ సాంప్రదాయం తులసిని పూజించువారు ధర్మార్థకామ మోక్ష చతుర్విధ పురుషార్థములు పొందుదురని సర్వపురాణ వచనం ఈ తులసికోట వాయువ్య మూలన స్థాపించడం జ్యోతిషశాస్త్ర బద్ధంగాసరియైనది. కారణం వాయువ్య దిశాధిపతి అయిన చంద్రుడు లక్ష్మీకారకత్వ గ్రహం కావున.

**భోజనశాల :** పశ్చిమే భోజనాలయం అని విశ్వకర్మ వచనం ఈ వచనాన్ని జ్యోతిషశాస్త్ర బద్ధంగా యోచించగా వృషభ మిధున కన్య, తుల, మకర, కుంభలగ్నజులకు శని త్రికోణాధిపత్యంచే శుభుడగును కావున ఈ లగ్నజులకు పశ్చిమం భోజనాలయం శ్రేష్ఠమైనది. మిగిలిన ఆరు లగ్నములయిన మేషకర్కాటక, సింహ, వృశ్చిక ధనుర్ మీన లగ్నజులకు ప్రధాన దక్షిణ దిశాధిపతి అయిన కుజుడు త్రికోణాధిపత్యంచే శు భుడగును కావున ఈ లగ్నజులకు దక్షిణం నందు భోజనాలయం శ్రేష్ఠమైనది.

**పడకగది :** దక్షిణే చైవ శయనం అని విశ్వకర్మ వచనం ఈ వచనాన్ని జ్యోతిషశాస్త్రబద్ధంగా యోచించగా మేష, కర్కాటక, సింహ వృశ్చిక ధనుర్ మీనలగ్నజులకు ప్రధాన దక్షిణ దిశాధిపతి అయిన కుజుడు ఆధిపత్యశుభుడు కావున ఈ లగ్నజులకు దక్షిణం పడక యోగ్యమైనది. పై లగ్నజులకు వాయువ్య దిశాధిపతి చంద్రుడు శుభుడు కావున వాయువ్య మూలలో కూడ పడకగది పై లగ్నజులకు శుభస్కరమే. మిగిలిన వృషభ మిధున కన్య తుల మకర కుంభలగ్నజు లకు ప్రధాన పశ్చిమ దిశాధిపతి శని ఆధిపత్య శుభుడగును కావున ఈ లగ్నజులకు పశ్చిమాన పడక గది శుభదాయకం. అలాగే నైఋతి దిశాధిపతి అయిన రాహువు పై లగ్నజులకు ఆధిపత్య శుభుడగును. కావున నైఋతి పడకగది పై లగ్నజులకు శ్రేష్ఠమైనది.

**మెట్లు నిర్మాణ వివరణ :** విశ్వకర్మ వాస్తు శాస్త్రంనందు మెట్ల నిర్మాణం గూర్చి ఈవిధంగా చెప్పబడినది.

**శ్లో॥ శాలాదిషు రంగేషు సోపానం ప్రముఖం స్మృతమ్**
**పార్శ్వర్వుర్ముఖ సోపానాదన్యత్ర పరికల్పయేత్.**
మానససారం అనుగ్రంథం నందు మెట్ల నిర్మాణం గూర్చి ఈ విధంగా ఉన్నది.

**శ్లో॥ చతుర్థిక్షు చతుష్కోణే సోపానస్తాన మీరితమ్**
శిల్పరత్నాకరం అనుగ్రంథనందు మెట్ల నిర్మాణం గూర్చి ఈ విధంగా ఉన్నది.

**శ్లో॥ అగ్రద్వార భవంగమస్థల సమారబ్దాన్యథోర్ధ్వ క్రమాత్**
పైశ్లోక భావములను విశ్లేషించగా మెట్లను ముఖభాగము నందు ప్రక్కభాగములందు, శాలయందలి గదులయందు మెట్ల నిర్మించు కొనవచ్చును.

**వాస్తుశాస్త్రంలో ముఖ్యాంశాలు :**

1. ఒక ఇంటిని మూడు భాగాలుగా పంచుకొని నివశించరాదు.
2. ఒకేదిశకు మూడువాకిళ్ళు ఉండరాదు. అనగా మూడు గడపలు దాటి లోపలకు పోరాదు.
3. మూడుదిశలకు మూడుద్వారాలుపెట్టి నిర్మించరాదు. అనగా తూర్పు, పశ్చిమ, ఉత్తర, దక్షిణ ప్రధాన దిశలకు ద్వారస్థాపన చేయునపుడు రెండు దిశలకుగాని, నాలుగు దిశలకు గాని ద్వార నిర్ణయం చేయవలెను.
4. తండ్రి తాతలు నిర్మించిన గృహమునకు ఆర్వణం చూడ రాదు. అనగా ఆదిశ యోగించునా అని చూడరాదు.
5. గృహమునందు ఏ దిశకైనను ఫలపుష్ప వృక్షములు వుండ వచ్చును. ముళ్ళ వృక్షములు గృహావరణలో వుండరాదు.
6. గృహమునందు ఏ గోడకూడ మధ్యలో ఆగరాదు అనగా మొండి గోడలు గృహమునందు కనపడరాదు.
7. గృహమునందు పూజ వృక్షములయిన వేప, రావి, జమ్మి, బిల్వ మొదలగు వృక్షములు గృహావరణలో వుండరాదు.
8. నూతన నిర్మాణం చేయునపుడు గృహారంభ శుభముహూర్తము నకు చతుర్థస్థానాన్ని లగ్న పంచమ భాగ్యాధిపతులు స్థితి, యుతివీక్షణలలో బలపరచునట్లు ముహూర్తనిర్ణయం చేయ వలెను. గృహప్రవేశ శుభముహూర్తమునకు కూడ పై విధంగా చతుర్థశుద్ధిని చూడవలెను.
9. శంకుస్థాపన మరియు గృహప్రవేశ ముహూర్తములను జాత కుని జన్మలగ్నం, ప్రశ్నలగ్నానుగుణ్యంగా చూడాలి. ముహూర్త కాల లగ్నం జాతకుని యొక్క జన్మ లేక ప్రశ్న లగ్నరీత్యా ఏర్పడు లగ్నం జాతకుని లగ్న పంచమ భాగ్యాధిపతుల లగ్నాలలో ఒకటై వుండాలి.

ఏ యంత్రమునకైన మత్స్య యంత్రం మయబ్రహ్మచే నిర్మితం అయినదిగా శ్రీ చక్రం ఆదిశంకరాచార్యులచే సృష్టించబడినదిగా పురాణ కథల ద్వారా తెలియబడుచున్నది. యంత్రదూషణ చేయడం దైవదూష ణతో సమానమని ప్రామాణికపద్ధతులచే నిర్మితమైన ఏ యంత్రమైన సత్ఫలంఇచ్చునని అనుభవమున కూడ మేము గ్రహించితిమి నేటి నవీన శాస్త్రవేత్తల నాస్తికత్వ ధోరణితో యంత్రదూషణ చేయడం అశాస్త్రీయ మైనదిగా సర్వజనులు గ్రహించాలి.

## శ్రీ వైష్ణవ తిరునక్షత్రములు

ఏప్రి25 ఉయ్యాక్కొండార్ తిరునక్షత్రము
28 ఎంబేరుమానార్ తిరునక్షత్రము
28 శ్రీ భగవద్రామానుజచార్య తిరునక్షత్రము
29 చక్రవర్తి తిరుమానర్ ముదలియాండాన్ తిరునక్షత్రము
**మే5** దేవప్పేరుమాళ్ తిరునక్షత్రము
6 మధురక వియాళ్వార్ తిరునక్షత్రము
10 శ్రీ సల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్య స్వామి తిరునక్షత్రము
19 శ్రీశ్రీశ్రీ త్రిదండి రామచంద్ర రామానుజ జీయర్‌స్వామి తిరునక్షత్రము
**జూన్3** ఆళసింగరి పెరియతిరుమలైనంబి తిరునక్షత్రము
4 నమ్మాళ్వార్ తిరునక్షత్రము
5 శ్రీ పరాశరభట్టార్ తిరునక్షత్రము
30 తిరుపరంగపెరుమాలె పెరియాళ్వార్ తిరునక్షత్రము
**జూలై2** నాథమునిఫల్ తిరునక్షత్రము
24 ఆణ్డాళ్ తిరునక్షత్రము
25 వేదపల్లితాయార్ తిరునక్షత్రము
26 బదరీనారాయణ పెరుమాళ్ తిరునక్షత్రము
27 చక్రతాళ్వార్ తిరునక్షత్రము
**ఆగ2** ఆళ్వందార్ పుండరీకాక్షులు తిరునక్షత్రము
8 శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణరామానుజ పెద్ద జీయర్ తిరునక్షత్రము
26 శ్రీశ్రీశ్రీ త్రిదండి రంగరామానుజ జీయర్‌స్వామి తిరునక్షత్రము
30 శ్రీశ్రీశ్రీ నిత్యనిర్మలానందయాత్రయోగేశ్వరస్వామి తిరునక్షత్రము
**సెప్టె27** తిరువేంగడత్తాన్ వేదాంతదేశికర్ తిరునక్షత్రము
**అక్టో18** తిరుమలైనంబి తిరునక్షత్రము
21 మణవాల మహాముని తిరునక్షత్రము
22 శేవముదలియాళ్వార్ తిరునక్షత్రము
24 పోయిఘయాళ్వార్ తిరునక్షత్రము
25 పూధతాళ్వార్ తిరుమలైకయాండాన్ తిరునక్షత్రము
27 పేరియాళ్వార్ తిరునక్షత్రము
**నవ14** శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామి తిరునక్షత్రం
28 మాధవపెరుమాళ్ తిరునక్షత్రము
29 తిరుమంగై ఆళ్వార్ తిరునక్షత్రము
30 తిరుప్పాణాళ్వార్ సారథిస్వామి తిరునక్షత్రము

**డిసె8** పుట్ట వానమామలైకలియన్ రామానుజ జీయర్ తిరునక్షత్రము
**2021జన30** తిరుమడిశై ఆళ్వార్ తిరునక్షత్రము
**ఫిబ్ర2** కూరత్తాళ్వార్ తిరునక్షత్రము
7 శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామి తిరునక్షత్రము
24 కులశేఖరాళ్వార్ తిరుమలై యాండాన్ తిరునక్షత్రము
22 తిరుక్కచ్చినంచి తిరునక్షత్రము
**మార్చి2** (శ్రీశ్రీశ్రీ త్రిదండి అష్టాక్షరీ) సంపతక్కుమార రామానుజజీయర్ స్వామి తిరునక్షత్రం

## శ్రీశ్రీశ్రీ జగద్గురు ఆదిశంకరాచార్య అద్వైత పీఠము

### గురుపరంపర జయంతి

జ్యేష్ఠ బ॥ ఏకాదశి శ్రీశ్రీశ్రీ కృష్ణానంద సరస్వతిస్వామి జయంతి
శ్రావణ బ॥ దశమి శ్రీశ్రీశ్రీ మదనానంద సరస్వతిస్వామి జయంతి
మార్గశిర శు॥ పౌర్ణమి శ్రీశ్రీశ్రీ దత్తాత్రేయస్వామి జయంతి
మార్గశిర శు॥ పౌర్ణమి శ్రీశ్రీశ్రీ మాధవానంద సరస్వతిస్వామి జయంతి
వైశాఖ శు॥ పంచమి శ్రీశ్రీశ్రీ జగద్గురు ఆదిశంకరాచార్యస్వామి జయంతి
వైశాఖ బ॥ దశమి శ్రీశ్రీశ్రీ ఆంజనేయస్వామి జయంతి
ఆశ్వీయుజ శు॥ పంచమి శ్రీశ్రీశ్రీ రామానంద సరస్వతి స్వామి జయంతి
మార్గశిర శు॥ త్రయోదశి శ్రీశ్రీశ్రీ సహజానంద సరస్వతిస్వామి
పుష్య బ॥ ఏకాదశి శ్రీశ్రీశ్రీ బ్రహ్మానంద సరస్వతిస్వామి జయంతి
చైత్ర శు॥ షష్ఠి శ్రీశ్రీశ్రీ రమణ మహర్షి జయంతి
వైశాఖ శుద్ధ దశమి బ్రహ్మంగారి జయంతి

## శ్రీ మధ్వవైష్ణవ పుణ్యదినములు

చైత్ర శు॥ విదియ శ్రీ వేదవ్యాస తీర్థానాం పుణ్యదినం
చైత్ర శు॥ నవమీ బుధవారం శ్రీ కవీంద్ర తీర్థానాం పుణ్యదినం
చైత్ర శు॥ త్రయోదశి ఆదివారం శ్రీ సత్యవ్రత తీర్థానాం పుణ్యదినం
చైత్ర బ॥ శ్రీ సత్య విజయ తీర్థానాం పుణ్యదినం
వైశాఖ శు॥ తదియ శ్రీ విద్యాధిరాజా తీర్థానాం పుణ్యదినం
వైశాఖ శు॥ పంచమి శ్రీ రామచంద్ర తీర్థానాం పుణ్యదినం
జ్యేష్ఠ శు॥ విదియ శ్రీ సత్యానంద తీర్థానాం పుణ్యదినం
జ్యేష్ఠ శు॥ త్రయోదశి శ్రీ సత్యాభినవ తీర్థానాం పుణ్యదినం
జ్యేష్ఠ బ॥ విదియ శ్రీ సత్యపూర్ణ తీర్థానాం పుణ్యదినం
ఆషాఢ బ॥ నవమి శ్రీ సత్యాధిరాజ తీర్థానాం పుణ్యదినం
ఆషాఢ బ॥ పంచమి శ్రీ జయ తీర్థానాం పుణ్యదినం
ఆషాఢ బ॥ అమావాస్య శ్రీ సత్యాధీశ తీర్థానాం పుణ్యదినం
శ్రావణ శు॥ సప్తమి శ్రీ సత్యవర తీర్థానాం పుణ్యదినం
శ్రావణ బ॥ విదియ శ్రీ రాఘవేంద్ర తీర్థానాం పుణ్యదినం
భాద్రపద శు॥ దశమి శ్రీ సత్యేష్ఠ కామ తీర్థానాం పుణ్యదినం
భాద్రపద బ॥ అమావాస్య శ్రీ మాధవ తీర్థానాం పుణ్యదినం
ఆశ్వీయుజ శు॥ సప్తమి శ్రీ సత్యపారాయణ తీర్థానాం పుణ్యదినం
ఆశ్వీయుజ శు॥ అష్టమి శ్రీ సత్యపరాక్రమ తీర్థానాం పుణ్యదినం
కార్తీక శు॥ దశమి శ్రీ సత్యవర తీర్థానాం పుణ్యదినం
కార్తీక శు॥ ఏకాదశి శ్రీ వేదనిధి తీర్థానాం పుణ్యదినం
కార్తీక బ॥ త్రయోదశి శ్రీ విద్యానిధి తీర్థానాం పుణ్యదినం
కార్తీక బ॥ చతుర్థశి శ్రీ పద్మనాభ తీర్థానాం పుణ్యదినం
మార్గశిర శు॥ దశమి శ్రీ సత్యనిధి తీర్థానాం పుణ్యదినం
మార్గశిర శు॥ ద్వాదశి శ్రీ సత్యనాథ తీర్థానాం పుణ్యదినం
మార్గశిర బ॥ ద్వాదశి శ్రీ రఘునాథ తీర్థానాం పుణ్యదినం
పుష్య శు॥ ఏకాదశి శ్రీ రహోత్తమ తీర్థానాం పుణ్యదినం
పుష్య బ॥ షష్ఠి శ్రీ సత్యకామ తీర్థానాం పుణ్యదినం
పుష్య బ॥ సప్తమి శ్రీ నరహరి తీర్థానాం పుణ్యదినం
పుష్య బ॥ చతుర్థశి శ్రీ విద్యాధీశ తీర్థానాం పుణ్యదినం
పుష్య బ॥ అమావాస్య శ్రీ పురంధరదాస తీర్థానాం పుణ్యదినం
మాఘ శు॥ నవమి శ్రీ ఆనంద తీర్థానాం పుణ్యదినం
ఫాల్గుణ శు॥ విదియ శ్రీ సత్యబోధ తీర్థానాం పుణ్యదినం
ఫాల్గుణ శు॥ తదియ వాటవదిరాజస్వాగళ తీర్థానాం పుణ్యదినం
ఫాల్గుణ శు॥ షష్ఠి శ్రీ సత్యవ్రత తీర్థానాం పుణ్యదినం

## వచ్చే ప్లవ నామ సంవత్సరం శుభముహూర్తములు

**చైత్రమాసము – మూఢమి,ముహూర్తములులేవు**

**వైశాఖమాసము**

13-5-2021 గురువారం, విదియ, రోహిణి, కుంభలగ్నం/ పుష్కరాంశ రా 2.10, గృహప్రవేశం,వివాహం

13-5-2021 గురువారం, విదియ, రోహిణి, మీనలగ్నం/ తులానవాంశ రా 3.12, గృహప్రవేశం,వివాహం

14-5-2021 శుక్రవారం, తదియ, మృగశిర, కుంభలగ్నం/ పుష్కరాంశ రా 2.06, గృహప్రవేశం,వివాహం

14-5-2021 శుక్రవారం, తదియ, మృగశిర, మీనలగ్నం/ తులానవాంశ రా 3.00, గృహప్రవేశం,వివాహం

16-5-2021 ఆదివారం, పంచమి, పునర్వసు,మీనలగ్నం/ పుష్కరాంశ రా 2.41, గృహప్రవేశం,పునర్వివాహం

23-5-2021 ఆదివారం, ద్వాదశి, చిత్త, కుంభలగ్నం/ కుంభనవాంశ రా 12.45, గృహప్రవేశం,వివాహం (పుష్కరాంశకు నవాంశచక్రం శుద్ధికాలేదు)

26-5-2021 బుధవారం, పాడ్యమి, అనూరాధ, కుంభలగ్నం/ మీననవాంశ రా 12.58, గృహప్రవేశం,వివాహం

27-5-2021 గురువారం, విదియ, మూల,కుంభలగ్నం/ పుష్కరాంశ రా 1.15, గృహప్రవేశం,వివాహం

28-5-2021 శుక్రవారం,తదియ,మూల,సింహలగ్నం/కర్కాటకనవాంశ ఉ12.04, ఉపనయనం,వివాహం, అక్షరస్వీకారం,దేవతాప్రతిష్ఠ,అన్నప్రాశన

30-5-2021 ఆదివారం, పంచమి, శ్రవణం, మీనలగ్నం/ పుష్కరాంశ రా 1.46, గృహప్రవేశం,వివాహం

31-5-2021 సోమవారం, షష్ఠి, ధనిష్ఠ, మీనలగ్నం/ పుష్కరాంశ రా 2.04, గృహప్రవేశం,వివాహం (రాత్రి 2వ భాగంలో ఉన్నది దోషంకాదు)

3-6-2021 గురువారం, నవమి, ఉత్తరాభాద్ర, కుంభలగ్నం/ పుష్కరాంశ రా 12.48, గృహప్రవేశం,వివాహం

4-6-2021 శుక్రవారం, దశమి, రేవతి, కుంభలగ్నం/ మీననవాంశ రా 12.21, గృహప్రవేశం,వివాహం

5-6-2021 శనివారం, ఏకాదశి, రేవతి, ధనుస్సులగ్నం/ పుష్కరాంశ రా 8.53, గృహప్రవేశం,వివాహం,గర్భాధానం

5-6-2021 శనివారం, ఏకాదశి, అశ్విని, కుంభలగ్నం/ మీననవాంశ రా 12.26, గృహప్రవేశం,వివాహం

5-6-2021 శనివారం, ఏకాదశి, అశ్విని, మీనలగ్నం/ పుష్కరాంశ రా 1.22, గృహప్రవేశం,వివాహం

**జ్యేష్ఠమాసము**

12-6-2021 శనివారం, తదియ, పునర్వసు, మీనలగ్నం/ తులానవాంశ రా 1.12, గృహప్రవేశం మాత్రమే

19-6-2021 శనివారం, నవమి, హస్త, సింహలగ్నం/ కన్యానవాంశ ఉ 11.05, అన్నప్రాశన,అక్షరస్వీకారం,వివాహం

20-6-2021 ఆదివారం, దశమి, చిత్త, సింహలగ్నం/ పుష్కరాంశ ఉ 11.19, అన్నప్రాశన,అక్షరస్వీకారం,వివాహం,దేవతాప్రతిష్ఠ, ఉపనయనం

20-6-2021 ఆదివారం, ఏకాదశి, స్వాతి, కుంభలగ్నం/ మీననవాంశ రా 11.25, గర్భాధానం,వివాహం

21-6-2021 సోమవారం, ఏకాదశి, స్వాతి, సింహలగ్నం/ కన్యానవాంశ ఉ 11.01, అన్నప్రాశన,అక్షరస్వీకారం,వివాహం,దేవతాప్రతిష్ఠ, ఉపనయనం

23-6-2021 బుధవారం, చతుర్దశి, అనూరాధ, సింహలగ్నం/ కన్యానవాంశ ఉ 11.00, అన్నప్రాశన,అక్షరస్వీకారం,వివాహం,దేవతాప్రతిష్ఠ

24-6-2021 గురువారం, పూర్ణిమ, మూల, మీనలగ్నం/ పుష్కరాంశ రా 12.07, వివాహం,గృహప్రవేశం

26-6-2021 శనివారం, తదియ, ఉత్తరాషాఢ, మీనలగ్నం/ పుష్కరాంశ రా 11.59, వివాహం,గృహప్రవేశం

27-6-2021 ఆదివారం, తదియ, శ్రవణం, సింహలగ్నం/ పుష్కరాంశ ఉ10.52, అన్నప్రాశన,అక్షరస్వీకారం,దేవతాప్రతిష్ఠ,ఉపనయనం

27-6-2021 ఆదివారం, తదియ, శ్రవణం, కన్యాలగ్నం/ మీననవాంశ ఉ12.08, అన్నప్రాశన,అక్షరస్వీకారం,దేవతాప్రతిష్ఠ,ఉపనయనం,వివాహం

27-6-2021 ఆదివారం, చవితి, శ్రవణం, మీనలగ్నం/ పుష్కరాంశ రా11.55, వివాహం,గృహప్రవేశం,గర్భాధానం

28-6-2021 సోమవారం, చవితి, ధనిష్ఠ, కన్యాలగ్నం/ మీననవాంశ ఉ12.05, అన్నప్రాశన,అక్షరస్వీకారం,దేవతాప్రతిష్ఠ,వివాహం

1-7-2021 గురువారం, సప్తమి, ఉత్తరాభాద్ర, కన్యాలగ్నం/ పుష్కరాంశ ఉ12.11, అన్నప్రాశన,అక్షరస్వీకారం,దేవతాప్రతిష్ఠ మాత్రమే (మిగిలినవి నిషిద్ధం)

1-7-2021 గురువారం, అష్టమి, ఉత్తరాభాద్ర, కుంభలగ్నం/ మీననవాంశ రా 10.42, వివాహం,గర్భాధానం,గృహప్రవేశం

3-7-2021 శనివారం, నవమి, అశ్విని, సింహలగ్నం/ పుష్కరాంశ ఉ10.28, అన్నప్రాశన,అక్షరస్వీకారం,వివాహం

3-7-2021 శనివారం, దశమి, అశ్విని, మీనలగ్నం/ తులానవాంశ రా11.48, వివాహం,గృహప్రవేశం,గర్భాధానం

**ఆషాఢమాసము – ముహూర్తములులేవు.మాసప్రయుక్త కార్యాలు చేయవచ్చు, శంకుస్థాపన చేయవచ్చును.**

# మాసముల వారీగా ధర - వరల వివరములు

అనేక రకములైన వస్తువుల ధరలు హెచ్చు తగ్గులు ఈ విధముగా ఉన్నవి. ఇది కేవలం అంచనాప్రాయంగా మాత్రమే సూచిస్తున్నాము. అసలు ధరలు ఎంతెంత పెరుగుతున్నాయో లేదా తగ్గుతున్నాయో మనమే ఆలోచించుకోవాలి. అందు కోసం ముఖ్యమైన కొన్ని వస్తువులు శాస్త్ర ప్రకారం, వర్తమాన మార్కెట్ విలువలకు సమతూకంగా ఇవ్వడం జరుగుతోంది. ఇందులో ధర పెరుగుతుందా, తగ్గుతుందా అనే విషయాన్ని మీరే నిర్ణయించుకోవలెను.

**1. చైత్రమాసము – మార్చి 25 నుండి ఏప్రియల్ 23 వరకు:**
ఈ నెల యందు దూది, ఇనుము, గోధుమలు, నూనెలు, తిలలు, ఆవాలు, కొబ్బరి, పోకచెక్కలు, ఫలములు, జీడిపప్పు, కిస్మిస్, బెల్లం, పంచదార, వెండి, బంగారం వీటి ధరలు పెరుగును. గోధుమలు, ధాన్యము, బియ్యం, పెసలు, మినుగులు, బఠానీలు, శనగల ధరలు తగ్గును. తక్కిన వస్తువులు సమధరలు కలుగును.

**2. వైశాఖమాసము – ఏప్రియల్ 24 నుండి మే 22 వరకు:**
ఈనెలలో వెండి, బంగారం, బెల్లం, పటికబెల్లం, ఇనుము, పత్తి, కొబ్బరి, నూనెలు ధరలు అధికముగా పెరుగును. ఇనుము బాగా ధర తగ్గినట్టుగా తగ్గి ఒకేసారి అధికముగా పెరుగు అవకాశములు కలవు. యవలు, శనగలు, బఠానీలు, పెసలు, అపరాలు, బియ్యము, వేరుశెనగలకు ధరలు కొద్దిగా తగ్గును.

**3. జ్యేష్ఠమాసము – మే 23 నుండి జూన్ 21 వరకు:**
ఈ నెల యందు లోహము, ఇనుములు, రాగి, సీసము, తిలలు, ఆవాలు, బెల్లం, నెయ్యి, పత్తి, రంగులు వీటికి అధికధరలు. రాహువు వలన వెండి చాలామట్టుకు ధరను కోల్పోవును. పళ్ళు, పూలు, కాగిత ములు, రసవస్తువులకు ధరలు స్వల్పముగా తగ్గుదల, తక్కినవానికి సమధరలు.

**4. ఆషాఢమాసము – జూన్ 22 నుండి జూలై 20 వరకు:**
ఈ నెల యందు పత్తి, నూలు వస్త్రములు, వేరుశనగ, పళ్ళు, పోకచెక్కలు, బెల్లం, తిలలు, ఆవాలు, వెండి, బంగారమునకు అధిక ధరలు కలుగును. ధాన్యము, మినుగులు, గోధుమలు, ముత్యములు, పగడములు, ఉప్పు, వస్త్రములు ధరలు తగ్గుముఖము. తక్కినవానికి సమధరలు.

**5. శ్రావణమాసము – జూలై 21 నుండి ఆగష్టు 19 వరకు:**
ఈ నెలలో వెండి, బంగారము, పత్తి, బెల్లం, తిలలు, ఎర్రని వస్త్రములు, ఎర్రధాన్యములు, రత్నములు అధిక ధరలు. గోధుమలు, చక్కెర, శనగలు, కర్పూరం, నారవస్తువులు, పొగాకు, తృణధాన్యము లకు ధర తగ్గును. తక్కినవి సమధరలు.

**6. భాద్రపదమాసము – ఆగష్టు 20 నుండి సెప్టెంబర్ 17 వరకు**
ఈ నెల యందు కొబ్బరి, తిలలు, రాగి, బంగారం, గోధుమలు, పశువులు, గడ్డి, ఉన్నివస్త్రములు, సిమ్మెంటు, కలప, ఇనుములకు ధరలు అధికము. వస్త్రములు, రంగులు, పువ్వులు, కూరగాయలు, కర్పూరం, రసవస్తువులకు ధరలు తగ్గును. తక్కినవి సమధరలు.

**7. ఆశ్వయుజమాసము – సెప్టెంబర్ 18 నుండి అక్టోబర్ 16 వరకు:**
ఈ నెలలో చందనము, రక్తచందనము, కొబ్బరి, అరటి పండ్ల జాతులు, ఉన్నివస్త్రములు, కలప, సిమ్మెంట్, పోకలు, తృణములు, అపరాలు, ఆవాలు మొదలగువానికి ధరలు హెచ్చుట, బంగారమునకు వెండికి కొద్దిగా తగ్గుదల, తక్కినవానికి సమధరలు.

**9. కార్తికమాసము – నవంబర్ 16 నుండి డిసెంబర్ 14 వరకు:**
ఈ నెలలో పువ్వులు, పత్తి, రాగి, ఇత్తడి, వెండి, బంగారం, ఉన్ని వస్త్రాలు, గోధుమలు, మినుగులు, పెసలు, సౌందర్యకరవస్తువులకు అధికధరలు, లోహము, సిమ్మెంటు, ఇటుకలు, మట్టివస్తువులు, కలప, నార వస్త్రములు, పేపరు, పుస్తకములకు స్వల్ప ధర తగ్గుదల. తక్కిన వస్తువులకు సమధరలు కలుగును.

**10. మార్గశిర మాసము – డిసెంబర్ 15 నుండి 2021 జనవరి 13 వరకు:**
ఈ నెలలో చేనేత వస్త్రములు, పత్తి, నూనెలు, కొబ్బరి ఆయుర్వే ఔషధములు, మణిశిల మొదలగు లోహములు, సత్తు, కంచు, ఇత్తడి, నువ్వులు, బంగారము, వెండి, పెట్రోలు, వంటగ్యాస్, వైద్యపరికరములు అధికధరలు. అపరాలు, మిరప, ఉల్లి, కూరగాయలు, వస్త్రములు, స్టేషనరీ, సామగ్రి ధరతగ్గుదాల తక్కినవి సమధరలు.

**11. పుష్యమాసము – జనవరి 14 నుండి ఫిబ్రవరి 11 వరకు:**
ఈ నెల యందు నెయ్యి, నూనెలు, బెల్లం, పటిక పంచదార, చీని, శనగలు, కర్పూరం, రాగివస్తువులు, పాల ఉత్పత్తులు, చాక్లెట్, టీ, కాఫీ మొదలగునవి అధికధరలు. కలప, గోధుమలు, నారవస్తువులు, ఆటవస్తువులు, అపరాలు, కూరగాయలకు ధరలు తగ్గుదల. తక్కిన వానికి నిలకడ.

**12. మాఘమాసము – ఫిబ్రవరి 12 నుండి మార్చి 13 వరకు:**
ఈ నెలలో అపరాలు, ఉప్పు, పప్పులు, గోధుమలు, సౌందర్య వస్తువులు, చందనము, కస్తూరి గోరోచనము, యాలకులు, లవంగాలు, దాల్చిన మొదలగువానికి అధికధరలు. నూనెలు, వస్త్రములు, చర్మవస్తువులు, నారవస్తువులు, బంగారం, వెండి వాటియందున స్వల్ప తగ్గుదల. తక్కినవి సమధరలు.

**13. ఫాల్గుణమాసము 14 మార్చి నుండి 13 ఏప్రియల్ వరకు:**
ఈ నెలలో ధాన్యము, పుష్పజాతులు, శనగలు, రసవస్తువులు, చీని బెల్లం, ఆవాలు, బంగారం, వెండి, పుస్తకములు, పేపర్లు, కూరగా యలు, ఉప్పు, పట్టువస్త్రములు, వాహనములు, టి.వి.మొదలగు ఉప కరణములకు అధికధరలు. చందనము, నూనెలు, నువ్వులు, బెల్లం మొదలగువానికి సమధరలు.

పంచాంగ కర్త:

**బ్రహ్మశ్రీ డా॥ఎ. ప్రసాద శర్మ సిద్ధాంతి గారు**

**శ్రీ చండీ పరమేశ్వరి వైదిక ఆగమ జ్యోతిష వాస్తు విజ్ఞాన పీఠం**

శ్రీ వాసవి సాయి సంతోషిమాత దేవాలయం
కామారెడ్డి గూడెం, మం॥ దేవరుప్పల
జి॥ జనగామ, తెలంగాణ
సెల్: 9866077928, 9849859487

# శ్రీ చండీ పరమేశ్వరి వైదిక ఆగమ జ్యోతిష వాస్తు విజ్ఞాన పీఠం



Reg.No: 3/2017

**శ్రీ చండీ పరమేశ్వరి వైదిక ఆగమ జ్యోతిష వాస్తు విజ్ఞాన కేంద్రం**
విజయ్ హోటల్ పైన,
ఘణపూర్ రోడ్ - పాలకుర్తి

- జ్యోతిష్యం సైంటిఫిక్‌గా చెప్పబడును.
- జాతక చక్రాలు ( జన్మనామాలు) వ్రాయబడును
- వివాహ పొంతనలు, వివాహసమస్యలకు పరిష్కారం చూపబడును.
- వాస్తు ప్రకారం ఇంటి ప్లాన్‌లు ఇవ్వబడును.
- ఇంటి వాస్తు సరిచేయబడును.
- వెంచర్ ప్లానింగ్ ఇవ్వబడును.
- బోర్ పాయింట్‌లు చూడబడును.
- జియోస్కానర్స్ & డౌజింగ్ పద్ధతుల్లో ఎట్టి వాస్తు ఇబ్బందులైనా కనిపెట్టి ఇంటి వాస్తు సరిచేయడం మా ప్రత్యేకత . . .

- మీ జాతక విద్యా-ఉద్యోగ , వ్యాపార, సంతాన, వాస్తు అన్ని అంశాలకు చక్కటి తరుణోపాయాలు చూపబడును.
- అన్నిరకాల శుభ యంత్రాలు, రుద్రాక్షలు, రత్నాలు, దైవిక వస్తువులు లభించును.
- వివాహ - గృహ ప్రవేశ, గృహారంభాది కార్యక్రమాలు సశాస్త్రీయముగా జరుపబడును.
- దేవాలయ వాస్తు, నిర్మాణం, ప్రతిష్ఠలు, బ్రహ్మోత్సవాలు వేదోక్తముగా జరుపబడును.
- యజ్ఞయాగాది క్రతువులు జరిపించుట మా అభిలాష . . .